అపరాధ పరిశోధన అనుబంధం—146

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## కొడుకు పిలుపు

రచన: వసుంధర

## దాడి?

రచన: బి. రాజేశ్వరి

## ఘాట్‌రోడ్ ప్రమాదం

రచన: బొమ్మిడి అచ్చారావు

అపరాధ పరిశోధన సప్లిమెంట్—146
ఫిబ్రవరి, 1986
వెల: రు. 6-50
ఏడాది చందా: 78 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ పీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# కొడుకు పిలుపు

వసుంధర

"అమ్మా!"

ఈ పిలుపుకులిక్కిపడి లేచింది సరళ. కళ్ళు నులుము కుని చుట్టూ చూసింది. గదిలో యింకెవ్వరూ లేరు.

విశాలమైన ఆ డబల్ కాట్ మీద సరళ, ఆమె భర్త వరప్రసాద్ వున్నారు. వరప్రసాద్ ముసుగుతన్ని నిద్రపోతున్నాడు.

ఎవరు పిలిచారు?

తను కలకన్నదా లేక భ్రమపడిందా?

ఆలోచిస్తూండగానే సరళకు అమ్మా అన్న పిలుపు మళ్ళీ వినిపించింది.

"ఎవరూ?" అందామె.

"ఇష్ — గట్టిగా మాట్లాడితే నాన్నగారు లేచి పోతారు. ఒక్కసారి పక్క గదిలోకి రామ్మా—"

ఆ గొంతు ఎక్కడో విన్నట్లే అనిపించింది సరళకు. ఎక్కడో వినడమేమిటి—అది రాజా గొంతు.

కానీ రాజు....

"రామ్మా!" మళ్ళీ వినపడిం దా గొంతు.

సరళ మంత్రముగ్ధురాలిలా లేచి పక్క గదిలోకి వెళ్ళింది.

"అమ్మా!"

"ఎవరు?" అంది సరళ.

"నన్ను గుర్తుపట్టలేదామ్మా?" దీనంగా అందా గొంతు.

"నా కెవ్వరూ కనిపించడంలేదు...."

"కానీ నా గొంతు వినిపిస్తోందిగా...."

"బాబూ—నిజంగా నువ్వేనా?" అంది సరళ.

"అవునమ్మా...."

"ఒక్కసారి నా కళ్ళకు కనిపించరా!" అంది సరళ.

"ఎలా కనిపించనమ్మా? ఇప్పుడు నువ్వు నన్ను చూస్తే భయపడతావు!"

"తల్లి బిడ్డను చూసి భయపడదు..."

"లేదమ్మా—బ్రతికున్నంత కాలమే తల్లి ప్రేమ అయినా!"

సరళ ఉలిక్కిపడి—"అవును—నువ్వు చచ్చిపోయావు కదూ!" అంది.

"అవునమ్మా — చచ్చిపోయినా నాకీ యింటిమీద మోజు తీరలేదు. నువ్వంటే ప్రేమ చావలేదు. నీ దగ్గరే ఉండాలనీ నీ ఒడిలో పడుకోవాలనీ కోరికగా వుంది. కానీ అదిప్పుడు సాధ్యంకాదు...."

"అయితే నువ్వింకా ఈ ఇంట్లోనే మసలుతున్నావా? అమ్మ నెప్పుడూ పలకరించలేదేం?" అంది సరళ.

"ఆ రోజు నాకింకా గుర్తుందమ్మా! ఉన్నట్టుండి నాకు

విరేచనాలు పట్టుకున్నాయి. ముందు నువ్వు పట్టించుకో లేదు. విరేచనాలెక్కువైపోయాయి. వాముకాలు నీళ్ళిచ్చావు. అయినా తగ్గలేదు. నాన్న డాక్టరు దగ్గరకు పరుగెత్తాడు. డాక్టరు వచ్చేసరికి నేను నీరసంగా పడుకుని వున్నాను. ఆయన నన్ను పరీక్షించి ముఖంమీద గుడ్డ కప్పాడు. మీరంతా పెద్దగా యేడ్చారు. ఏమయిందో నాకు తెలియలేదు. కాని నాకు నేను దూరంగా వుండి నన్ను చూసుకోగలుగుతున్నాను. నన్ను మీరెవ్వరూ చూడ్డంలేదు. నాన్న నా శరీరాన్ని మోసుకుని బయటకు వెళ్ళిపోయాడు.

అయితే నేను చచ్చిపోయానని నాకు చాలాకాలం దాకా తెలియలేదు. నేను మామూలుగానే యింట్లో తిరుగుతున్నాను. అందరికీ కనపడుతున్నాను. అయినా యెవ్వరూ నన్ను చూడనట్లే మసలుతున్నారు. పలకరించడంలేదు. నేనే పలకరించాలంటే నాకు గొంతు పెగిలేదికాదు. మాట్లాడాలని ఎంతగానో ప్రయత్నించాను.

మొదట్లో గాలిని పోగుచేసి కొన్ని శబ్దాలు చేయగలిగాను. ఆ చప్పుళ్ళు విని నువ్వు భయపడ్డావుకూడా! నిన్ను భయపెట్టకూడదని నువ్వింట్లో లేనప్పుడు గాలిలో శబ్దాలు చేసేవాణ్ని. క్రమంగా నాకు మాట్లాడ్డం వచ్చింది. కానీ అప్పటికింట్లో మాటలనుబట్టి నేను చచ్చిపోయానని అర్థమయింది. నాకు తెలుసు—చచ్చిపోయిన వాళ్ళంటే నీకు భయమని! అందుకే పలకరించలేదు...."

సరళ కళ్ళు చెమ్మగిల్లాయి — "మరిప్పుడు పలకరించావుగా—ఇలాగే రో—పలకరించరా—నాకెంతో తృప్తిగా వుంటుంది—" అందామె.

"అలాగేనమ్మా— కానీ ఇప్పుడెందుకు పలకరించానో తెలుసా?"

"నువ్వే చెప్పు—" అంది సరళ.

"అమ్మా — నువ్వు నాకు మాత్రమే అమ్మవు. ఇంకెవరికీ అమ్మవు కాకూడదు...."

"అంటే?"

"ఈ యింట్లో నీకింకో కొడుకుండకూడదు—"

"ఎందుకని?"

"నేనది భరించలేను—"

సరళ నిట్టూర్చి — "సరేలే—కానీ — ఒక్కసారి నువ్వు నాకు కనిపించకూడదూ?" అంది.

"ఇప్పుడు నేను తలచుకుంటే యేమైనా చేయగలను. నీకు కనిపించనూగలను—"

"అయితే కనిపించు" అంది సరళ ఆత్రంగా.

"అమ్మా—ఒకప్పటి నా రూపం నీకు తెలుసు. ఆ రూపాన్ని మళ్ళీ చూస్తే నీలో దుఃఖం పెరుగుతుంది. అది నాకిష్టంలేదు. అయినా ఇప్పటి నా రూపం వేరు. అది నీకు చూపించలేను—"

"ఎందుకని?"

"నిన్న మన పనిమనిషి రంగమ్మ గట్టిగా కేక పెట్టింది గుర్తుందా?"

సరళకు గుర్తు వచ్చింది. నిన్న ఉదయం ఇల్లూడుస్తూ ఓ గదిలోంచి హృదయవిదారకంగా అరిచింది రంగమ్మ. ఖంగారుపడి సరళ, వరప్రసాద్ ఆ గదిలోకి వెళ్ళి ఏం జరిగిందని అడిగారు. అప్పటికదింకా వణుకుతోంది. వాళ్ళను చూడగానే కాస్త సిగ్గుపడింది — "ఏమీ లేదమ్మా—ఎందుకో భయంవేసింది....—" అంది.

ఎందుకు భయంవేసిందో ఎంతడిగినా చెప్పలేదు.

"గుర్తుంది——" అంది సరళ.

"అప్పుడది నన్ను చూసింది——" అందా గొంతు.

సరళకు ఒళ్ళు జలదరించింది.

"అమ్మా —— నువ్వు నా వంక ప్రేమగా చూసి లాలించాలి. నన్ను చూసి భయపడి కేకలు పెట్టకూడదు. అందుకే నా రూపం నీకు చూపించను" అందా గొంతు.

"మరి——రంగమ్మకెందుకు కనిపించావు?"

"నన్ను చూస్తే మనుషులకేమనిపిస్తుందో చూడా అనుకున్నాను. రంగమ్మ భయపడకపోతే నా రూపం నీకూ చూపాలనుకున్నాను...."

"ఒక్కసారి——ఎప్పటి నా రాజులా కనిపించరా?" అంది సరళ.

"కనిపించను. కానీ గుర్తుంచుకో .... ఈ ఇంట్లో ఇంకెవరైనా నా స్థానంలో ప్రవేశించాలో వాళ్ళకు రోజూ నా అసలు రూపం చూపిస్తాను...."

"రాజా-నీ మాటలు వింటుంటే నాకు మళ్ళీ నిన్ను చూడాలనిపిస్తోంది. నీతోనే వుండాలనిపిస్తోంది——" అంది సరళ ఆత్రుతగా.

"నువ్వు నిజంగా యిష్టపడితే అన్ని యేర్పాట్లూ చేస్తాను. నువ్వూ నాన్నాకూడా వచ్చి నా దగ్గరుండొచ్చు——"

సరళ యేదో అనబోయింది. ఇంతలో వెనుకనుంచీ "సరళా! ఎవరితో మాట్లాడుతున్నావు?" అన్న వరప్రసాద్ కంఠమూ మెకు వినిపించింది.

"ఏమండీ యిలా రండీ —— మనబాబు మాట్లాడుతున్నాడు...." అంటూ ఉత్సాహంగా అరిచింది సరళ.

వరప్రసాద్ ఒక్క ఉదుటున ఆ గదిలోకి వచ్చి "ఏమిటన్నావ్?" అనడిగాడు.

సరళ అతడికి జరిగినదంతా చెప్పింది. అంతా విని వరప్రసాద్ నవ్వి—"చనిపోయినవాడు మళ్ళీ కనిపించడమేమిటి? నువ్వు భ్రమపడుతున్నావు...." అన్నాడు.

"భ్రమకాదు—నిజం—" అంది సరళ.

"అయితే ఏడీ వాడు?"

సరళ—"రాజా!" అని గట్టిగా పిలిచింది.

ఎవరూ పలకలేదు.

ఆత్రుతగా గదంతా కలయతిరిగింది.

ఎవరూ కనపడలేదు.

"నువ్వు భ్రమపడ్డావు సరళా!" అన్నాడు వరప్రసాద్.

అప్పటికి సరళ యీ లోకంలోకి వచ్చింది. తను భ్రమపడలేదని ఆమెకు తెలుసు. కానీ అంతసేపూ తను మానవాతీతశక్తితో మాట్లాడేనన్న స్పృహ ఆమెకు కలిగింది.

తనతో మాట్లాడినది కన్నకొడుకే కావచ్చు. కానీ వాడు మనిషి కాదు.

సరళ కవ్వున కేకపెట్టింది.

"ఏమయింది సరళా?" అంటూ వరప్రసాద్ ఆమెను సమీపించాడు.

అప్పటికే ఆమెకు స్పృహ తప్పింది. వళ్ళు ముట్టుకుని చూస్తే సలసల కాగిపోతోంది.

## 2

సరళ మామూలు మనిషి కావడానికి నాలుగురోజులు పట్టింది. ఈ నాలుగు రోజుల్లోనూ ఆమె బాగా చిక్కి

పోయింది. ఆమెకంటె యెక్కువగా చిక్కిపోయాడు వరప్రసాద్.

సరళ యే పరిస్థితుల్లో జ్వరపడిందీ తెలుసుకున్నాక ఆమెను మాడవచ్చిన డాక్టరు—"ఎందుకైనా మంచిది? మానసిక వైద్యుడికికూడా చూపించండి—" అన్నాడు.

ఆ విధంగా వరప్రసాద్ సీతాకరరావును కలుసుకున్నాడు. ఆయన ఆ ఊరిలో పేరుపడ్డ మానసిక నిపుణుడు. విషయం విని-"నేను ఫలానా అని మీ భార్యకు చెప్పకండి-" అన్నాడాయన. సరేనన్నాడు వరప్రసాద్.

సీతాకరరావు వరప్రసాద్‌కు దూరపు బంధువునని చెప్పి యింట్లో ప్రవేశించి ఆమెతో కబుర్లు ప్రారంభించాడు.

ఒక రోజంతా ఆయన చెప్పిన సరదా కబుర్లు సరళకు మానసికోల్లాసాన్ని కలిగించాయి. తర్వాత ఆయన నెమ్మదిగా సరళ పరిస్థితిని ఆకళింపు చేసుకున్నాడు.

వివాహమైన రెండేళ్ళకు సరళకు రాజా పుట్టాడు. పురిటి సమయంలో వచ్చిన కాంప్లికేషన్స్ కారణంగా ఆమెకు మరి పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయవలసి వచ్చింది. రాజా ఆ దంపతులకు ప్రాణం. పదేళ్ళు మాత్రం జీవించాడు వాడు. అతి విరేచనాలతో సుమారు సంవత్సరం క్రితం వాడు చచ్చిపోయాడు. వాడికోసం దంపతులిద్దరూ బెంగ పెట్టుకొని యెంతగానో ఏడ్చారు. క్రమంగా మనసు చిక్కబట్టుకున్నారు. ఇటీవలే ఓ కుర్రాడిని పెంపకానికి తీసుకోవాలనుకున్నారు. ఆ విషయమై మాట్లాడాలనుకున్న రోజునే ఈ విశేషం జరిగింది.

సీతాకరరావు సరళతో—"మన మనసు మనకంటే

బలమైనది. అంతర్గతంగా మనసులో వున్న ఆలోచనలు నిజాలుగా కళ్ళకు కట్టినట్లు కనబడుతూంటాయొకోసారి. ఇలా చాలామందికి జరిగింది. నువ్వు నీ బిడ్డను ప్రాణాధికంగా ప్రేమించావు. ఆ బిడ్డ స్థానంలో వేరొకరిని ప్రవేశపెడుతూంటే బాధనిపించింది. నీ బాబు బాధపడుతున్నట్లు భ్రమకలిగింది. అంతకు ముందురోజు పనిమనిషి భయపడినదానికీ దీనికీ నీ మనసు అన్వయించుకుంది. ఆ విధమైన ఆలోచనే.... నువ్వు నీ బాబుతో మాట్లాడిన సంభాషణ రూపం ధరించింది.... నువ్వు భయపడకు...." అన్నాడు.

"నిజంగా అంతే జరిగిందంటారా?" అంది సరళ ఆశ్చర్యంగా.

"ఇలాంటివి చాలా తెలుసు నాకు. నిజంగా అంతే జరిగింది."

"మళ్ళీ నాకు బాబు కనపడడా?"

"నీ మనసును నువ్వు అదుపు చేసుకుంటే బాబు నీకు కనపడడు ...."

"అందుకు నేనేం చేయాలి?"

"కొత్తగా యింటికి తెచ్చుకుంటున్న కుర్రాడిని నీ బాబనే అనుకోవాలి. అతడిలో నువ్వు నీ రాజాని చూడాలి___ ..." అన్నాడు సీతాకరరావు.

"అలా చేయడానికి ప్రయత్నిస్తాను. కానీ నా అనుభవం భ్రమగా నాకు తోచడంలేదు. ఒకవేళ మళ్ళీ రాజా నాకు కనబడితే ఏం చేయాలి?"

"రాజాను చూడ్డానికి నీ మనసు సిద్ధంగా లేదు. అందుకే నువ్వతడి మాటలు విన్నావు తప్ప చూడలేదు. రాజా నీకు కనబడడు. నువ్వు నీ మనసు నదుపు చేసుకో."

"కనబడితే ఏం చేయాలి?"

"ఒక్క విషయం....నిజంగా రాజా మళ్ళీ నీ ఎదుటకు వచ్చినా అతడు నీతో మాట్లాడతాడు తప్ప కనబడదు. అప్పుడు మాత్రం సువ్వాకణ్ని తలుచుకొని భయపడకు...."

"భయంవేస్తే?" అంది సరళ. అప్పటికే ఆమె కళ్ళు జలదరించింది.

"రాజా నీ కన్నకొడుకు. అతడు నీకెన్నడూ అప కారం తలపెట్టడు. దురదృష్టం మీ యిద్దర్నీ విడదీసింది. అంతమాత్రాన మీరు శత్రువులై పోరు గదా! నువ్వు తనకు భయపడితే రాజా పసిహృదయం యెంతగానో నొచ్చుకుంటుంది. నువ్వతడిని ఎప్పటి నీ కొడుకులాగే భావించాలి. గుర్తుంచుకో!" అన్నాడు సీతాకరరావు.

"ప్రయత్నిస్తాను...." అంది సరళ.

"నీకా అవసరముండకపోవచ్చు. రాజా మళ్ళీ నీకు కనపడడని నా నమ్మకం. ఇన్ని రోజులుగా నువ్వు మంచంపట్టావు. ఏదో ఒకరోజున నీతో వచ్చి మాట్లాడి యోగక్షేమాలు విచారించి వెళ్ళేవాడు—రాజా నిజంగా యింకా యీ యింట్లో ఉండివుంటే!" అన్నాడు సీతా కరరావు.

సరళ నిట్టూర్చింది.

ఆ రోజే సీతాకరరావు సెలవు తీసుకున్నాడు.

## 3

"అమ్మా!"

ఉలిక్కిపడి లేచికూర్చుంది సరళ.

అప్పుడింట్లో ఆమె తప్ప యెవరూ లేరు.

పనిమనిషి గిన్నెలుతోమి వెళ్ళిపోయింది. భర్త ఆఫీసులో వుంటాడు. సరళకు బద్ధకంగా వుండి పడు

కుంటే చిన్న కునుకుపట్టింది. ఆమెనిపుడు నిద్రలోంచీ యెవరో లేపారు.

"ఎవరు?" అంది సరళ.

"నేనమ్మా — రాజుని!"

"రాజా!" అంది సరళ ఉద్వేగంగా.

"అమ్మా! నేను భయపడితే పదేళ్ళొచ్చాయి సిగ్గు లేదూ అని వేళాకోళం చేసేదానివి. నువ్వు నన్ను చూసి భయపడ్డావా? నేను నిన్నేమీ చేయనమ్మా! నన్ను చూసి ఎందుకు భయపడ్డావ్?"

ఆ గొంతులోని ఆవేదన సరళను కదిలించింది — "ఇంకెప్పుడూ భయపడను రాజా!" అందామె.

"అమ్మా! నీకిప్పుడు కులాసాగా ఉందా?"

"ఉంది — ఇన్నాళ్ళూ నన్ను పలకరించలేదేం?"

"నువ్వు నీరసంగా వున్నావు. మళ్ళీ భయపడితే ప్రమాదమని ఊరుకున్నాను. ఈ రోజుకూడా అనుమానంగానే పలకరించాను. అమ్మా! నీకు భయంలేదుకదూ!"

"లేదు బాబూ! నువ్వు నాతో మాత్రమే ఎందుకు మాట్లాడుతున్నావు? నాన్నతో మాట్లాడకూడదూ? ఆయన సంతోషిస్తారు...."

"నేను నీతోనే మాట్లాడతాను. నాన్నతో మాట్లాడను...."

"ఎందుకని? ఆయనేం తప్పుచేశారు....?"

"తప్పు కాదు. పరీక్ష!"

"పరీక్షా?" అంది సరళ ఆశ్చర్యంగా.

"అవును. నేను మిమ్మల్నిద్దర్నీ నా దగ్గరకు తీసుకొని వెళ్ళడానికేర్పాట్లుచేస్తున్నాను. మీ రిద్దరూ మనస్ఫూర్తిగా ఒప్పుకుంటే తప్ప మిమ్మల్ని నా దగ్గరకు

తెచ్చుకోలేను, నేను నిన్ను బ్రతిమాలుకుంటాను—నా దగ్గరకొచ్చేయమని. నువ్వు నాన్నను బ్రతిమాలాలి....! నామీద ప్రేముంటే నువ్వు నాన్న నొప్పించగల్గుతావు. నామీద ప్రేముంటే నాన్న ఇందుకొప్పుకుంటాడు ఇదీ పరీక్ష!"

"ఇదేం పరీక్ష? నాన్న నా మాటలు నమ్మాలంటే నువ్వూ ఆయనకు కనిపించాలి. లేకుంటే నేనాయన్నెలా ఒప్పించగలను?"

"అదంతా నాకు తెలియదు...."

"నువ్వు మమ్మల్నెక్కడికి తీసుకొని వెడతావు?"

"అమ్మా—అది చాలా పెద్ద బంగళా....ఎంత విశాలంగా వుంటుందో....అందులో నువ్వూ, నేనూ, నాన్నా తప్ప యింకెవ్వరూ వుండం...."

"ఆ బంగళా ఎక్కడుంది?"

"అప్పుడే చెప్పను. నువ్వు ముందు నాన్నను ఒప్పించు...."

సరళ యేదో అనబోయింది. ఇంతలో కాలింగ్ బెల్ మ్రోగింది.

"అమ్మా—నాకు సెలవిప్పించు...."

సరళ ఆశ్చర్యంగా చూస్తూ చూసింది.

ఇంతసేపూ తనకేదో మైకం కమ్మినట్లయింది. తానెవరితో మాట్లాడింది?

మళ్ళీ ఆమెకు ఒళ్ళు జలదరించింది. భయం మనసును కమ్ముకోబోయింది. కానీ తనతో మాట్లాడినది....తన రక్తం పంచుకు పుట్టిన బాబు....

వాడికి తను భయపడటమా?

కాలింగ్ బెల్ మళ్ళీ మ్రోగింది.

సరళ లేచివెళ్ళి తలుపుతీసింది.

పక్కింటి పాపాయమ్మ!

"ఏంటమ్మా—నిద్రపోతున్నావా? తలుపుతీయడానికింత సేపా?" అందామె నిష్ఠూరంగా.

ఆమె ప్రశ్నకు బదులుగా చిన్నగా నవ్వింది సరళ— "రండి — లోపలకు—" అంది మర్యాదగా. ఇద్దరూ లోపలకు వెళ్ళి కూర్చున్నాక—"ఏమీ అనుకోకమ్మా— నాకు కూర్చునే టైము లేదు. అర్జంటుగా రెండుసోలల బొంబేరవ్వ కావాలి...." అంది.

పాపాయమ్మ యెప్పుడూ అప్పుకోసమే వస్తుందని సరళకు తెలుసు. అందుకని ఆమె మాట్లాడకుండా లేచి వంటింట్లోకి వెళ్ళింది. స్టీలుడబ్బా మూత తెరచిచూసింది. బొంబేరవ్వ డబ్బాలో సగానికిపైగా వుంది. ఓ కాగితం సంచీ తీసుకొని అందులోకి రెండు సోలలు కొలిచి పోసింది. తిరిగి స్టీలు డబ్బా మూత పెడుతూ ఉలిక్కి పడింది.

అప్పుడే ఆమెకు వినిపించింది—హృదయవిదారకమైన కేక!

వున్నపళంగా లేచి అటుగా వెళ్ళిందామె.

పాపాయమ్మ నిలబడి వుంది. ఆమె గజగజ వణికి పోతోంది.

"ఏమయిందండీ?" అంది సరళ.

పాపాయమ్మ తమాయించుకోవడానికి కాసేపుపట్టింది. సరళను మాని ఆమె-"అబ్బే—ఏమీ లేదు ...ఏమీ లేదు" అంది.

"మీ రేకదా—గట్టిగ అరిచారు....?" అంది సరళ.

"ఊఁ"

"ఎందుకు?"

"ఏమిటో చెప్పలేను....ఎందుకో జడుసుకున్నాను.."

"ఏమైనా చూశారా?"

పాపాయమ్మ క్షణం తటపటాయించి — "లేదు!" అంది.

సరళకు అనుమానం వచ్చింది. కొంతకాలం క్రితం రంగమ్మకూడా యిలాగే కేక పెట్టింది. అందుక్కారణం తనకు రాజు చెప్పాడు.

ఇప్పుడు పాపాయమ్మ రాజును చూసిందా?

వాడంత భయంకరంగా వున్నాడా?

"కూర్చోండి—రవ్వ తెస్తాను...." అంది సరళ.

"పద — నేనూ వంటింట్లోకి వస్తాను...." అంది పాపాయమ్మ.

ఆమె ఒంటరిగా అక్కడ కూర్చునేందుకు భయపడుతోందని సరళ గ్రహించింది. ఆమె రవ్వ యిచ్చి పాపాయమ్మను పంపేసేక — "రాజూ!" అని గట్టిగా పిలిచింది.

"పిలిచావా అమ్మా?"

సరళ ఆశ్చర్యంగా—"పిలిస్తే పలుకుతావా నువ్వు?" అంది.

"నువ్వెప్పుడు పిల్చినా పలుకుతాను. నా పలుకులు నీకు మాత్రమే వినిపిస్తాయి. ఇంకెవ్వరికీ వినిపించవు...."

"పాపాయమ్మకు కనిపించి బెదిరించావా?"

"బెదిరించలేదు. కనిపించాను...."

"ఎందుకు"

"నేను వాళ్ళింటికెళ్ళినప్పుడల్లా యే తలుపుచాటునో దాక్కుని నన్ను భయపెట్టేది. నేను భయపడితే పిరికి వెధవని గేలిచేసేది. ఆవిడ ధైర్యం ఏపాటిదో నాకిప్పుడు

తెలిసిపోయింది —" ఆ గొంతులో నవ్వు ధ్వనించింది.

"పెద్దవాళ్ళను బెదిరించడం తప్పుకదూ!" అంది సరళ.

"తప్పే!"

"మరెందుకిలా చేశావు?"

"ఎందుకు చేశానంటే....?"

"ఊఁ సందేహించకు.... చెప్పు!"

"నువ్వు మళ్ళీ భ్రమ అనుకోకుండా! నాతో మాట్లాడినదంతా భ్రమ అని నువ్వనుకుంటే — యెప్పటికీ నా దగ్గరకు రావాలనుకోవు....! నువ్వు భ్రమపడలేదనడానికి పాపాయమ్మగారే యిప్పుడు సాక్ష్యం!"

సరళ నిట్టూర్చి — "ఒక్కసారి .... ఒక్కసారంటే ఒక్కసారి నాకు కనిపించరా—నాకు చూడాలనుంది!" అంది.

"నువ్వు చూడాలనుకునే రూపం నాకిప్పుడు లేదు. ఇప్పుడు నాకున్న రూపాన్ని నీకు చూపలేను...."

"మరి మనం కలిసి ఉండాలంటే ఎలా?"

"చెప్పానుగా — నాన్నను తీసుకొని నా దగ్గర కొచ్చేయమని!"

"అప్పుడు మాత్రం నేను నిన్ను చూస్తే భయపడనా?"

"భయపడవు. అదంతా తర్వాత చెబుతానుగానీ నాకిక సెలవిప్పించు.... బంగళాకు వెళ్ళాలి...."

"రాజా!" అంది సరళ.

ఆమెకు బదులు రాలేదు.

## 4

సాయంత్రం భర్త ఆఫీసునుంచి రాగానే జరిగింది చెప్పింది సరళ. వరప్రసాద్ చటుక్కున ఆమె నుదుటి

మీద చేయివేసి చూసి — "హమ్మయ్య! నీకు జ్వరం రాలేదు-" అంటూ తేలికగా నిట్టూర్చాడు.

"జేనిక భయపడకండి-భయపడితే రాజు చిన్నబుచ్చుకుంటాడు...."

"ఇంకెక్కడి రాజు సరళా?" అన్నాడు వరప్రసాద్ బాధగా.

"మనం రాజుతో కలిసుండే అవకాశముందండీ— నా మాట వినండి మనం వాడి దగ్గరకు వెళ్ళిపోదాం. వాడు మనకోసం పెద్ద బంగళా చూసి వుంచాడు...."

"నీకు పిచ్చిపట్టలేదుగదా—చచ్చిపోయిన రాజు మనకోసం బంగళా చూసివుంచడమేమిటి?"

"ఏమో- నేను చెబుతున్నది నిజం...."

"నువ్వు చెప్పేది నేను నమ్ముతాను. వాణ్ని నాతో కూడా ఒకసారి మాట్లాడమను—" వేళాకోళంగా అన్నాడు వరప్రసాద్.

"వాడు చెప్పనే చెప్పాడు-మీతో మాట్లాడనని!"

"నువ్వు భ్రమపడుతున్నావనడంలో సందేహంలేదు. కానీ నీ భ్రమలో తెలివి వుంది—" అన్నాడు వరప్రసాద్.

"ఒక్కసారి ఒప్పుకోండి. మనం వాడి దగ్గరకు వెళ్ళి వుండొచ్చు...."

"మనం వాడిదగ్గరకెందుకూ వెళ్లడం? వాడే మనతో కలిసుండొచ్చుగా...."

సరళ ఆలోచనలో పడింది.

"సరళా! ఈసారి నీతో వాడు మాట్లాడితే చెప్పు. వాడు చెప్పలేకపోయినా వాణ్ని మన దగ్గరకు వచ్చేయ

మను...” అని - “ఈ వేళ ఆఫీసుకు ఫోనొచ్చింది, ముకుందరావుగారు మాట్లాడేరు....” అన్నాడు వరప్రసాద్.

ముకుందరావనగానే అర్థమయింది సరళకు.

ఆయనకు ఎనమండుగురు పిల్లలు. అయిదుగురు మగ పిల్లలు ముగ్గురాడపిల్లలు. పదేళ్ల వాళ్లబ్బాయి గోపిని వరప్రసాద్ కు పెంపకంగా యివ్వాలనుకుంటున్నాడు. అందుకు కొంత డబ్బిస్తాడాయనకు వరప్రసాద్. ఆ డబ్బుతో కూతురి పెళ్ళి చేయాలని ఆయన తాపత్రయం.

గోపి అచ్చం రాజులా వుంటాడని ఆయనంటాడు కానీ సరళకలా అనిపించలేదు. అయితే గోపికి—సరళింటికి వెళ్ళిపోవాలనుంది. అంతమంది పిల్లల మధ్య తనకు భవిష్యత్తు లేదని వాడి పసిహృదయానికర్థమైపోయింది. ఒకరిద్దరు మాత్రమే పిల్లలున్న యింట్లో వాళ్ళెలా పెరుగుతారో వాడు కళ్లారా చూసీ వున్నాడు.

పెంపకం మాటలు తేల్చేయాలనుకుంటూండగా సరళ జడుసుకొని మంచంపట్టింది. ఆ విధంగా కొంత వాయిదా పడ్డాక యిప్పుడు ముకుందరావు మళ్ళీ ఫోన్ చేశాడు.

“ఏమంటారు?”

“త్వరగా యేదో ఒకటి తేల్చి చెప్పమన్నాడు. లేకుంటే వాళ్ళబ్బాయి నింకెవరికైనా పెంపకానికిచ్చేసాటట....”

“ఇచ్చేయమనండి—” అంది సరళ.

“అనడం సులభమే! కానీ మనకు గోపీలాంటి కుర్రాడు దొరకడు. వాడిలో పోయిన మన రాజును చూసుకోవచ్చు. మన రాజులాగే వాడెంతో బుద్ధిమంతుడు కూడా!”

"అవును. కానీ రాజే మనకు దొరుకుతూంటే—
వేరే ఎవరో ఎందుకు?"

"అంతా నీ భ్రమ! రాజు మనకు దొరికితే—గోపీ
లోనే దొరకాలి!"

సరళ ఆలోచనలో పడింది.

"సరళా! గోపి పరిస్థితి చూస్తే నాకు ముకుందరావు
గారంటే అసహ్యం కలిగింది. ఈ రోజుల్లో చాలీచాలని
ఆదాయంతో ఆయన అంతమంది బిడ్డల్నెందుకు కనాలి?
ఇప్పుడా తలిదండ్రులు ప్రతిరోజూ బిడ్డల్ని విసుక్కుం
టూనే వుంటారు....బయటివాళ్ళు చూస్తూండగా తిడితే
పిల్లలు చిన్నబుచ్చుకుంటారనికూడా లేదు...."

"అంతే లెండి! అలాంటి వాళ్ళకే దేవుడూ పిల్లల్ని
స్తాడు. మనకెందుకు పిల్లలు లేకుండా పోయారో
నాకిప్పటికీ అర్థంకాదు. తప్పు మనుషులది కాదు—
దేవుడిదే!"

"నేను గోపీతో మాట్లాడాను. వాడికి . మనింటికి
వచ్చి వుండాలని వుంది...."

"ఎందుకట?"

"ముందు మొహమాటపడ్డాడు కానీ తర్వాత ఒకొ
క్కటే చెప్పాడు. వాడికి మంచి బట్టలు వేసుకోవాల
నుంది. కాళ్ళకు కొత్త జోళ్ళు వేసుకోవాలనుంది. వాళ్ళ
నాన్నయితే అసలు కాళ్ళకు జోళ్ళే వద్దంటాడుట....
ఇంకా వాడికి రోజూ కడుపునిండా భోంచేయాలనుంది."

"ఊఁ"

"అన్నట్లు-వాడు జిలేబీ తిని రెండేళ్ళయిందట...."

"అయితే?"

"జిలేబీ అంటే వాడికెంతో యిష్టం...."

"పాపం...."

"పాపమని ఊరుకుంటా వేమిటి సరళా - మర్చిపోయావా? మన రాజాకి జిలేబీ అంటే ఎంత ఇష్టం?"

సరళ ఉలిక్కిపడి - "ఏమన్నారూ? గోపీకి జిలేబీ యిష్టమా-రెండేళ్ల నుంచి వాడది తినలేదా?" అంది.

"అవును - సరళా!"

"అయితే పదండి - మన మిప్పుడే ముకుందరావు గారింటికి బయల్దేరి వెడదాం - గోపీని త్వరగా మనింటికి తెచ్చుకుందాం...." అంది సరళ. ఆమె కనులలో గోపీకి జిలేబీ చేసి పెట్టాలన్న ఆత్రుత చూసి - "తల్లి మనసు ఎంత గొప్పది?" అనుకున్నాడు వరప్రసాద్.

## 5

చాలా సింపుల్ గా పెంపకం అయిపోయింది.

గోపి వరప్రసాద్ ఇంటికి వచ్చేశాడు.

వాడికిప్పుడు కొత్త బట్టలు, బూట్లు, స్కూల్ బ్యాగ్, పుస్తకాలు....

ఇంట్లో వాడికి ప్రత్యేకంగా ఒక గది....మంచం.... బీరువా....

అవన్నీ రాజావి....

ఇప్పుడు గోపివి....

గోపి తన కొత్త హోదాను చూసుకొని మురిసిపోతున్నాడు.

వాడికి తలిదండ్రుల్ని వదిలి వచ్చానన్న బెంగలేదు. ఆ యింట్లో వాడు సదుపాయాలెరుగడు. అభిమానం ఎరుగడు. అడిగినదేమీ దొరికేదికాదు. అస్తమానూ పని వుండేది. ఆడుకుందామన్నా కూడా తీరుబడి దొరికేదికాదు.

గోపి తలిదండ్రులు వాడిని ప్రేమించకపోలేదు.

బాధ్యతల బరువులో తమ ప్రేమను ప్రకటించే అవకాశం కూడా లేదు వారికి.

సరళ గోపీతో రాజును చూసింది. ఆమెలోని మాతృప్రేమ ఉప్పొంగి, అందులో తలమునకలై ఉక్కిరి బిక్కిరయ్యాడు వాడు. అయినా వాడికి సంతోషంగానే వుంది.

అన్నీ యిచ్చే నాన్న....అభిమానించే అమ్మ....ఆడుకుందుకు బోలెడు బొమ్మలు .... బడిలో సాటి విద్యార్థుల మధ్య గర్వంగా తలెత్తుకు నిలబడగల హోదా....

ఏ పిల్లలైనా యింతకుమించి కోరుకునేదేమిటి?

అలా వారం రోజులు గడిచాయి.

ఆ రోజు ఆదివారం.

వరప్రసాద్ కూరలు తెస్తానని బజారుకు వెళ్లాడు.

గోపి హోంవర్క్ చేసుకుంటున్నాడు తన గదిలో.

సరళ వంటింట్లో వంట ప్రయత్నాలు చేస్తోంది.

అప్పుడామెకు వినపడింది—ఉన్నట్లుండి—హృదయ విదారకమైన కేక....

ఉన్నపళంగా సరళ ఆ కేకవచ్చిన వైపు పరుగెత్తింది.

గదిలో గోపి లేచి నిలబడి వున్నాడు. వాడు గజగజ వణికిపోతున్నాడు.

"ఏమయింది గోపీ?" అంది సరళ.

కాసేపు గోపికి నోట మాటరాలేదు.

"ఏమయిందిరా?" అంటూ ఆమె వాడిని సమీపించి దగ్గరగా తీసుకుంది.

ఆమె ఒడిలో త్వరగానే తేరుకున్నాడు గోపి.

"దెయ్యం!" అన్నాడు వాడు.

"దెయ్యమా—ఎక్కడ?" అందామె.

"ఇంగ్లీషు హోం వర్కు అయిపోయింది. ఆ పుస్తకాలు బీరువాలో పెట్టి లెక్కల పుస్తకం తెచ్చుకుందామను కున్నాను. తలెత్తిచూస్తే బీరువా తలుపులకు అడ్డంగా నిలబడి వుంది దెయ్యం!"

"ఛీ—దెయ్యాలనేవి మన భ్రమ .... అవెక్కడా వుండవు...."

"కానీ నేను చూశానమ్మా!" అన్నాడు గోపి.

"చూస్తే—ఎలా వుంది దెయ్యం?"

"పొట్టిగా ఉంది. నా అంత ఎత్తే వుంది!"

సరళ కిలకిల్కా నవ్వింది.

రాజు నిజంగా దెయ్యమయ్యాడా?

"దెయ్యాన్ని చూసి యెందుకు భయపడ్డావు? నువ్వు పిరికివాడివా?"

"నేను భయపడలేదు. అదే నన్ను భయపెట్టింది...."

"భయపెట్టిందా....ఎలా?"

"ఎర్రటి గుడ్లు .... గాలిలో తేలిపోతున్నట్లుంది.... అస్పష్టంగా వుంది ఆకారం.... నేను తనవైపు చూడగానే నాలిక పొడుగ్గా చాపింది .... అంతే .... నాకు భయం వేసింది...."

సరళ ముఖం గంభీరంగా అయిపోయింది—"గోపీ! నువ్వనవసరంగా భయపడ్డావు. కాసేపు పక్కింటి పాపాయమ్మగారింటికి వెళ్ళి ఆడుకునిరా.... భయం తగ్గుతుంది. దెయ్యాన్ని చూశానని పాపాయమ్మగారికి చెప్పకు .."

"నేనిప్పుడు ఆడుకోనమ్మా...."

"మరేం చేస్తావు?"

"నీ దగ్గరే కూర్చుంటాను...."

"వద్దు పాపాయమ్మగారింట్లో ఆంజనేయులున్నాడు. అక్కడికి వెళ్ళకపోతే నిన్నే దెయ్యాలూ బాధించవు.... నా మాట విని కాసేపు ఆడుకుని రా...."

ఏమనుకున్నాడో గోపి పక్కింటికి వెళ్ళిపోయాడు. సరళ తలుపులు వేసి గోపి గదిలోకి వెళ్ళి — "రాజా!" అని గంభీరంగా పిలిచింది.

"నువ్వు పిలుస్తావని నాకు తెలుసు...." అని వినిపించిందో గొంతు.

"ఇన్నాళ్ళూ ఏమైపోయావు?"

"మనకోసం బంగళాలో మంచి ఏర్పాట్లు చేశాను. నిన్న రాత్రే తిరిగి వచ్చాను."

"ఇప్పుడు నువ్వు చేసిన పని యేమీ బాగోలేదు...." అంది సరళ.

"ఏం చేశానమ్మా?"

"గోపీనెందుకు భయపెట్టావు?"

"వాడు నా మంచంమీద పడుకున్నాడు. నా గదిలో వుంటున్నాడు. నా బీరువా వాడుకుంటున్నాడు. నా బట్టలు వేసుకుంటున్నాడు—"

"అవన్నీ నీకిప్పుడవసరంలేదు కదా!"

"లేకపోయినా సరే—అవి నావి...."

"చాలా తప్పు రాజా! మనకు పనికిరాని వస్తువులు ఇతరుల ప్రయోజనాలకుపయోగపడితే చూసి సంతోషించాలి నువ్వు..."

"అయితే ఇంతకాలం నువ్వా బీరువాని వేరే పనికెందుకు వాడలేదు? నా మంచాన్ని వేరే యెవ్వరికీ యెందుకివ్వలేదు? నా బట్టలు పేద బాలురకెందుకు పంచి

పెట్టలేవు?"

సరళ తడబడుతూ — "అవన్నీ నీ జ్ఞాపకంగా వుంచుకోవాలనుకొన్నాను—" అంది.

"మరిప్పుడెందుకుంచుకోవడంలేదు?"

సరళ మాట్లాడలేదు.

"చెప్పమ్మా?"

"గోపీ అవన్నీ వాడుకొంటే నీకు నష్టమేముంది?"

"నష్టమేమీ లేదు.... కానీ ..."

"ఊఁ.... చెప్పు...."

"వాడు నిన్ను అమ్మా అని పిలుస్తున్నాడు...."

"అయితే?"

"నువ్వు రాత్రి కాసేపు వాడి పక్కలో పడుకొన్నావు...."

"అయితే?"

"ఇందాకా భయపడితే వాణ్ని దగ్గరగా తీసుకొన్నావు...."

"అందులో తప్పేముంది?"

"నువ్వలా ఎందుకు చేయాలి?"

"పాపం — వాడు వాళ్లమ్మ దగ్గరే వుండేవాడు. అప్పుడు వాళ్లమ్మ యివన్నీ చేసేది. వాళ్లకు డబ్బులేదు కదా — అందుకని వాడికి తిండి పెట్టలేక మనింటికి పంపారు. ఇప్పుడు వాణ్నెవరలా చూస్తారు..? నేనే చూడాలి కదా!" అంది సరళ.

"నువ్వు వాడినలా చూస్తే నాకు నచ్చదు..."

"ఎందుకని?"

"నువ్వు నాకు మాత్రమే అమ్మవు. గోపీకి కాదు.."

"తప్పు..అలా అనకూడదు.."

"ముందే చెబుతున్నాను. మామూలుగా యే చుట్టా లబ్బాయిలాగో వుంటే ఫరవాలేదు. నువ్వు నన్ను చూసి నట్లే గోపీనీ చూశావంటే నేను సహించను. వాణ్ణి భయపెట్టి తరిమేస్తాను.."

"రాజా.."

"ఇంక నీతో మాట్లాడను..నువ్వు ముందు నాన్నను నా దగ్గరకు రావడానికొప్పించు..." అందా గొంతు.

"నువ్వు గోపీ జోలికి వెడితే నేను నీ దగ్గరకు రాను."

"నేను గోపీ జోలికి వెళ్ళకపోతే నువ్వు నన్ను మర్చి పోతావు. నువ్వు మర్చిపోతే నేను భరించలేను.."

"రాజా—ఏమిట్రా యిది?"

"ఇంక నేను మాట్లాడను. అవతల మనం కలిసుండ డానికి నేనన్నో యేర్పాట్లు చేస్తున్నాను. నువ్వేమో ఇంకెవణ్ణో తెచ్చి యింట్లో పెట్టుకొని నన్ను మర్చిపోవా లనుకొంటున్నావు. కానీ నేను నిన్ను మర్చిపోనివ్వను. గోపీనింట్లోంచి తరిమేస్తాను..."

సరళ మ్రాన్పడిపోయింది.

## 6

కూరలు తీసుకొని వచ్చేక వరప్రసాద్ భార్య నోట జరిగినదంతా విని—"సరళా—నీ భ్రమ చాలాదూరం వెళ్ళింది—...." అన్నాడు.

"నా భ్రమేమిటి? భయపడింది నేనుకాదు....గోపీ!" అంది సరళ.

"అసలు విషయం నేను చెబుతున్నాను. విని ఖంగారు పడకూడదు...." అన్నాడు వరప్రసాద్ సాలోచనగా.

"ఏమిటండీ—ఆ అసలు విషయం?" అంది సరళ.

"జాగ్రత్తగా విను. సావధానంగా ఆలోచించు.

అంతే తప్పు — కాదని బుకాయించకు...." అన్నాడు వరప్రసాద్.

"ఏమిటో చెప్పండీ ..." అంది సరళ ఖంగారుగా.

"గోపీ మనింట్లో వుండడం నీకిష్టంలేదు. అందుకని నువ్వే వాడిని దెయ్యం పేరు చెప్పి హడలగొట్టావు...." అన్నాడు వరప్రసాద్.

ఈ ఆరోపణకు సరళ కళ్లలో నీళ్లు తిరిగాయి— "రామరామ! పసివాణ్ని నేనెందుకు బెదిరిస్తాను? నాకు గోపీ ఒకటి రాజు ఒకటీనా?" అంది.

"అది నిజమే కానీ అంతరాంతరాల్లో నీకు తెలియకుండా దాగివున్న భావమది. ఒకోసారి నువ్వు చేసేవన్నీ నీకు తెలియవు. రాజునింకా మనసులోంచి తుడిచిపెట్టలేకపోతున్నావు. గోపీని పెంచుకోవాలనీ వుంది. కానీ రాజు పొందవలసిన సుఖసంతోషాలు గోపీ పొందుతూంటే నీలోని తల్లి మనసు సహించలేకపోతోంది. నువ్వు రాజును చూసి మాట్లాడ్డం నీ భ్రమ. గోపీని నీకు తెలియకుండా నువ్వే భయపెట్టావు. నువ్వు వాణ్ని పొమ్మనలేవు. వాడే యిక్కడుండనని గోలపెట్టి వెళ్ళిపోవాలి. అదీ నీ ఎత్తు...."

"అయితే రంగమ్మనీ పాపాయమ్మనీకూడా నేనే బెదిరించానా?"

"అవును—అందర్నీ నువ్వే బెదిరించావు. ఈ ఇంట్లో లేని దెయ్యాన్ని వున్నట్లు భ్రమ కలిగించడానికి తాపత్రయపడుతున్నావు...."

"అనండి....ఎన్నైనా అనండి... నేను నేరస్థురాలిని."

"సరళా!" అనునయంగా అన్నాడు వరప్రసాద్— "నేను నిన్ను తప్పు పట్టడంలేదు. నేరస్థురాలిని చేయడం

లేదు. ఈ విషయం బాగా ఆలోచించు. నీ మెదడును నువ్వే అదుపు చేసుకో. ఒకసారి నీ మెదడు నీకు లొంగిందా—అప్పుడు నువ్వు గోపీలో రాజును చూడ గల్గుతావు. జీవితం సుఖంగా వుంటుంది!"

"మిమ్మల్నెలా నమ్మించాలో నాకు తెలియడంలేదు" అంది సరళ అసహాయంగా.

"నన్ను నమ్మించడానికొక్కటే మార్గముంది. ఒక్క సారి రాజును నాకు కనపడమను—" అన్నాడు వర ప్రసాద్.

"వాడు మీకు కనపడడు—" అంది సరళ.

"ఎందుకని?"

"ఎందుకో నాకు తెలియదు. కానీ ఒక విషయం చెబుతాను. నన్ను నమ్మండి. రాజా నిజంగా నాతో మాట్లాడుతున్నాడు. వాడు గోపీకి అపకారం తలపెడ తాడు. గోపీకేదైనా జరిగితే మీరది నాకే అంటగట్టే లాగున్నారు. నిజం చెబుతున్నాను. గోపీని నేను కన్న తల్లిలాగే ప్రేమిస్తున్నాను. వాడిని నేను కావాలన్నా ద్వేషించలేను...." అంది సరళ.

వరప్రసాద్ ఇంకేదో అనబోయాడు కానీ సరళ వున్నపళంగా కూర్చుని ఏడుపు ప్రారంభించింది.

"ఏడవకు సరళా! నాకు నీ మంచితనం తెలుసు.... నా మాటలు నువ్వపార్థం చేసుకొన్నావు...." అంటూ వరప్రసాద్ ఆమెకు దగ్గరయ్యాడు.

"మీరు నన్నపార్థం చేసుకున్నారని నాకు బాధ లేదు. కానీ గోపీ యిప్పుడు ప్రమాదంలో వున్నాడు. నా మాట విని వాణ్ని రక్షించే ఉపాయం చూడండి" అంది సరళ.

"ఏం చేయాలో నువ్వే చెప్పు.."

"గోపీని వేరే యింట్లో ఉంచుదాం...."

వరప్రసాద్ నిట్టూర్చి—"గోపీ మరీ పసివాడు కాదు. వాడి అభిప్రాయంకూడా తెలుసుకుందాం — " అంటూండగా కాలింగ్ బెల్ మ్రోగింది.

గోపీ పాపాయమ్మగారింటినుంచి తిరిగివచ్చాడు.

వాడి ముఖంలో ఇప్పుడెక్కడా భయం ఛాయలు లేవు. వరప్రసాద్ వాడివంకే ఆశ్చర్యంగా చూస్తూ— "ఈ సమయంలో ఆటలేమిట్రా?" అన్నాడు.

"అమ్మే పంపింది.." అన్నాడు గోపీ.

"ఎందుకు?"

ఈ ప్రశ్నకు బదులిచ్చేలోగా గోపీ ముఖంలో ప్రవేశించిన భయాన్ని స్పష్టంగా చూశాడు వరప్రసాద్. వాడు తను దెయ్యాన్ని చూసిన విషయం చెప్పాడు.

"అనవసరంగా భయపడ్డావు. అమ్మే నీ ధైర్యం పరీక్షించడానికి దెయ్యం వేషం వేసుకుంది" అన్నాడు వరప్రసాద్.

గోపీ వెంటనే-"అమ్మెప్పుడూ నన్నలా భయపెట్టదు. అదీకాక అప్పుడమ్మ వంటింట్లో పని చేసుకొంటోంది. నేను నిజంగా దెయ్యాన్ని చూశాను. దెయ్యం కాకపోతే నాలికనంత పొడవుగా చాపడమింకెవరికీసాధ్యం కాదు" అన్నాడు నమ్మకంగా.

"ఒకవేళ భ్రమపడ్డావేమో—" అన్నాడు వరప్రసాద్.

"అయితే అయుండవచ్చు. కానీ అమ్మ మాత్రం నన్ను భయపెట్టలేదు. నాకు బాగా తెలుసు" అన్నాడు గోపీ.

సరళ చటుక్కున—"గోపీ—నువ్వు భ్రమపడలేదు. ఈ యింట్లో నిజంగా దెయ్యముంది—" అంది.

వరప్రసాద్ ఉలిక్కిపడి సరళా—"నువ్వేం చెబుతున్నావో తెలుసా?" అన్నాడు.

"తెలుసు. నిజం తెలుసుకోనడం వాడికీ మంచిది—" అని—"గోపీ—నీకు తెలుసుగదా! రాజు నీ యీడువాడే. దురదృష్టంకొద్దీ అర్ధాంతరంగా పోయాడు. అయితే వాడి ఆత్మ దెయ్యమై ఈ యింట్లోనే తిరుగుతోంది/ వాడు నిన్ను చూసి అసూయపడుతున్నాడు. నిన్ని యింట్లోంచి తరిమేయాలని నిన్ను బెదిరిస్తున్నాడు. ఇలాంటిచోట నువ్వుండగలవా?" అంది సరళ.

గోపీ ప్రమాన్పడిపోయి సరళ వంక చూశాడు. ఆమె ఏం చెప్పిందీ వాడికి సరిగ్గా అర్ధంకాలేదు. సరళ వాడిని దగ్గరగా తీసుకొని చిన్నపిల్లల కర్థమయ్యే విధంగా దెయ్యం ఆలోచన గురించి చెప్పింది.

గోపీ అంతా బుద్ధిగా విని—"అంటే ఈ యింట్లో దెయ్యం తిరుగుతోందన్నమాట...." అన్నాడు.

"అవును...."

"ఆ దెయ్యం నామీద పగబట్టిందన్నమాట!"

"అవును...."

"అమ్మా! ఆ దెయ్యం నీ కొడుకే అయితే అది నన్నేమీ చేయదు. ఈసారది నన్ను బెదిరిస్తే నన్నేం చేయకద్దని బ్రతిమాలుకుంటాను. కానీ యిక్కడే వుంటాను. ఇంకెక్కడికీ నన్ను పంపించొద్దు-" అన్నాడు గోపీ.

వరప్రసాద్ వాడిని దగ్గరగా తీసుకొని — "నువ్విక్కడే వుండువుగాని లే బాబూ!" అన్నాడు.

సరళ వెంటనే — "నిర్ణయం తీసుకుంటే సరిపోదు. వాడికే అపకారం జరిగినా ఆ తర్వాత మీరు నన్ను తప్పు పట్టకూడదు...." అంది.

"అమ్మా! నాన్న నిన్ను తప్పుపట్టినా నేనొప్పుకోను" అన్నాడు గోపీ.

అప్రయత్నంగా సరళకూడా వాడిని దగ్గరగా లాక్కుంది. గోపీ పరవశంతో కళ్ళు మూసుకొని తెరిచి ఏం చూశాడో యేమో — కెవ్వుమన్నాడు.

ఆ తర్వాత వాడికి ఒళ్ళు సలసల కాగిపోయింది. వరప్రసాద్ వైద్యుడికోసం వెంటనే పరుగెత్తాడు.

## 7

వైద్యుడు వచ్చి మందిచ్చి తీసుకోవలసిన జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయాడు.

ఆయన గోపీకేమీ ప్రమాదం లేదని చెప్పినప్పటికీ ఆ రోజంతా వాడికి స్పృహ లేదు. మందు ప్రభావం వల్ల వాడికి మగతగా ఉండి వుంటుందని వరప్రసాద్ అన్నాడు. కానీ సరళకు మనసు మనసులో లేదు.

ఆమె ఆ రాత్రంతా మెలకువగా వుండి గోపీ పక్కలోనే కూర్చుంది. వరప్రసాద్ తనూ మెలకువగానే వుండాలనుకున్నాడు కానీ నిద్రనాపుకోలేకపోయాడు.

ఒక రాత్రివేళ "అమ్మా!" అన్న పిలుపు వినబడి సరళ ఉలిక్కిపడింది.

"బాబూ—గోపీ—మెలకువొచ్చిందా?" అందామె.

కానీ గోపీ యింకా మగతలోనే వున్నాడు.

మళ్ళీ సరళకు—"అమ్మా!" అన్న పిలుపు వినిపించింది.

"ఎవరది—రాజా?" అంది సరళ.

"అవునమ్మా— నేనే!"

"ఎందుకు నన్ను పిలిచావు?"

"నువ్వు గోపీ దగ్గర కూర్చోవద్దు...."

"అది సరే—నువ్వెందుకు నన్ను పిలిచావు?"

"నిన్ను గోపీ వద్ద కూర్చోవద్దని చెప్పడానికి...."

"నేను వీడి దగ్గర కూర్చుంటే నీకేం నష్టం?"

"నా బాధ నీకెందుకర్థంకాదు? నువ్వు నా అమ్మవి. నేనెంత పిలిచినా నువ్వు నా దగ్గరకు రావడంలేదు. గోపీ మూలంగా నువ్వు నన్ను మర్చిపోతున్నావుకూడా!"

"గోపీ మనింట్లో వున్నప్పుడు ప్రేమగా చూసుకోవాలి కదా!"

"ఏమో — అదంతా నాకు తెలియదు....ఇందాకా నువ్వు వాణ్ణి అభిమానంగా దగ్గరగా తీసుకున్నావు. నేనది చూడలేకపోయాను. వెంటనే వాడికి కనబడి బెదిరించాను. వాడిలిపోయాడంటే...."

"అంటే నువ్వు మళ్ళీ గోపీని బెదిరించావన్నమాట... అందుకే వాడికి జ్వరం వచ్చింది. ఇలాగైతే రాజా.... నేను నిన్నసహ్యించుకుంటానేమో...." అంది సరళ.

"అమ్మా—నువ్వలాగంటే నాకేడుపొస్తుంది. మా అమ్మ నన్ను కాదని ఇంకెవరినో ప్రేమగా చూస్తుంటే నాకోపం రాదా?"

"కానీ నేనేం చేయను? నువ్వు చచ్చిపోయావు...."

"చచ్చిపోయానని నన్ను మర్చిపోతావా? నాకెంత బాధ కలిగినా నీకేమీ అనిపించదా?"

"నీ గురించి నేనేం చేయగలను చెప్పు!"

"నా దగ్గరకు వచ్చేయమ్మా....ఎంత మంచి బంగళాయో అది! అందులో అన్నీ ఖరీదైన కుర్చీలు, బీరు

వాలు, మంచాలు, పరుపులు...."

"ఎక్కడుందరా ఆ బంగళా!"

"నువ్వు నాతో వచ్చేస్తానంటే చెబుతాను...."

"నేను నీతో వచ్చేస్తాను...." అంది సరళ.

"నువ్వొచ్చేస్తానంటే చాలదు. నాన్నను కూడా తీసుకు రావాలి...."

"ముందు నన్ను బంగళా చూడనీ, నాకు నచ్చితే నాన్ననుకూడా రమ్మని చెబుతాను..." అంది సరళ.

"అలా కుదరదు. ఇద్దరూ కలిసే రావాలి...."

"ఎందుకని?"

"బంగళా యిక్కడికి చాలా దూరం...."

"ఎంత దూరమేమిటి?" కుతూహలంగా అంది సరళ.

"చాలా చాలా దూరం. ఒకసారి నిన్నక్కడికి తీసుకొని వెడితే నేను తిరిగి నిన్ను వదిలిపెట్టలేను. నాకు తెలుసు—నువ్వు నాన్న లేకుండా వుండలేవని! బంగళాకు చేరుకున్న మరుక్షణంనుంచీ నువ్వు నాన్నో నాన్నో అని కలవరిస్తావు. అందుకని కూడా తీసుకొని వెళ్ళిపోతే నే మంచిది కదా!"

"నువ్వే యిక్కడుండకూడదా? నా కంటికక్కనిపించకూడదా?" అంది సరళ.

"ఎన్నిసార్లు చెప్పనమ్మా — అది సాధ్యంకాదని! నన్ను కని పెంచిన తల్లివి—నీ ఋణం తీర్చుకోకుండా నే దూరమయ్యాను. ఇప్పుడు నిన్ను నాకు దగ్గర చేసుకొని అన్ని సేవలూ చేయాలని వుంది. అమ్మా—నా దగ్గరకు వచ్చేయవూ? నేను నీకు కాళ్ళు పడతాను. వంట చేస్తాను. ఏ పనీ చేయకుండా అ స్తమానూ కూర్చుని పుస్తకాలు చదువుకోవచ్చు. అన్నట్లు బంగళాలో బోలెడు పుస్తకా

లున్నాయి. అన్నీ నీకిష్టమైనవే..."

సరళ కళ్ళలో నీళ్ళు తిరిగాయి—"బాబూ—రాజా నీ బాధ నాకర్థమయింది. నేను నీ దగ్గరకు తప్పక వస్తాను. మీ నాన్నను కూడా ఒప్పిస్తాను. కానీ అందుకు కొంత వ్యవధి కావాలి. ఈలోగా గోపీ జోలికి రాకు. వీడికి నయమయ్యేదాకా ఇంకే విషయమూ ఆలోచించ లేము మేము...."

"అమ్మా! నిజం చెబుతున్నాను గోపీమీద నాకేమీ కోపంలేదు. కానీ వాడంటే నాకు చాలా అసూయగా వుంది. నువ్వు వాణ్ని పరాయి పిల్లాడిలా చూస్తే నాకే బాధా లేదు. నన్ను చూసినట్లే చూస్తేమాత్రం నేను వాడిని బెదిరిస్తూనే వుంటాను...."

"మరి వాడిని జాగ్రత్తగా చూడవలసిన బాధ్యత నాది కదా!"

"ఏమో-అదంతా నాకు తెలియదు. వాడి బాగోగులు చూసుకుందుకు కింకెవరినైనా నియమించు నువ్వు కానీ, నాన్న కానీ వాడికి దగ్గరవడానికి వీల్లేదు. ఈ విషయంలో నేనింకేమీ వినదల్చుకోలేదు...."

"రాజా.... నేను చెప్పేది వినరా!"

సరళకింక బదులు రాలేదు. ఆమె రాజా, రాజా అని మళ్ళీ మళ్ళీ పిలిచింది. బదులు రాలేదు. కానీ గదిలోకి వరప్రసాద్ వచ్చాడు.

సరళ అతడి వంక ఆశ్చర్యంగా చూసింది.

"అయిందా—నీ సంభాషణ?" అన్నాడతడు తీవ్రంగా.

"మా సంభాషణ మీరు విన్నారా?"

"చాలా సేపట్నించి వింటున్నాను. అయితే ఏదైనా గది లోకి అడుగు పెట్టవచ్చునన్నుకున్నాను...."

"అంటే మీరుకూడా రాజా గొంతు విన్నారన్న మాట .... ఇప్పుడు నాకెంతో సంతోషంగా వుంది. నేనబద్ధం చెప్పలేదని మీరూ గ్రహించారు...." అంది సరళ సంతోషంగా.

"సరళా-నువ్వు భ్రమపడుతున్నావో, నాటకమాడుతున్నావో నాకు తెలియదు. గదిలో గోపీ యెలా వున్నాడో, నువ్వేంచేస్తున్నావో చూద్దామని—నిద్ర లోంచి మెలకువరాగానే గదిలోకి రాబోయాను. నువ్వు నన్ను చూసి మొదలెట్టావో యేమో తెలియదు. గాలితో సంభాషిస్తున్నావు. ఎవరితో మాట్లాడుతున్నావో తెలియదు. నాకు నీ మాటలే వినిపిస్తున్నాయి...."

"అంటే రాజా మాటలు నిజంగా మీరు వినలేదా? నాకు వినపడ్డ మాటలు మీకు వినపడలేదా?"

"లేదు...."

"మీరు నన్ను దోషిని చేయాలని చూస్తున్నారు. అందుకే అబద్ధం చెబుతున్నారు. నేనేం తప్పు చేశాను? మీరు నన్నెందుకిలా అనుమానిస్తున్నారు?" అంది సరళ యేడుపు గొంతుతో.

శరత్ప్రసాద్ సానునయంగా—"నేను నిన్ను నమ్ముతాను. రాజా నీతో యేం మాట్లాడేడో చెప్పు...." అన్నాడు.

సరళ జరిగినదంతా చెప్పింది.

"నువ్వు చెప్పింది నమ్మశక్యంగా వుంది. గోపీకి స్పృహ తప్పినప్పుడు వాడెందుకు బెదిరాడో అర్థంకాలేదు నాకు. నువ్వు వాడినేమీ చేయలేదని నాకు తెలుసు. అప్పుడు

గోపీ యేమో చూశాడు. వాడు చూసింది నేను చూడలేదు. ఇప్పుడు నువ్వెవ్వరితోనో మాట్లాడావు. నువ్వు విన్న మాటలు నాకు వినపడలేదు. రాజా ఉనికి నిజమేననిపిస్తోంది. ఇప్పుడు గోపీ పరిస్థితి ప్రమాదకరంగా వుంది. నువ్వో నేనో వాడికి దగ్గరగా వుంటే రాజా వాడిని బ్రతకనివ్వడు. ఎవరో ఒకరు వాడికి దగ్గరుండడం యెంతైనా అవసరం. మనం ఎవర్నయినా సాయానికి పిలుద్దాం—" అన్నాడు వరప్రసాద్.

భర్త తన్ను పూర్తిగా నమ్మినందుకు చాలా సంతోషం కలిగింది సరళకు. ఆమె వెంటనే—"మనం ముకుందరావుగారింటికి వెడదాం. తిరిగి వచ్చేవరకూ యెవరినైనా సాయంగా వుండమందాం-" అంది.

"ఇంత రాత్రివేళ ఎవరు లేచివస్తారు? పాపాయమ్మగారైతే అసమానూ యేవో ఒకటి అప్పతీసుకొని వెడుతూంటుంది కాబట్టి వస్తుందేమో!" అన్నాడు వరప్రసాద్.

"అవిడ రాదు, మనింటికిప్పుడావిడ ఒంటరిగా రావడంలేదు. ఒకసారి జడుసుకుంది కదా-" అంది సరళ.

"అయితే ఏం చేద్దాం?"

"ఈ రాత్రికెలాగో గడిపేద్దాం. మనం గోపీని కన్నకొడుకులాకాక పరాయి మనిషిలా చూస్తే వాడికే ప్రమాదమూ వుండదు. తెల్లారేక యేదో ఉపాయం చూడొచ్చు...." అంది సరళ.

"అయితే నేనీ గదిలో పడుకుంటాను. నువ్వు పక్క గదిలోకి వెళ్ళు."

"వైనుకి మందివ్వడం గుర్తుంటుందో ఉండదో మీకు" అంది సరళ ఖంగారుగా. అయినా వరప్రసాద్ అంగీక

రించకపోవడంతో అతడికి మరొక్కసారి వివరాలన్నీ చెప్పి మరీ గదిలోంచి బయటకు వెళ్ళిందామె.

## 8

సీతాకరరావు వాలుకుర్చీలో కూర్చుని యేదో మాగజైన్ చూస్తున్నాడు. అడుగుల చప్పుడుకు తలెత్తి చూసి—"నువ్వా?" అన్నాడు.

వరప్రసాద్ ఆయనకు నమస్కరించి — "చాలా అర్జంటు పనిమీద వచ్చాను—" అన్నాడు.

"ఏమయింది? మీ ఆవిడ మళ్ళీ దెయ్యాన్ని చూసిందా?"

"జరిగినదంతా వివరంగా చెబుతాను—" అంటూ వరప్రసాద్ ఆయనకు మొత్తం కథ చెప్పుకున్నాడు.

అది వింటూనే సీతాకరరావు ముఖం గంభీరంగా అయిపోయింది—"విషయం చాలా దూరం వెళ్ళింది—" అన్నాడాయన.

"అసలేం జరుగుతోందంటారు?" అన్నాడు వరప్రసాద్.

"రాజు నీ భార్య మనసులో బలంగా నాటుకొని పోయాడు. నా మాటలతో, నీ ప్రవర్తనతో ఆమె భ్రమ తొలగిపోతుందనుకున్నాను. ఆ భ్రమ నానాటికీ బలపడింది తప్పితే తగ్గలేదు. పైగా తనను నమ్మడం లేదని ఆమె చాలా బాధపడుతోంది. ఇది సీరియస్ విషయం...."

"ఇప్పుడు మనమేం చేయాలంటారు?"

"నువ్వు ఉదయం గోపీని వాళ్ళింటి దగ్గర దిగవిడిచి రావడం చాలా తెలివైన పని. అంతా వాడు తలిదండ్రుల గురించి బెంగపెట్టుకున్నాడనుకుంటారు.

కొన్నాళ్ళ పాటు గోపీ తల్లిదండ్రుల వద్ద వుండడమే మంచిది."

"సరళలో మార్పు తీసుకొని రావడమెలా?"

సీతాకరరావు కాసేపు ఆలోచించి—"మాటిమాటికీ నీ భార్య బంగళా గురించి మాట్లాడుతోంది. ఏమిటా బంగళా?" అన్నాడు.

"ఏమో—రాజు బంగళా గురించి చెబుతున్నాడంటుంది. అదెక్కడున్నదీ తనకు తెలియదంటుంది. రాజు చెప్పడం లేదుట.... మేమిద్దరం మనస్ఫూర్తిగా రాజు దగ్గరకు వెళ్ళడానికి ఒప్పుకుంటే అప్పుడు బంగళా యెక్కడున్నదీ రాజు చెబుతానన్నాడుట...."

"అయితే ఒక పని చేయి.... రాజు దగ్గరకు వెళ్ళడానికి మీ యిద్దరూ ఒప్పేసుకోండి. అప్పుడు బంగళా గురించి తెలుస్తుంది—" అన్నాడు సీతాకరరావు.

"మీ అయిడియా బాగుంది...." అన్నాడు వరప్రసాద్—"కానీ బంగళా గురించి తెలుసుకోవలసిన అవసరమేమిటి?"

"ఏమిటంటే—అది రాజుకు కీలక స్థానం. మొత్తం కథంతా ఆ బంగళా చుట్టూ తిరుగుతోంది. మీ రాజు బ్రతికుండగా యేదైనా బంగళా గురించి కలగనేవారా-మీరు?"

వరప్రసాద్ ఆలోచిస్తూ—"ఏమో—గుర్తులేదు...." అన్నాడు.

"బాగా ఆలోచించి చెప్పు. నీ భార్య భ్రమపడుతోందా—లేక మానవాతీత శక్తి యేదైనా నిజంగా ఆమెను భ్రమపెడుతోందా అన్న విషయం ఈ బంగళా గురించిన వివరాలపై ఆధారపడి వుంది—" అన్నాడు

సీతాకరరావు.

వరప్రసాద్ మరి కాసేపాలోచించి—"అఁ గుర్తొచ్చింది...." అన్నాడు.

"ఏమిటి?" అన్నాడు సీతాకరరావు కుతూహలంగా.

"రాజు పోవడానికి సరిగ్గా నెలరోజులకుముందు...." అన్నాడు వరప్రసాద్. కొడుకు గుర్తుకు రావడంవల్లనేమో అతడి గొంతు పూడుకుపోయింది.

"ఊఁ ఏమయింది?"

"స్నేహితుడి పెళ్ళికి చందనపురం వెళ్ళాం. అక్కడ అనుకోకుండా నా చిన్నవాటి స్నేహితుడు తగిలాడు. అతడో వ్యాపారకుడికి సెక్రటరీగా వుంటున్నాడు. ఆ వూళ్ళో ఆ వ్యాపారకుడికో చక్కటి బంగళా వుంది. ఆయన చందనపురం వచ్చినపుడక్కడ బసచేస్తాట. ప్రస్తుతం నా స్నేహితుడేదో పనిమీద చందనపురం వచ్చాడు. మమ్మల్నా బంగళాలో వుండమని బలవంత పెట్టాడు. ఆ స్నేహితుడి కారణంగా స్నేహితుడి పెళ్ళయినాక నాలుగు రోజులు అదనంగా ఆ బంగళాలో ఉండిపోయాం. విశాలమైన గదులు ఖరీదైన ఫర్నిచర్, కనుసన్నల్లో మసిలే పనివాళ్ళు.... అక్కడున్న కాసిని రోజులూ స్వర్గంలో వున్నట్లే గడిచిపోయింది...." అన్నాడు వరప్రసాద్.

"ఆ బంగళా గురించి రాజేమైనా అన్నాడా అప్పుడు!"

"అన్నాడు. వాడా జీవితాన్ని మర్చిపోలేకపోయాడు. ఇలాంటి బంగళా మనకెందుకు లేదని పదేపదే అడిగాడు. మనకంత డబ్బులేదని చెప్పాను. పెద్దయ్యాక తాను బాగా డబ్బు సంపాదించి ఇలాంటి బంగళాకట్టించి మమ్మ

ల్నిద్దర్నీ సుఖపెడతానన్నాడు....” ఈ మాటలనగానే శరత్ప్రసాద్ కళ్లలో నీళ్లు తిరిగాయి — “వాడెంతసేపూ మా గురించే ఆలోచించేవాడు. మానుంచి వాడేమీ ఆశించేవాడు కాదు. మమ్మల్నేమీ అడిగేవాడు కాదు. ఎప్పుడూ పెద్దయ్యాక మాకోసం తనేం చేయాలా అనే ఆలోచించేవాడు. వాడి ఊహల నిండా బంగళాలు, కార్లు ఉండేవి. వాడి ఆలోచనల్లో తన సుఖానికి చోటుండేది కాదు. మా సుఖం గురించే యెప్పుడూ ఆలోచించేవాడు. ఎన్ని కలలు కన్నాడో తను పెద్దవడం గురించి....వాడలాగే పోయాడు.... మేమిలా మిగిలాం.”

సీతాకరరావు ముఖంలో సంతోషం కనబడింది — “సందేహం లేదు. రాజా కన్న కలలు ఆ బంగళాలో ప్రతిఫలించాయి. ఆ బంగళా గురించి ఎన్నోసార్లు తల్లికి చెప్పేవుంటాడు అది నీ భార్య మనసులో దృఢంగా నాటుకుపోయింది. తన కొడుక్కి తనమీదున్న ప్రేమ కామె యెంతో పొంగిపోయేది... అలాంటి పరిస్థితుల్లో కొడుకు పోయాడు. ఆమె అంతరాంతరాలల్లో రాజా, వాడి కోరిక అలా నిలిచిపోయేయి. అదే ఆమెను క్రమంగా భ్రమలోకి దింపింది....” సీతాకరరావు ఆలోచనగా — “ఇందులో సందేహమేమీ లేదు. నీ భార్య భ్రమపడుతోంది. రాజా ఇంకెవరికీ కనపడడని ఆమెకు తెలుసు. అందుకే వాడే తనింకెవరికీ కనపడనన్నాడనీ, ఎవరితోనూ మాట్లాడనన్నాడనీ చెబుతోంది. ఇదంతా ఆమె కావాలని చేయడం లేదు. ఆమె మనసు ఆమె చేత ఆమెకు తెలియకుండా చేయిస్తోంది. ఆమె మనసామెను ఊహాలోకాల్లోకి పంపుతోంది....”

“అయితే మా ఇంట్లో జడుసుకున్న రంగమ్మ, పాపా

యమ్మ, గోపీలను కూడా ఆమే బెదిరించిందంటారా?
ఇది నేను నమ్మలేను. సరళ అలాంటి మనిషి కాదు...."

"నీ భార్య తానెవరినీ బెదిరించలేదు. అయితే రాజా గురించిన ఆలోచనలామెను బలంగా ఆక్రమించుకున్నాయి. ఆ ఆలోచనల బలంతో ఆమె ఇతరులను బెదిరించగలుగుతోంది. దీన్ని సజెస్టివ్ హిప్నాటిజం అంటారు. సరళ తనకు తెలియకుండానే—ఇతరులలో దెయ్యమున్నదన్న భ్రాంతిని కలిగించింది. తాము చూడని రూపానికి రూపకల్పన చేసింది. దెయ్యాన్ని చూసి నువ్వు భయపడడం ఆమె మనసుకిష్టంలేదు. అందుకే దెయ్యమెప్పుడూ నీకు కనబడలేదు. ఆమె మనసు యే ప్రయోగాన్నయినా ఇతరులమీద నే చేస్తోంది—"

"మీరు చెప్పేది నిజమేనంటారా?"

"ఆలోచించి చూడు....నిజానిజాలు నీకే స్ఫురిస్తాయి. నువ్వు బంగళా గురించి చెప్పాక నీ భార్య గురించిన నా అనుమానం రూఢి అయింది."

వరప్రసాద్ ఆలోచిస్తున్నాడు. అతడికి నిన్న జరిగిన సంఘటన గుర్తుకొస్తోంది.

"గోపీ—నీకు తెలుసుగదా! రాజా నీయీడువాడే.... దురదృష్టం కొద్దీ అర్ధాంతరంగా పోయాడు. అయితే వాడి ఆత్మ దెయ్యమై ఈ యింట్లోనే తిరుగుతోంది. వాడు నిన్ను చూసి అసూయపడుతున్నాడు. నిన్నీ యింట్లోంచి తరిమేయాలని నిన్ను బెదిరిస్తున్నాడు. ఇలాంటి చోట నువ్వుండగలవా?" అంది సరళ గోపీతో.

ఈ మాటలామె గోపీ శ్రేయస్సుకోరి చెప్పిందా లేక గోపీని రాజా విషయం నమ్మి చాలని చెప్పిందా?

ఇదేనా సజెస్టివ్ హిప్నాటిజం?

"సీతాకరరావుగారూ! నాకు మీ మాటలపై నమ్మకం కుదిరింది. ఇది పూర్తిగా మన స్త్రీత్వానికి సంబంధించిన విషయం. ఇప్పుడు సరళను సరైన దారిలో పెట్టాలంటే ఏం చేయాలో మీరే చెప్పాలి. వస్తుతః ఆమె చాలా మంచిది. గోపీకి ఏమేం మందులివ్వాలో నాకు మరీ మరీ చెప్పింది. మధ్యమధ్యలో నిద్రలేచి వచ్చి కూరాన్నించే గోపీ యోగక్షేమా లడుగుతూండేది.... ఇది దృష్టిలో ఉంచుకుని మీ సలహా చెప్పండి...." అన్నాడు వరప్రసాద్.

"ఒక్కటే ఉపాయం. నీ భార్యతో కలిసి రాజు దగ్గరకు వెళ్లడానికి నువ్వంగీకరించు" అన్నాడు సీతాకరరావు.

"అప్పుడేం జరుగుతుంది?"

"నీ భార్యకు భ్రమతొలగిపోతుంది...."

"ఎలా?"

ఇంతవరకూ ఆమె ఒక విషయం నమ్ముతోంది. తను నమ్మిన విషయాన్ని నువ్వు నమ్మవని ఆమె నమ్మకం. అదే ఆమె భ్రమకు బలం. నువ్వొప్పుకున్నావంటే ఆమె నిన్ను రాజు దగ్గరకు తీసుకుని వెళ్లాలి. అదామెకు సాధ్యంకాదు. అప్పుడామె భ్రమనుంచి వాస్తవంలోకి వస్తుంది."

"అసలిదంతా ఎందుకు జరుగుతోందంటారు?" అన్నాడు వరప్రసాద్ బాధగా.

"ప్రాణాధికంగా ప్రేమించిన బిడ్డ పోతే—ఆ బిడ్డను మరిచిపోవాలన్న భావనను కొందరు తల్లులు తట్టుకోలేరు. మనిషిపోతే మాత్రం ఆత్మ ఉండదా? ఆ ఆత్మతో మాత్రం కలిసుండడమెందుకు సాధ్యపడదు?.... ఈ విధంగా ఆలోచించి ఈ భ్రమకు లోనవుతున్నది నీ

భార్య...."

"సరే.... నేను మీరు చెప్పినట్లే చేస్తాను. ఏం జరిగిందీ వచ్చి మీకు చెబుతాను...." అన్నాడు వర ప్రసాద్.

"వెళ్లేముందు చందనపురంలోని ఆ బంగళా వివరాలు కూడా నాకు చెప్పు...." అన్నాడు సీతాకరరావు.

"ఎందుకు?"

"ఇప్పుడా బంగళాలో ఎవరుంటున్నారో తెలుసు కుంటాను.... అక్కడ నిజంగా మీ రాజు ఉంటున్నా డేమో కనుక్కుంటాను."

"అది సాధ్యమా?"

సీతాకరరావు నవ్వి—"చూద్దాం!" అని— "మీరు బంగళాకు ప్రయాణమైతే తప్ప ఇక్కడికి రానవసరం లేదు. నేనే మిమ్మల్ని చూడ్డానికి వస్తాను—మధ్యాహ్నానికి!" అన్నాడు.

# 9

"ఇంత సేపయిందేమిటండీ.... గోపీని దిగబెట్టి రావడానికి!" అంది సరళ చిరాగ్గా.

"ఏం—అలా ఉన్నావు. మళ్ళీ రాజు కనిపించాడా?" అన్నాడు వరప్రసాద్.

"లేదు. నా మనసంతా ఏదోలాగుంది. పరాయిపిల్లాణ్ణి తెచ్చి యింట్లో పెట్టుకున్నాం. వాడికి మనసులో ఎన్నో ఆశలు రేపాం. ఇప్పుడు వాణ్ణి దిగవిడిచి రావలసివచ్చింది."

"బాధపడకు సరళా! మనకు మనరాజుకంటే ఎవరూ ఎక్కువకాదు. వాడికింకా ఏ సరదాలూ తీరలేదు. నూకలు చెల్లిపోయాయి. వాడు మనకిపిలవడమే ఒక అదృష్టం.... మనం వాడిదగ్గరకు వెళ్ళిపోదాం...."

"ఎలా వెడతామండీ?" అంది సరళ.

"అదీ వాడే చూసుకుంటాడు. అయినా వాడు చెప్పిన బంగళా ఎక్కడుందో నేనూహించగలిగాను. చందన పురంలో వాడుపోయేముందు మనమో బంగళాలో లేమూ. అదే వాడు చెప్పింది....ఒక వేళ మనకు మళ్ళీ గోపీ కనిపించకపోయినా సేరుగా అక్కడికే వెళ్ళిపోదాం. రాజు అక్కడ మనకే ఏర్పాట్లు చేశాడో చూద్దాం." మామూలుగా అన్నప్పటికీ అతడి మాటలు సరళను సవాలు చేస్తున్నట్లే ఉన్నాయి.

"నిజంగా మనకు వాడక్కడ ఏర్పాట్లు చేశాడంటారా?" అంది సరళ. ఆమెకు చందనపురం బంగళా గుర్తుకువచ్చింది. అక్కడి కొడుకుమాటలు తల్చుకోగానే ఆమెకు ఏడుపువచ్చి "భగవంతుడు మనుషులకీ అద్భాంతరపు చావెందుకు పెట్టాడో?" అంది.

"ముందు రాజును పిలు....మన నిర్ణయం చెప్పు. వాడేమీ మాట్లాడకపోతే అప్పుడు మనం చందనపురం వెళ్ళవద్దాం...." అన్నాడు వరప్రసాద్.

"ఏమిటో—నాకు భయంగా ఉందండీ...." అంది సరళ.

"భయమెందుకు సరళా? వాడు మనబాబు. ఇప్పుడు ప్రాణాలు లేవుగదా అని వాడికి భయపడడం అన్యాయం కదూ...." అన్నాడు వరప్రసాద్. అతడి మాటలు మనస్ఫూర్తిగానే అన్నాడు.

"రాజూ!" అంది సరళ.

"అమ్మా!"

"విన్నారా—వాడు పలికాడు...." అంది సరళ.

వరప్రసాద్ కళ్లు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి—

"నిజం సరళా! వాడి పిలుపిప్పుడు నాకూ వినిపించింది. రాజా! ఎన్నాళ్లయిందిరా నీ గొంతు విని.... ఈ గొంతు ముందే వినివుంటే ఎప్పుడో వచ్చేవాణ్ణి కదురా నీ దగ్గరికి" అన్నాడతడు.

"నాన్నా! నా కిప్పుడెంతో సంతోషంగావుంది. నా కోసం అమ్మ నిన్ను ఒప్పించగలిగింది. మీ ఇద్దరూ మనస్ఫూర్తిగా నా దగ్గరకు రావడానికి ఒప్పుకున్నారు...."

"బాబూ....పోయిన ప్రతిమనిషీ ఇలా వచ్చి మాట్లాడగలిగితే ఎంత బాగుంటుందిరా?" అన్నాడు వరప్రసాద్. అతడి కనులలో ఆనందబాష్పాలున్నాయి.

"నాన్నా! ఇదేమీ అసాధ్యంకాదు. పోయినవాడికీ మిగిలినవాడికీ మరువలేని అనుబంధముండాలి. పోయాక కూడా ఆత్మ మిగిలిన వారినే తల్చుకోవాలి. మిగిలినవారి మనసులో పోయినవాడి స్థానం చెక్కు చెదరకూడదు. అప్పుడొకరితో ఒకరు సంభాషించుకోవడం సాధ్య పడుతుంది. అమ్మదీ నాదీ అటువంటి అనుబంధం. ఆ అనుబంధంతో నేను నిన్ను కూడా సాధించుకున్నాను. నేను నిజంగానే మీ కోసం బంగళా ఏర్పాటు చేశాను. మీరనుకున్నట్లు—అది చందనపురం బంగళాయే! మనమిప్పుడక్కడికే వెడదాం."

"ఎలా వెడతాం?"

"కళ్ళు మూసుకోండి...."

వరప్రసాద్, సరళ కళ్లు మూసుకున్నారు. అప్పుడేం జరుగుతుందో తెలుసుకోవాలని వారికి కోరికగా వుంది.

## 10

ఫోన్లో తెలిసిన సమాచారానికి సీతాకరరావు షాక్ తిన్నాడు.

కొద్ది నెలలక్రితం చందనపురం బంగళాలో దెయ్యం ప్రవేశించిందిట. ఇప్పుడా బంగళా ఖాళీగా ఉంటోంది. ఎవరూ ఉండడంలేదు. ఎవరైనా ఉండడానికి ప్రయత్నిస్తే బెదిరిపోతున్నారు.

“ఇది చాలా విచిత్రంగావుంది. మానవాతీత శక్తులను నమ్మాలా?” అనుకున్నాడు సీతాకరరావు. ఆయన దెయ్యం గురించిన కారణాలు సేకరించాడు.

ఆ బంగళాలో ఓ యువతి ఆత్మహత్య చేసుకుందట-మానభంగం కారణంగా. ఆమె దెయ్యమై తిరుగుతోందని అంతా చెప్పుకొంటున్నారు. ఈ వార్త పేపర్లో కూడా వచ్చిందిట.

అప్పుడు సీతాకరరావుకింకో అనుమానం వచ్చింది. పేపర్లో ఈ వార్తను సరళ కూడా చూసి ఉంటుంది. అందులోని దెయ్యం తన కొడుకేనని ఆమెకు అనిపించింది. అప్పటినుంచి ఆమె భ్రమ ప్రారంభమయింది.

అంతే జరిగి ఉండాలి!

అక్కడ ఓ యువతి ఆత్మహత్య చేసుకుంది. అది కొందరిని అక్కడ దెయ్యం భ్రమలో ఉంచింది. ఆ భ్రమ సరళలో మరో భ్రమను రేపింది.

ఆ భ్రమ ఈ రోజుతో అంతమైపోతుంది.

ఏం జరిగిందో తెలుసుకోవాలని సీతాకరరావుకూ ఆత్రుత కలిగింది. ఆయన వెంటనే వరప్రసాద్ ఇంటికి వెళ్లాడు.

తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి.

తోసుకొని లోపలకు వెళ్లాడాయన....

పిలిస్తే ఎవరూ పలకలేదు. ఇల్లంతా కలయతిరగగా ఓ బెడ్ మీద దంపతులిద్దరూ పక్క పక్కగా పడుకొని

కనపడ్డారు.

ఇద్దరి వదనాలు ప్రశాంతంగా ఉన్నాయి. ఇద్దరూ కళ్ళుమూసుకొని వున్నారు.

సీతాకరరావు ఇద్దర్నీ పిలిచాడు....పలకలేదు.

ముట్టుకొని చూశాడు. ఉలిక్కిపడ్డాడు.

వారి శరీరాలు మంచుకన్న చల్లగా వున్నాయి.

ఆయన వెంటనే డాక్టరుకోసం పరుగెత్తాడు. డాక్టరు వచ్చి చూశాడు.

ఇద్దరివీ ప్రాణాలు పోయాయి. సహజ మరణం....

ఇదీ డాక్టరు తేల్చి చెప్పిన విషయం....

సీతాకరరావు ఆలోచిస్తున్నాడు....

రాజా నిజంగా తలిదండ్రులను పిలిచాడా? ఆ పిలుపును అంగీకరించమని తను చెప్పిన సలహాయే వారి ప్రాణాలు తీసిందా?

సీతాకరరావు ప్రశ్నలకు సమాధానాలు లభించలేదు.

చందనపురం బంగళాలోని దెయ్యాలు మాత్రం ఎవరికీ లొంగడం లేదన్న వాడుక బయల్దేరింది.

వరప్రసాద్ ఆస్తికి వారసురాలైన గోపికి—ఆ యింట్లో మళ్ళీ ఏ దెయ్యమూ కనబడలేదు.

—: అయిపోయింది :—

# దాడి?

బి. రాజేశ్వరి

"మా యింట్లో మన పెళ్ళికి ఒప్పుకోవటంలేదు" తల వంచుకుని మెల్లగా చెప్పింది శ్రీదేవి.

వాసు ఆమెవైపు సూటిగా చూశాడు.

"ఇది మనం ముందుగా వూహించినదే. అది మన వివాహాన్ని ఆపదు. నేను చెప్పింది సరైన మార్గం!"

శ్రీదేవి కళ్ళెత్తి అతనివంక చూసింది. అదేమిటో ఆమెకు తెలుసు. అంతక్రితం యెన్నోసార్లు అతను చెప్పాడు, చెప్తున్నాడు. కాని ఆమె స్త్రీ. మగాడిలా, సంఘాన్ని లెక్క చెయ్యకుండా కట్టుబాట్లను తెంచుకోవటం ఆమె వూహలోకి కూడా రాని విషయం.

"ఇద్దరం ఉద్యోగాలు చేసుకొంటున్నాం. ఒకరినొకరు బాగా అర్థం చేసుకున్నాం. దాదాపు అయిదేళ్ళుగా యిదే ఆఫీసులో పని చేస్తున్నాం. మనమధ్య అరమరికలు గాని, రహస్యాలు గాని లేవు. కేవలం మూర్ఖత్వంతో పెద్దవాళ్ళు కాదన్నంత మాత్రాన పెళ్ళి

మా నేస్తామా?" అన్నాడు వాసు.

"నా తర్వాతివాళ్ళు యిద్దరు ఆడపిల్లలే కావటం. నా దురదృష్టం. వాళ్ళ పెళ్ళిళ్ళు నా మూలంగా కాకుండా పోతాయని మరి వాళ్ళ భయం. కులాంతర వివాహాల గురించి అందరూ లెక్చర్లు దంచేవాళ్ళేగాని, ఆచరణ కొచ్చేసరికి అందరికీ చిన్న చూపే! మన సమాజం ఇంకా పాత సంప్రదాయాల్ని, కట్టుబాట్లని పట్టుకొని వేలాడుతూనే వుంది. అది మరిచిపోతున్నావ్ వాసు."

"దేవీ! డొంకతిరుగుడు వ్యవహారమంటే నాకు నచ్చదని నీకు తెలుసు. నేను స్ట్రెయిట్ ఫార్వర్డు! మీ నాన్నగారు నీ వివాహానికి యెందుకు వ్యతిరేకిస్తున్నాడో నీ కీ పాటికి అర్థమయి వుంటుంది. నీ చెల్లెళ్ళకి పెళ్ళిళ్ళు కాకుండా పోతాయని ఆయన భయపడుతున్న మాట నే నొప్పుకుంటున్నాను. కాని అది పరువు భయంకాదు, ఆర్థిక భయం!"

శ్రీదేవి వెంటనే మాట్లాడలేకపోయింది. ఏం మాట్లాడుతుంది? అతను చెప్పినదాంట్లో అతిశయోక్తి యేమాత్రం లేదు! తనని అతనితో పెళ్ళికి అభ్యంతరపరుస్తున్న కారణం—డబ్బు!

ఇన్నాళ్ళుగా తన జీతం ఇంటి ఖర్చులకి యథేచ్ఛగా వాడేస్తున్న తండ్రికి యిది కోలుకోలేని దెబ్బ! ఒక్కసారిగా తమ యింటి ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్థమవుతుంది.

అటు తండ్రిని నొప్పించలేదు. ఇటు మనసిచ్చిన వాసుని ఒదులుకోలేదు. ఆమె మనసులో అసంఖ్యాకమైన ప్రశ్నలు! తనిప్పుడేం చెయ్యాలి?

తెగించి పెళ్ళి చేసుకొంటే తనవాళ్ళందరికీ దూరమై

పోవటమే కాక, వాళ్ళకి ద్రోహం చేసినట్టవుతుందేమో!? స్వార్థపరురాలని నలుగురూ చూపిస్తారు. అలా అని ప్రాణసమంగా ప్రేమించిన వాసుని వదులుకోవటమా!?!

ఊహు! ఎప్పటికీ వదులుకోలేదు. తను తప్పుగా ప్రవర్తించటం లేదు—తండ్రికి చెప్పకుండా రహస్యంగా చేసుకోవాలనుకోలేదు. ఏం దాచకుండా తండ్రికి చెప్పి ఆయన అనుమతి కోరింది. కాని ఆయనే తన పెద్దరికాన్ని నిలుపుకోలేదు. పెద్ద మనసుతో ఆలోచించలేదు. అందుకే....అందుకే....తను ఓ అడుగు ముందుకు వెయ్యవలసి వస్తోంది.

వాసు అసహనంగా చూశాడామెవంక.

శ్రీదేవి అతనివంక నవ్వుతూ చూసింది.

వాసు ముఖం విప్పారింది. చనువుగా ఆమె చేతినందుకుని చిన్నగా నొక్కాడు.

"మరొక్కసారి — యిదే చివరిసారి — ప్రయత్నిస్తాను. అప్పుడు కూడా నాన్న ఒప్పుకోకపోతే నువ్వెలా చెపితే అలా చెయ్యటానికి సిద్ధం!" అంది.

## 2

ఇంటికి చేర్తూనే వరండాలో యేదో పరిచితమైన గొంతు వినిపించి నడక వేగం తగ్గించింది శ్రీదేవి. ఆ గొంతు వినువెంటనే ఆమె గుర్తించింది.

సంజీవి బావ! మేనత్తకొడుకు!

అకస్మాత్తుగా మద్రాసునించి యిక్కడికెందుకు పరుగెత్తుకొచ్చాడు?

"రా, రా! ఇదేనా ఆఫీసునించి రావటం?" శ్రీదేవిని

చూస్తూనే చేటంత మొహం చేసుకొని అడిగాడు సంజీవి.

సంజీవి అధునాతనంగా డ్రెస్ చేసుకొని, హుందాగా గొప్పగా కనిపించాలని వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాడు. కేవలం అయిదడుగుల మూడంగుళాల పొడవుండే సంజీవి ఆ దుస్తుల్లో ఓ వింతవ్యాగంలా కనిపించాడామెకు. పొట్టిగా వుండటమే కాక చామనఛాయ కన్న ఛాయ తక్కువగా, ముందుకి తోసుకొచ్చిన పళ్ళతో కొంత వికృతంగా కనిపిస్తాడు.

సంజీవి ఆమెవంక నవ్వుతూ చూశాడు. కాని శ్రీదేవి గమనించనట్టే లోపలికి వెళ్ళిపోయింది.

ఓ గంట తర్వాత పుల్లారావు కుమార్తెను వెతుక్కుంటూ వంటగదిలోకి వచ్చాడు. కూతుళ్ళు ముగ్గురు రాత్రి భోజనానికి వంట ఏర్పాట్లలో వున్నారు.

పుల్లారావు శ్రీదేవిని సమీపించి మెల్లగా చెప్పాడు: "ఓసారి బయటకు రా అమ్మా! నీతో మాట్లాడాలి!"

శ్రీదేవి తండ్రివంక ఓసారి చూసి, "నాకు తెలుసు నాన్నా. మీరెందుకు పిలుస్తున్నారో! నా నిర్ణయంలో మార్పురాదు. నేను బావని ఎన్నటికీ చేసుకోను. నా నిర్ణయం మీకు చెప్పాను. మీ ఆశీస్సులు కోరుతున్నాను. మీరు నా మనసు గ్రహించి వాసుతో నా పెళ్ళి జరిపించండి!" అన్నది.

పుల్లారావు ముఖం అప్రసన్నంగా మారిపోయింది. "అయితే నీ అభిప్రాయం మార్చుకోవన్న మాట!? బావలో ఏం లోపం చూశావు? లక్షాధికారి. ఏకైక వారసుడు. నా చెల్లెలి కొడుకు. మనం రమ్మంటే తనిల్లు వాకిలి వదిలేసి వచ్చి ఇల్లరిక ముంటాడు. అంతకన్న

కావలసిందేముంది?" అన్నాడు.

"ఇల్లరికం వచ్చే అల్లుడు ఆత్మాభిమానం, పౌరుషం వదులుకోంటాడు. నా భర్తగా అలాంటివాడ్ని ఊహించ లేను. సారీ...."

"ఊరు పేరు లేనివాడ్ని, మన కులంగానివాడ్ని నువ్వు చేసుకుపోతే నీ తర్వాతి యిద్దరు ఏమయిపోతారో ఆలో చించావా?"

"ఏమీ కాదు. హాయిగా తమకు నచ్చిన వాళ్లను వివా హం చేసుకొంటారు. నాన్నా! కాస్త విశాలంగా ఆలో చించండి. మీ అనుమతితో చేసుకుంటే నాకెంతో సంతృప్తిగా, ఆనందంగా వుంటుంది!"

పుల్లారావు ఆమె మాటలు పూర్తిగా వినకుండానే విసురుగా బయటకు వెళ్లిపోయాడు.

శ్రీదేవి దీర్ఘంగా నిట్టూర్చింది. తండ్రి తన పట్టు వద లడు. తను వాసుని వదలదు. ఆఖరుసారిగా చేద్దామన్న ప్రయత్నం సంజీవి రాకతో మరింత జటిలమైపోయింది.

ఆ రాత్రి పుల్లారావు యింట్లో భోం చెయ్యకుండా కోపించాడు. చిన్నకూతుళ్లిద్దరు బతిమాలినా భోజనానికి రాలేదు. సంజీవి బలవంతం చేసి ఆయన్ని డైనింగ్ టేబిల్ దగ్గరకు రప్పించాడు.

తల్లి బతికి వుంటే తన మనసు గ్రహించి ఆ ప్రకారం తండ్రిని ఒప్పించి వుండేదనిపించింది శ్రీదేవికి. చాలా సేపు తల్లి ఫోటో దగ్గర నిల్చుని కన్నీరు పెట్టుకుంది.

ఆ రాత్రి ఆమె భోం చెయ్యలేదు.

పుల్లారావు భోం చెయ్యమని అడగలేదు.

ఆ మర్నాడే వాసుకు తన సమ్మతిని తెలియజేసింది

శ్రీదేవి.

స్నేహితులు, ఆఫీసు కొలీగ్స్ సమక్షంలో వాసు, శ్రీదేవి భార్యాభర్తలయ్యారు రిజిస్ట్రారాఫీసులో!

వాసు బంధువులందరు వివాహానికి హాజరయ్యారు. శ్రీదేవి తరఫున బంధువులెవరూ రాలేదు. శ్రీదేవి చెల్లెళ్ళు తండ్రికి తెలియకుండా పెళ్ళికి వెళ్ళాలనుకొన్నారు గాని, పుల్లారావు గడప దాటనివ్వలేదు. తను ఆఫీస్‌కి వెళ్ళటం మానేసి ఇంట్లోనే వుండిపోయాడా రోజంతా.

శ్రీదేవి లోలోపల చాలా బాధపడింది. కాని, తండ్రి మూర్ఖత్వానికి తన జీవితాన్ని బలి చేసుకోకూడదని ముందే నిర్ణయించుకొన్నది. తన సంపాదన మీద బతకాలనుకొంటున్న తండ్రిపట్ల ఆమె మనసులో ఉదాసీనత చోటు చేసుకొంది.

పెళ్ళయ్యాక కూడా తన జీతంలో సగం తండ్రికివ్వటానికి వాసుని ఒప్పించింది మొదట్లోనే.

వాసుకి ఆమె జీతంపైన ఆసక్తిలేదు, ఆమెమీద తప్ప. ఆమె తనదైతే చాలునని, ఆమె సంపాదనను తన యిష్టమొచ్చినట్టు ఖర్చు పెట్టుకోవచ్చునని మొదటే చెప్పాడు. సగం తండ్రికిచ్చి తక్కిన సగం ఆమె పేరనే సేవింగ్స్ ఖాతాలో వేసుకొమ్మని సూచించాడు. అంత విశాల హృదయంతో అతను మాట్లాడుతుంటే అతనిమీది గౌరవం మరింతగా పెరిగిందామెకు.

వాసుని చేసుకుతీరాలనే నిర్ణయాన్ని అతని సచ్ఛీలత, నిరాడంబరత, విశాల హృదయం—మరింత బలపరిచాయి. ఆమెను అతనిపట్ల బలంగా ఆకర్షించుచున్నాయి. అందుకే యెవరు కాదన్నా ఆమె అతన్ని వివాహం చేసుకోవటానికి మనస్ఫూర్తిగా అంగీక

రించింది.

పెళ్లయిన వెంటనే తండ్రిని చూడాలనిపించినా ఆ కోరికను బలవంతాన నిగ్రహించుకొన్నది. తనమీద క్రోధావేశాలను వెళ్లగక్కి, బయటకు పొమ్మని గొడవ చేస్తే ...!? ఆ అవమానాన్ని తనపలే భరించలేదు.

"ఓ వారం రోజులపాటు యీ మనుషులకి మన సమస్యలకి దూరంగా యెక్కడికైనా పోయి గడిపివద్దాం!" అంది శ్రీదేవి.

వాసు చిన్నగా ఆమె చెయ్యి నొక్కి, "యు మీన్ హనీమూన్!?" అన్నాడు.

సిగ్గుగా తలూపింది శ్రీదేవి.

"సరే. వెళ్దాం."

"ఎక్కడికి?"

"అది కూడా నువ్వే చెప్పు!"

శ్రీదేవి ఓ నిమిషం ఆలోచించి, "పర్ణశాల!...."

వాసు ఆమెవంక ఆశ్చర్యంగా చూసి "పర్ణశాలకా? ఇంకా ఏ అరకువేలీకో, బెంగుళూర్‌కో, హార్స్‌లీ హిల్స్‌కో ప్రోగ్రాం వేస్తావనుకుంటే ఇలాంటి స్పాట్ ఎన్నుకున్నావేమిటి?" అన్నాడు.

ఆమె సిగ్గుతో బరువెక్కిన కళ్ళను పైకెత్తి క్షణంలో సగంసేపు అతన్ని చూసి మళ్ళీ కళ్ళు వాల్చేసుకుంది.

"అక్కడి ప్రశాంతత నాకెంతో యిష్టం. మన మొదటిరాత్రి అక్కడే గడపాలని...." ఆపైన మాటలు పూర్తి చెయ్యలేకపోయింది. ఆమె ముఖం ఎర్రగా కంది పోయింది. పెళ్ళి బట్టల్లో దేదీప్యమానంగా వెలిగి పోతోంది.

పర్ణశాల హైద్రాబాద్ కి నూట అరవై కిలోమీటర్ల దూరంలో వున్న ఓ కొండప్రదేశం. ప్రకృతి దృశ్యాలకు పెట్టింది పేరు. సెలవులు ఆనందంగా గడపటానికి, విహార యాత్రకు, సైట్ సీయింగ్ కి సాధారణంగా పర్ణశాలకు పిక్నిక్ వేసుకుంటూరు.

వరసగా నాలుగు కొండలు ఒకదాన్ని ఆనుకొని మరొకటి వుంటాయి. వాటిలో చివరి కొండమీద పాడు బడిన కోట అవశేషాలు వున్నాయి. వాటి మధ్య ఓ పెద్ద రాతికట్టడం— పురాతనమైనది—వున్నది.

కొండలమీద, దిగువ కూడా ఎన్నో రకాల వృక్ష జాతులు, పూల మొక్కలు నయనానందకరంగా దర్శన మిస్తుంటాయి. పెద్ద పెద్ద గండశిలలు ఒకదానిమీద మరొకటి పేర్చినట్టుగా సహజంగానే ఏర్పడి వున్నాయి. అదొక మనోహర దృశ్యం!

పురాతన కట్టడానికి సమీపంలోనే ఓ పర్ణశాల వున్నది. ఆ కొండ ప్రాంతానికి అందుకే పర్ణశాల అనే పేరు వాడుకలోకి వచ్చింది.

పర్ణశాలలో ఒక పండు ముదుసలి నిత్యం ధ్యానంలో వుంటాడు. ఓ ఎత్తయిన రాతిబండమీద దర్భాసనం పరచుకుని అర్ధనిమీలిత నేత్రాలతో చేత జపమాల ధరించి, వెండిలా మెరుస్తున్న గడ్డంతో, జడలు కట్టిన కేశపాశాలతో అలనాటి మునీశ్వరుల్ని గుర్తుకు తెస్తుం టాడు.

ఆయనను అందరూ బాబాజీ అని పిలుస్తారు. ఆయన ఎవరో ఎందుకు అక్కడ మౌనంగా తపస్సమాధిలో మునిగివుంటాడో యెవరికీ తెలియదు. ఆయనకి నూరేళ్ళ వయసుంటుందని కొందరు, కాదు నూట పాతికేళ్ళని

మరికొందరు నూటయేభై అని యింకొందరు — రకరకాలుగా చెప్పుకుంటారు. నిజం ఎవరికీ తెలియదు.

బాబాజీ పూర్తిగా మౌని కాదు. ఆయన రోజూ ఉదయం రెండుగంటలు కళ్ళు తెరిచి భవిష్యత్తు గురించి చెపుతాడు. ఆయన చెప్పినవి చాలావరకు నిజమవుతుంటాయని చెప్పుకుంటారు.

బాబాజీ చాలా అరుదుగా ఆహారం తీసుకుంటాడు. అది కూడా కేవలం కొన్ని పళ్ళు, పుట్టతేనె మాత్రమే! కొండల దిగువనున్న ఓ పల్లెనుంచి బాబాజీ సేవకోసం కొందరు పల్లెవాసులు నిత్యం పర్ణశాలవద్ద సిద్ధంగా వుంటారు. వాళ్ళకు ఆయన దేవుడు.

తక్కిన విషయాలకొస్తే, కొండమీద అధునాతనమైన కాటేజిల సముదాయమున్నది. దాదాపు నలభై కాటేజి లున్నాయి. దేనికదే విడివిడిగా వుండే ఆ కాటేజిల్లో అన్నిరకాల సదుపాయాలు వుంటాయి.

కాటేజికి రెండు గదులుంటాయి. చుట్టూ ఖాళీ స్థలంలో అందమైన క్రోటన్స్, పూల మొక్కలు వుంటాయి. ప్రతి కాటేజికి ఓవర్ హెడ్ టాంక్ వుంటుంది. ఇరవై నాలుగ్గంటలు నీటి సరఫరా వుంటుంది.

కొండ దిగువున ఓ, పవర్ స్టేషన్ వున్నది. ఆ పవర్ స్టేషన్ ఆ చుట్టుపక్కల గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరాకోసమని నిర్మించబడ్డది. పర్ణశాల కాటేజిలన్నిటికీ ఆ పవర్ స్టేషన్ నుంచే విద్యుత్తు సరఫరా అవుతుంది.

అంతేకాదు, కొండ దిగువనుంచి నీటిని నిరంతరం కొండపైనున్న కాటేజిలకి పంప్ చెయ్యటానికి ఓ పంప్ హౌస్ పవర్ స్టేషన్‌కి సమీపంలో నిర్మించబడి వున్నది.

నీరు, విద్యుచ్ఛక్తి సౌకర్యాలు పుష్కలంగా వుండటం వల్లనే పర్ణశాల గొప్ప యాత్రాస్థలంగా పేరుపొందింది. వచ్చిన యాత్రికులు రోజుల తరబడి ఏమాత్రం అసౌకర్యం లేకుండా కాటేజీల్లో గడిపి వెళ్ళటానికి ఎంతో అనువుగా వున్నది.

గతంలో వాసు వాళ్ళ ఆఫీసు బృందంతో పర్ణశాలకు వెళ్ళివున్నాడు. అప్పట్లో వాసుకి, శ్రీదేవికి పెద్దగా పరిచయం లేదు. మొదటిసారిగా పర్ణశాల దగ్గరే వాళ్ళకు మాటామాటా కలిసింది. సుందరప్రకృతి ఒడిలో ప్రేమకు తొలిపాఠాలు నేర్చుకున్నారు.

అందుకే శ్రీదేవి తమ ప్రథమ సమాగమానికి పర్ణశాలనే సరయిన సంకేత స్థలంగా నిర్ణయించుకున్నది.

వాసు ఆమెకంక నవ్వుతూ చూసి, "నీ కోరిక తీర్చటానికి నే నెప్పుడూ సంసిద్ధుడినే! తప్పకుండా వెళ్దాం. ఓ వారం రోజులు సెలవు పెడదాం. సరిపోతుందా?" అన్నాడు.

శ్రీదేవి సిగ్గుతో నే తలూపింది.

# 3

పర్ణశాల చేరేసరికి సాయంత్రం అయిదు గంటలయ్యింది.

కొండ దిగువనుంచి మే నేజిమెంటువాళ్ళు పైకి ఎక్కడానికి కష్టపడనక్కర్లేకుండా బస్ సౌకర్యం కల్పించటం వల్ల యొకాయొకిన కొండమీదికి చేరిపోయారు బస్‌లో.

బస్ కొండ ఎక్కుతుంటే ఆ మనోహర దృశ్యాన్ని చూసి శ్రీదేవి పులకించిపోయింది. చుట్టూ ఎటుచూసినా

అందమైన డిజైన్‌లా కనిపిస్తున్న చెట్లు, పూలమొక్కలు అనాసపండ్ల మొక్కలు, ఒకదానిమీద మరొకటి పేర్చినట్టు అమరిన బండరాళ్ళు మనోహర దృశ్యంలా వున్నాయి. చిత్రకారుడు యెంతో శ్రద్ధగా గీచిన చిత్తరువులా సజీవంగా కనిపిస్తూన్న పచ్చని ప్రకృతి!

"చూడండి, ఎంత అందమైన దృశ్యమో!" అన్నది పులకించిపోతూ వాసుతో.

వాసు ఆమె ఆనందంలో తనూ పాలుపంచుకుంటూ, "ఈ ప్రకృతి మధ్య పులకించిపోవాలని నీ కెందుకు కోరిక పుట్టిందో నా కర్థమయ్యింది. గుడ్ సెలక్షన్!" అన్నాడు.

ఆమె అతని భుజమ్మీద తల పెట్టి అలవోకగా అతని ముఖంలోకి పరవశంగా చూస్తోంది. అది యిద్దరు కూచునే సీటు!

బస్ ఎంతో జాగ్రత్తగా కొండలు ఎక్కుతోంది. రెండు కొండల్ని ఎక్కి మూడో కొండ ఎక్కబోతోంది. ఓ కొండనుంచి మరో కొండకి బస్ ఎక్కే దృశ్యం స్పష్టంగా కనిపిస్తోంది కిటికీలోనుంచి.

శ్రీదేవి చిన్నపిల్లలా కేరింతలు కొడుతూ వాసుకి చూపిస్తోంది. కొండ లోయలు కూడా భయంకరంగా అనిపించటంలేదు—ఆర్టిస్టిక్‌గా కనిపిస్తున్నాయి.

బస్ పర్ణశాల మేనేజ్‌మెంట్ ఆఫీసు ముందాగింది—

శ్రీదేవి చుట్టూ ఓసారి చూసి, "చాలవరకు తిరుమల హిల్స్‌లాగానే వుందికదూ యిక్కడ!?" అన్నది చుట్టూ కట్టబడిన కాటేజ్‌ల వంక చూస్తూ.

"అవును. తిరుమల కాటేజ్‌ల మాదిరిగానే కట్టారు యిక్కడి కాటేజ్‌లు కూడా. అయితే తిరుమలకొండలు

బాగా ఎత్తు. ఏడుకొండలు. ఇవి నాలుగు కొండలే. చెప్పుకోదగ్గ ఎత్తు లేవు. అయితే ఆ పురాతన కట్టడం మాత్రం విపరీతమైన ఎత్తులో వున్నది. కొండమీద మరో కొండ వేసో ఎల్లుండో ఎక్కి చూద్దాం."

దూరంగా రెల్లుగడ్డితో నేయబడ్డ పర్ణశాల కనిపిస్తోంది. దానిలోనే బాబాజీ వుంటున్నాడని వాసుకి తెలుసు. తమ ప్రోగ్రాంలో బాబాజీ దర్శనం కూడా వున్నది!

ఎంక్వయిరీ కమ్ రిజర్వేషన్ రూంలో వారంరోజులకి అద్దె ఎడ్వాన్స్ చెల్లించాడు వాసు. తావాలనే కొండ దిగువ దృశ్యాలు కనిపించే వీలున్న కాటేజ్ కావాలని ఎలాట్ చేయించాడు.

ఆ వరసలో అదే చివరి కాటేజ్. ప్రశాంతంగా, ప్రకృతి దృశ్యాలను కిటికీలోనుంచి అవలోకించటానికి అనువుగా వున్నది.

గదిని చూసి చాలా ముచ్చటపడింది శ్రీదేవి.

గతంలో తను ఆఫీసు స్టాఫ్‌తో వచ్చి వెంటనే సాయంత్రానికి వెళ్ళిపోయింది.

"చాలా చక్కగా వున్నదండీ కాటేజ్. లవ్‌లీ!" అన్నది శ్రీదేవి వాసు భుజాలమీద చేతులు వేసి _అతని కళ్ళల్లో కళ్ళు పెట్టి.

సరిగ్గా అప్పుడే కిటికీ దగ్గర ఏదో ఆకారం కనిపించిందామెకు_భర్త భుజాలమీది నుంచి.

ఆమె ఉలిక్కిపడి అతన్ని వదిలేసింది. ఆమె చర్యకు రవ్వంత ఆశ్చర్యంతో ఆమెవైపు చూసి ఆమె చూపులు కిటికీవైపు తిరిగి వుండటం చూసి, తనూ అటు చూశాడు.

అక్కడ అతని కెవరూ కనిపించలేదు!

"ఏమిటి దేవీ, అలా అయిపోయా వేమిటి?" అన్నాడు వాసు.

ఆమె కిటికీ దగ్గర ఎలాంటి దృశ్యం చూసిందో తెలియదుగాని, ఆమె శరీరం సన్నగా వణుకుతుండటం గమనించాడు వాసు.

ఆమె గబగబ కిటికీదగ్గరకు వెళ్ళి బయటకు చూసింది- అక్కడెవరూ లేరు!

కనుచీకటి పడుతోంది—అయినా దృశ్యాలు కనిపిస్తున్నాయి.

శ్రీదేవి తను చూసిన దృశ్యాన్ని మరచిపోలేకపోతోంది. ఎవరా మనిషి? ఎందుకంత ఆసక్తిగా తమవైపు చూస్తున్నాడు? ముఖం స్పష్టంగా కనిపించలేదు. తలమీది నుంచి గడ్డం కిందుగా మఫ్లర్ కట్టుకున్నాడు. తన ముఖం స్పష్టంగా గుర్తించకుండా జాగ్రత్తపడుతున్నట్టుగా, అనిపించింది తనకు.

అంటే....—అతను తెలిసినవాడేనా!?

ఆమె మస్తిష్కం చురుగ్గా పని చేస్తోంది.

తెలిసినవాడైతే ఆలా కిటికీలోనించి ఎందుకు తొంగి చూడటం? సరాసరి మెయిన్ గుమ్మం దగ్గర్నుంచే లోపలికి రావచ్చును కదా!

ఆమెకు అకస్మాత్తుగా గుర్తొచ్చింది. అవును, అతనే! ఇక్కడికెందుకు వచ్చినట్టు? అదీగాక, తనెంతో మనసుపడి వచ్చిన పర్ణశాలకు అతను రావటం కేవలం కాకతాళీయమా? కావాలనే వచ్చివుంటాడు. తను చేసిన పరాభవం మర్చిపోలేదు. ప్రతీకారం తీర్చుకోవటానికి రాలేదు కదా!

ఆమె సన్నగా వణికింది. అతను చాలా దుర్మార్గుడు. నడిరోడ్డుమీద తన చెయ్యి పట్టుకుని అసభ్యంగా ప్రవర్తించాడు. అలాంటి పరిస్థితుల్లో పరువుగల ఆడపిల్ల యేం చేస్తుందో తనూ అదే చేసింది. చాచి లెంపకాయ కొట్టింది ఛెళ్ళున.

చుట్టూ జనం గుంపుగా గుమిగూడారు. అందరు తలో చెయ్యి వెయ్యబోయారు. కాని వాడు తెలివిగా తప్పించుకుని పారిపోయాడు ఆటోలో.

అతని ముఖం తనకి బాగా గుర్తు! షేవన్ కి పెంచుకుని నైస్ గా కత్తిరించుకున్న గడ్డం పదిమందిలో వున్నా అతన్ని గుర్తుపట్టిస్తుంది. మఫ్లర్ గడ్డంమీదుగా యెందుకు చుట్టుకున్నాడో తనకి అర్థమయ్యింది. గడ్డం కప్పివేసుకున్నా తనకి బాగా గుర్తున్నాయి.

శ్రీదేవి మౌనంగా వుండిపోయింది కొన్ని క్షణాల వరకు. ఆమె ఉత్సాహమంతా నీరుకారిపోయింది.

ఫస్టునైట్, యీ ప్రకృతికాంత ఒడిలో పరవశించిపోతూ జరుపుకోవాలని ఎంతో సంబరపడింది. ఆదిలోనే హంసపాదులా యీ దుర్మార్గుడు దర్శనమిచ్చాడు. పైగా తన కాటేజ్ గుర్తించి, తొంగిచూసి మరీ వెళ్ళాడు. ఏం కుతంత్రం పన్నుతాడో....!?

వాసు శ్రీదేవిని పరిశీలనగా చూస్తున్నాడు. క్షణక్షణానికీ ఆమెలో వస్తూన్న మార్పుల్ని స్పష్టంగా గుర్తించాడు. ఆమె ఎందుకో మానసికంగా స్ట్రగులవుతోంది. ఆమె నంతగా కదలించివేసిన విషయమేమిటి? ఎందుకంత నెర్వస్ గా ఫీలవుతోంది? వాసుకి అసౌకర్యంగా అనిపించింది.

“ఏం కనిపించలేదు కదూ!? ఎందుకలా భయపడ్తు

న్నావు?" అనడిగాడు వాసు.

"ఏం లేదు. ఎందుకో మనసు బావుండలేదండీ! కిటికీ దగ్గర యేదో చూసినట్లు భ్రమించాను, అంతే!" అన్నది తన మనోగతాభిప్రాయాన్ని బహిర్గతం చేయకుండా.

తను ఎందుకో విపరీతంగా ప్రవర్తిస్తున్నట్లు భర్త గుర్తించాడు. అతనికేమని సమాధానం చెపుతుంది? నిజం చెప్పి అతని మనసు పాడుచేసేకన్నా అబద్ధం చెప్పటమే మంచిది!

బాత్‌రూంలో వేడినీళ్ళ సౌకర్యం కూడా వున్నది. ప్రయాణ బడలిక తీరేవరకు గోరువెచ్చటి నీటితో స్నానం చేసింది. మనసు, తనువుకూడా ఎంతో తేలిగ్గా అనిపించాయి శ్రీదేవికి.

ఆకాశరంగు పాలియస్టర్ చీర, మేచింగ్ బ్లౌజ్ ఎంచుకొంది. మెడలో అంతక్రితం వరకు లాకెట్‌తో వున్న గొలుసు లాకెట్ స్థానంలో మంగళసూత్రాలను మోస్తూ ఠీవిగా ఆమె గుండెలమీద నాట్యం చేస్తోంది.

ఆమె చీర కట్టుకొంటుండగా కొంటెగా ఆమెవంక చూసి నవ్వాడు వాసు. ఆమె చిరుకోపం నటించి, "అటు తిరిగి నిల్చోండి మంచి బాలుడిలా" అంటూ సిగ్గు పడుతూనే చీర, బ్రా, జాకెట్ ధరించింది.

వాసు కాటేజ్ వరండాలోకి వచ్చి అటెండెంట్‌ని పిలిచాడు. అటెండెంట్ అప్పుడే ఎదుటి కాటేజ్‌లోనికి కారియర్ తీసుకు వెళ్తూన్నాడు.

కారియర్ అప్పగించి వాసు దగ్గరగా వచ్చి "ఏం కావాలి సార్!?" అంటూ వినయంగా అడిగాడు.

"డబుల్ కారియర్. ప్యూర్ వెజిటేరియన్" చెప్పాడు వాసు. అతను వెళ్తుండగా వెనక్కి పిలిచి,

"అలాగే ఓ కిలో స్వీట్సు, రెండు డజన్ల చక్రకేళి అరటిపళ్ళు. సన్నజాజులు మల్లెలు గులాబీలు ప్యాక్ చేయించుకు రా!" అని చెప్పాడు.

భర్త అగ్రిమెంటు చేసుకున్న వస్తువుల జాబితా వింటూ ముసి ముసిగా నవ్వుకొన్నది శ్రీదేవి. అసలు అవన్నీ తనే దగ్గరుండి కొనిపించాలనుకొన్నది. కాని కర్తవ్యానికి మూడో చెడగొట్టేశాడు. అటెండెంట్ ఏమనుకుంటాడో యీ లిస్టు విని?! ఆమెకు చాలా సిగ్గనిపించింది.

తలుపులు లోపల్నుండి మూసి బోల్టు పెట్టి శ్రీదేవి కంక చిలిపిగా చూశాడు వాసు.

శ్రీదేవి ముఖం ఎర్రగా కందిపోయింది. ఏదో టెన్షన్, ఉత్కంఠ నరనరాన పాకి ఆమెలో వింత ప్రకంపనాలు పుట్టించాయి.

వాసు ఆమెని సమీపించి ఆమె ముఖాన్ని అరచేతుల్లోకి తీసుకుని పెదాలను సున్నితంగా ముద్దు పెట్టుకున్నాడు.

శ్రీదేవి నిలువెల్లా పరవశంతో చిగురాకులా వణికింది. ఆమెకీ అనుభవం కొత్త. తమకంలో ఆత్రంగా భర్త ముఖంలోకి చూడటానికి సిగ్గుతెర అడ్డురాగా ఛాతీవరకు మాత్రం కళ్ళెత్తి మూసి వాల్చేసుకున్నది.

కాలింగ్ బెల్ మోగింది.

ఇద్దరు ఉలిక్కిపడ్డారు. విడిపోయారు.

వాసు తలుపు తెరిచాడు—కారియర్ వచ్చి వుంటుందని.

కాని బయట ఎవరూ లేరు. మరి కాలింగ్ బజ్జర్ ఎవరు మోగించినట్టు?

శ్రీదేవి, వాసు ఆశ్చర్యంగా ఒకరి ముఖాలొకరు

చూసుకున్నారు. శ్రీదేవి మనసేదో కీడును శంకిస్తోంది. ఏదో జరగబోతోంది. ఏమిటది? తాను పర్ణశాలపై అడుగు పెట్టినప్పట్నుంచి వాతావరణం తమకు వ్యతిరేకంగా వుంది. ఈ రాత్రి కలాగో గడిపి ఉదయమే హైదరాబాద్ కు తిరిగి వెళ్ళిపోవాలి—అనుకొంది.

ఆమె దీర్ఘంగా నిట్టూర్చింది.

వాసు తలుపు మూసి బోల్టు పెడుతుండగా మళ్ళీ కాలింగ్ బజ్జర్ మోగింది.

శ్రీదేవి ఉలిక్కిపడింది—వాసులో ఆసక్తి పెరిగింది. మళ్ళీ తలుపు తెరిచాడు.

ఎదురుగా కేరియర్, అరటి ఆకులు పట్టుకుని అటెండెంటు నిల్చుని వున్నాడు!

## 4

"అరటిపళ్ళు పూలు తెస్తాను సార్! ముందు మీల్స్ తెచ్చాను. భోంచెయ్యండి!"

అంటూ వాటర్ జగ్ కడిగి నీళ్ళు నింపిపెట్టాడు. గ్లాసులు, జగ్ టీపాయ్ జరిపి దానిమీద పెట్టి కారియర్ టీపాయ్ పక్క పెట్టి వెళ్ళబోతుండగా వాసు వెనక్కి పిలిచి, ఏభై రూపాయల నోటందించాడతనికి—పళ్ళు, స్వీట్సుకోసమని.

అటెండెంట్ నోటందుకుని శాల్యూట్ చేసి వెళ్ళిపోయాడు.

శ్రీదేవి కేరియర్ విప్పి రెండు అరటి ఆకుల్లో అన్నం కూరలు వడ్డించింది.

భోజనం చాలా అద్భుతంగా వుంది. చాలా ఖరీదైన భోజనం! హైదరాబాద్ లో ఒకటి రెండు

హోటల్స్‌లో మాత్రమే, చాలా హెచ్చు బిల్‌తో దొరికే భోజనమది.

తృప్తిగా భోంచేశారిద్దరు. స్వీట్లు, అరటిపళ్ళు కూడా సప్లయ్ చేశారు భోజనంతో పాటు.

"చాలా దివ్యంగా వుంది" అన్నది శ్రీదేవి.

"అవును. బావుందని కడుపునిండా తినేశాం. నిద్ర కూడా వచ్చేస్తుందేమో! అసలే మెలకువగా వుండాల్సిన యీ రాత్రి...."

అతని మాటలు పూర్తికాకుండానే "ఛీ, పోండి!" అంటూ సిగ్గుతో మెలితిరిగిపోయింది శ్రీదేవి.

అయితే వాసు చెప్పిన మాటలు యేమాత్రం పొల్లు పోలేదు. భోంచేసిన పది నిమిషాలకే ఆవలింతలు ప్రారంభమయ్యాయి. ఎంత ఆపుకుందామన్నా ఆగకుండా నిద్ర కళ్ళమీదకు కూరుకువచ్చేసింది.

శ్రీదేవికైతే మరీను. ఎంతగానో కంట్రోల్ చేసుకోవాలని విశ్వప్రయత్నం చేసింది. ఏదో మాట్లాడబోయింది. మాటలు తడబడ్డాయి. వాసు కూడా కళ్ళు బలవంతాన విప్పటానికి వ్యర్థ ప్రయత్నం చేశాడు.

మరుక్షణం యిద్దరు బెడ్‌మీద అడ్డంపడి నిద్రపోసాగారు.

కాలింగ్ బెల్ అదేపనిగా మోగుతోంది. కాని వాళ్ళిద్దరిలో యెవరూ లేవలేదు. బెల్ మోత ఎక్కడో నిద్రలో రైలింజను కూతలా, సైరన్‌లా రకరకాలుగా వాళ్ళకి భ్రాంతిని కలిగించింది. అదీ నిద్రలోనే. మెలకువ రాలేదెంతకూ.

అర్థరాత్రి దాటాక అకస్మాత్తుగా మెలకువ వచ్చింది వాసుకి. పక్కమీద శ్రీదేవి గాఢంగా నిద్రపోతోంది.

తొలగిన ఆమె చీర వస్త్రసలాన్ని బహిర్గతం చేస్తోంది. అమాయకంగా నిద్రిస్తూన్న ఆమె వదనంపై ముంగురులు ఫేన్ గాలికి నాట్యం చేస్తూన్నాయి.

సరిగ్గా అప్పుడే కాలింగ్ బజర్ మోగింది.

ఇంత రాత్రప్పుడు ఎవరు వచ్చారో, ఏం పనిపడి వచ్చారో అని కొద్ది క్షణాలవరకు అయోమయంగా అనిపించింది. ఆ తర్వాత ఆ సాయంత్రం జరిగిన సంఘటనలు ఒకటొకటే గుర్తొచ్చాయి.

భోజనం చేసిన వెంటనే తామిద్దరు మొద్దు నిద్ర పోయారు. అటెండెంట్ ని పూలు పళ్ళు తెమ్మని ఏభై నోటిచ్చాడు తను! ఆ అటెండెంట్ యేమైపోయాడు? ఇప్పుడు బెల్ కొడుతున్న దెవరు? అటెండెంట్ అవన్నీ పట్టుకొచ్చాడా?

అసలు తమ ఫస్టునైట్ జరగాల్సిన సమయంలో తామిద్దరు మొద్దునిద్ర పోవడ మేమిటి?

లోలోపలే నవ్వుకున్నాడు వాసు.

తలుపులు తెరవటానికి గుమ్మంవైపు వెళ్ళుండగా అకస్మాత్తుగా కరెంటు ఫెయిలయ్యింది. ఒక్కసారిగా గదంతా చిమ్మచీకటి అలుముకున్నది.

ఒక్క క్షణం సంశయించాడు వాసు, తలుపులు తెరవాలా వద్దా అని! సరిగ్గా అప్పుడే దెంతోనో తలుపుల మీద కొట్టడం వినిపించింది. గట్టిగా కాదు, సుతారంగా తడుతున్నారెవరో!

వాసు బోల్టు తెరిచి, తలుపులు తెరిచాడు.

అంతే!

ఒక్కసారిగా అతన్ని ఎవరో చుట్టుముట్టి పెడరెక్కలు

విరిచి పట్టుకున్నారు. ఇంకొకరు అరవకుండా నోరు నొక్కారు. మరొకరు కదలకుండా కాళ్ళు చేతులు—గింజుకుంటున్నా వదలకుండా—పట్టి బంధించేశారు.

వాసు ఊహించని యీ పరిణామానికి నిశ్చేష్టుడై పోయి వాళ్ళ చేతుల్లో బందీగా చిక్కిపోయాడు.

అతడా క్షణంలో ఆలోచిస్తున్నది తన గురించి కాదు. అమాయకురాలు, నిస్సహాయురాలునైన శ్రీదేవి గురించి!

ఆమెకు ఎలాంటి ఆపద రాకూడదని భగవంతుణ్ని మనసారా స్మరించుకున్నాడు. అతని మొర ఆ భగవంతుడు ఆలకించాడా అన్నట్టు ఎదురుగా వున్న కాటేజీలోనించి ఎవరో యిద్దరు వ్యక్తులు పరుగెత్తుకుంటూ వచ్చారు.

అప్పటికే వాసుని బయట నిలబెట్టిన చిన్న కారులోకి ఎక్కించారు దుండగులు. తర్వాత శ్రీదేవి కోసం యిద్దరు దుండగులు మళ్ళీ కాటేజి మెట్లెక్కుతుండగా ఎదుటి కాటేజి వ్యక్తులు పరుగెత్తుకొచ్చారు.

వెంటనే ఆ యిద్దరు దుండగులు తమ ప్రయత్నం విరమించుకుని కారెక్కి కూచున్నారు. మరుక్షణం కారు మెరుపులా దూసుకుపోయి మాయమయ్యింది.

ఎదుటి కాటేజి వ్యక్తులు శ్రీదేవి నిద్రపోతుండటం చూశారు. వాళ్ళిద్దరిలోను ఒకాయన చేతిలో టార్చిలైటుంది. ఆయన ముసలివాడు. ఆయనతో వున్న రెండో వ్యక్తి దాదాపు ఏభై యేళ్లవాడు. ఇద్దరు కరెంటు ఫెయిలవ్వటంతో ఫేన్సలేక చల్లగాలికోసం తలుపులు తెరచుకుని కాటేజి వరండాలోకి వచ్చారు. సరిగ్గా అప్పుడే దుండగులు వాసుని ఎత్తుకుపోయే ప్రయత్నంలో వున్నారు.

శ్రీదేవిని లేపటానికి ప్రయత్నిస్తుండగా లైట్లు వెలిగాయి__కరెంటు వచ్చింది.

వాళ్ళిద్దరూ తలుపుమీద తట్టినా, 'అమ్మాయి!' అంటూ గట్టిగా పిలిచినా శ్రీదేవి నిద్ర లేవలేదు. ఇద్దరు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

ముసలాయన లోపలి కడుగుపెట్టి శ్రీదేవిని తట్టి లేపాడు.

అయిదు నిముషాల ప్రయత్నం తర్వాత శ్రీదేవి దిగ్గున మేల్కొన్నది. లేచి పక్కమీద కూచుంది.

"ఎవరు మీరు....? ఎవరు కావాలి....?" అంటూ అరిచింది.

ముసలాయన ఆమెవంక జాలిగా చూసి, "అమ్మాయీ నువ్వు ధైర్యంగా వుండు. నీతో బాటు వుండిన యువకు డెవరు?....నీ భర్తేనా?..."

అవునన్నది శ్రీదేవి నిద్రమత్తునించి తేరుకుంటూ. చుట్టూ కలియచూసింది. వాసు లేడు. ఎక్కడికి వెళ్లాడు? అనుకున్నది. ఇంకా మగతగానే వుంది.

ముసలాయన చెప్పాడు: "నీ భర్తనెవరో దుర్మార్గులు ఎత్తుకుపోయారు."

కెవ్వుమన్న కేక ఆమె పెదాలు దాటి బయటకు రాలేదు.

శ్రీదేవి మూర్ఛపోయింది షాక్‌తో.

## 5

మరునాడు ఉదయం వరకు శ్రీదేవి తేరుకోలేదు.

ఈ లోపల ఎదురుగా వున్న కాటేజ్‌లో దిగిన ముసల్మాయన, ఆయన ఏభై యేళ్ళ డాక్టరు కొడుకు ఇద్దరు శ్రీదేవి మంచం దగ్గరే కూచుని సపర్యలు చేశారు.

ముసలాయన పేరు సర్వోత్తమరావు. డాక్టరు పేరు నరోత్తమరావు. ఇద్దరు హైద్రాబాద్ నించి వచ్చారు. ముసలాయన యేదో గవర్నమెంటు ఉద్యోగం చేసి పది పన్నెండుయేళ్ళ క్రితమే రిటైరయిపోయాడు. డెబ్బైఏళ్ళు మీదపడ్డా చెక్కుచెదరకుండా ఉక్కుముక్కలా వున్నాడాయన. కొడుకు కన్న ఆరోగ్యవంతంగా వున్నాడు. ఆయనకు డాక్టరు ఒక్కడే సంతానం.

సర్వోత్తమరావు పర్ణశాలకి తీసుకువెళ్ళమని నరోత్తమరావుని కొన్నాళ్ళుగా అడుగుతున్నాడు. ఇన్నాళ్ళ తర్వాత తండ్రి కోరికని మన్నించి పర్ణశాలకు తీసుకు వచ్చాడు నరోత్తమరావు. వాళ్ళు ఆ క్రితంరోజే ఆ ఎదుటి కాటేజిలో దిగారు. తండ్రికి ఎప్పుడు యే అవసరం వస్తుందోనని తన మెడికల్ చెస్టుతోనే తిరుగుతుంటాడు డాక్టర్. ఆ అలవాటు శ్రీదేవి ప్రాణం కాపాడటానికుపయోగపడింది.

శ్రీదేవి భారంగా కళ్ళు తెరిచి తన ముఖంలోకి ఆతృతగా చూస్తూన్న తండ్రీ కొడుకుల్ని చూసింది. ఆమెకు రాత్రి జరిగిన సంఘటన వెంటనే గుర్తొచ్చి చటుక్కున లేచి కూచుని, "ఏరీ, వారేరీ?" అంటూ హిస్టీరికల్‌గా అడిగింది.

నరోత్తమరావు ఆమెను శాంతపరుస్తూ "ప్లీజ్, ఎగ్జయిట్ కావద్దు. మీ వారు యింకా రాలేదు. ఆయన గురించి వర్రీ కావద్దు" అన్నాడు.

"ఆయన్నెవరో ఎత్తుకుపోయారని మీరే కదా చెప్పారు? మళ్ళీ వర్రీ కావద్దంటారేం? చెప్పండి, ఆయన్నెవరు ఎత్తుకుపోయారు? ఎక్కడకు తీసుకుపోయారు?" ఏడ్చేస్తోంది శ్రీదేవి.

సర్వోత్తమరావు ఆమె మంచం దగ్గరగా కుర్చీ లాక్కుని, "అమ్మా, నీ తండ్రిలాంటివాడ్ని చెప్తున్నాను. నీ భర్త క్షేమంగా వుంటాడు. అతన్నెవరో కిట్టనివాళ్ళు కావాలని తీసుకుపోయి ఆటలాడుతున్నారు. ఈ పాటికి వదిలేస్తారు. వాళ్ళు మీ కాటేజీలో ప్రవేశించి ఏదైనా దొంగిలించాలని వచ్చివుంటారు. మీ ఆయన అందు కవకాశ మివ్వకపోగా ఆయన్ని కార్లో బంధించి పడేసి వాళ్ళ పని కానిచ్చుకోవాలనుకుని వుంటారు. ఇంతలో మమ్మల్ని చూసి పారిపోయారు. మీ వారీ పాటికి వస్తూంటారు" చెప్పాడు అనునయంగా.

శ్రీదేవి తల అడ్డంగా తిప్పి, "వాళ్ళు దొంగలు కాకపోవచ్చు— మా మీద కక్షపట్టిన వాళ్ళెవరో అయి వుంటారు—ఆయన్ని అంత తేలిగ్గా వదలరేమో!" అన్నది దుఃఖంతో పూడుకుపోయిన కంఠంతో.

ఆమె కళ్ళు అప్రయత్నంగా కిటికీవైపు తిరిగాయి.

వాసుని యెవరెత్తుకుపోయారు? యిది గడ్డం వ్యక్తి పనేనా? తనమీద కక్ష సాధిస్తున్నాడా అతను? దుష్టుడికి దూరంగా వుండాలన్నారు. తను వాడితో కావాలని తగవుపడలేదు.

'భగవాన్, ఆయనకే ఆపదా రాకుండా కాపాడు తండ్రీ! నా మూలంగా ఆయన ప్రాణ ప్రమాదంలో చిక్కుకున్నారు. నా ప్రాణం పోయినా ఫరవాలేదు. ఆయన మాత్రం క్షేమంగా వుంటే అంతే చాలు!' మనసులో యెందరో దేవుళ్ళకు పేరు పేరునా మొక్కుకున్నది శ్రీదేవి.

సర్వోత్తమరావు ఫ్లాస్కులోంచి గ్లాసులోకి కాఫీ వంచి, "ఇది తీసుకో తల్లీ! కాస్త నీరసం తగ్గుతుంది!"

అన్నాడు.

శ్రీదేవి తల అడ్డంగా తిప్పి, "ఆయన నా కళ్ళబడే వరకు వచ్చి మంచినీళ్ళు కూడా ముట్టను" అన్నది ఆమె కంఠంలో తొణికిన స్థిరత్వానికి, గంభీరతకు తండ్రీకొడుకు లిద్దరు క్షణం నివ్వెరపోయారు.

"చూడమ్మా. అతనెలాగూ కాసేపట్లో యిక్కడికే వస్తాడు. నువ్వు ఏం తీసుకోకుండా భీష్మించుక్కూచుంటే ఆరోగ్యం పాడవుతుంది. మెంటల్ గా ఫిజికల్ గా బాగా డిప్రెస్ అయి వున్నావు. బి ఛీర్ ఫుల్. మనసు ప్రశాంతంగా వుంచుకో!" నని శతమరావు నచ్చచెప్ప బోయాడు.

"ప్లీజ్, నన్ను బలవంతం చెయ్యవద్దు. మీకు నాపట్ల దయ వుడితే వారెక్కడున్నారో కాస్త వెతికించండి. ఆయన్ని చూడకపోతే నేను బతకను. రేపు సూర్యోదయం చూడను" శ్రీదేవి కళ్ళు నీటితో నిండిపోయాయి.

సర్వోత్తమరావు ఆమె తల నిమిరి, "ఆ ప్రయత్నాలు జరుగుతున్నాయి తల్లీ! ఇంతక్రితమే పర్ణశాల మేనేజ్ మెంట్ వారికి సంగతి వివరిస్తూ కంప్లయింట్ ఇచ్చాను. తమ పర్ణశాల చరిత్రలోనే యిలాంటి సంఘటన యిప్పటి దాకా యెదురుకాలేదని వాళ్ళు ఆశ్చర్యపోతున్నారు. ఇదే మొదటిసారిట. తమకు చెడ్డపేరు రాకుండా చూసుకో వలసిన బాధ్యత తమదేనని, ఎలాగైనా వెతికి అప్పగిస్తామనీ చెప్పారు. మేము నిన్ను కనిపెట్టుకుని యిక్కడే వున్నాం. ఇప్పుడు మళ్ళీ ఎంక్వయిరీ ఆఫీసుకి వెళ్ళి వివరాలు కనుక్కొని వస్తాను" అన్నాడు.

శ్రీదేవి చేతులెత్తి యిద్దరికీ నమస్కారం చేసింది. "ముక్కు మొహం ఎరగని నా పట్ల మీరు చూపిస్తున్న

దయ, అభిమానం నా జన్మలో మరచిపోలేను. నాకు దేవుడిచ్చిన తండ్రిగా, అన్నయ్యగా మిమ్మల్ని జీవితాంతం గుర్తు పెట్టుకుంటాను" అన్నది.

సర్వోత్తమరావు ఆమె చేతులు మృదువుగా నొక్కి వదిలి, "అది మా బాధ్యతగా భావిస్తున్నాం అమ్మా! ఇందులో కృతజ్ఞతలు ఋణాల ప్రసక్తి లేదు. నువ్వు నిశ్చింతగా వుండు. ఆతన్ని వెతికి నీకు అప్పగించే పూచీ మాది!" అన్నాడు వాత్సల్యంగా.

శ్రీదేవి కంట నీరు తిరిగింది. తన కన్నతండ్రి కర్కశంగా తన కిష్టమైన పెళ్ళిని అంగీకరించకుండా మొహాం చాటేస్తే, ఏ సంబంధంలేని మనిషి కన్నతండ్రిలా తనని సాకుతున్నాడు. ఏనాటి ఋణానుబంధమో యిది!?

"నువ్వు పదే పదే కంట తడిపెట్టకమ్మా! నేను ఎంక్వయిరీ ఆఫీస్‌కి వెళ్ళి కనుక్కొని వస్తాను. బాబూ, నువ్వు అమ్మాయిని కనిపెట్టుకొని వుండు" అంటూ సర్వోత్తమరావు చకచక వెళ్ళిపోయాడు. ఆ వయసులో కూడా అంత చురుగ్గా అడుగులు వేస్తూ పని చేస్తూన్న ఆ వృద్ధుడ్ని ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయింది శ్రీదేవి.

నరోత్తమరావు ఆమెవంక చూసి, "చూడమ్మా! ఈ టాబ్లెట్‌ను పరగడుపున వేసుకోకూడదు. ఇందు గురించయినా నువ్వు యేదోక ఆహారం తీసుకోకతప్పదు" అన్నాడు.

శ్రీదేవి బలహీనంగా నవ్వి "పోనీ. ఆ కాఫీయే తాగుతాను లెండి. కాని యిలా కాదు, మొహాం కడుక్కొని వచ్చి...." అంటూ లేచి నాలుగడుగులు వెయ్యబోయి తూలిపోబోయి అంతలోనే సర్దుకుంది.

బాత్‌రూంలోకి వెళ్తూ అప్రయత్నంగా కిటికీవైపు

చూసి తృళ్ళిపడింది. కిటికీ బయట గడ్డం వ్యక్తితో బాటు మరో వ్యక్తి కనిపించాడామెకు.

అతను సంజీవి! తన మేనబావ!!

శ్రీదేవి అదిరిపడి చూసింది. సంజీవి యిక్కడికెప్పు డొచ్చాడు? తనీ కాలేజ్‌లో వుందని ఎలా తెలిసింది? గడ్డం వ్యక్తికీ, సంజీవికి యేమిటి సంబంధం? వాసు కిడ్నాపింగ్‌లో సంజీవికి కూడా భాగముందా? తనపై అందరు యేక కాలంలో కక్షగట్టి ప్రతీకారం తీర్చుకుం టున్నారా?

'భగవాన్ నేనే పాపం చేశాను!? అయున్నా కాపాడు!' అనుకొంటూ బాత్‌రూంలోకి నడిచింది. ఆమె ఒక్కసారిగా పది లంఖణాలు చేసిన దానిలా కుంగిపోయింది.

## 6

పదకొండు గంటల ప్రాంతంలో సర్వోత్తమరావు తిరిగివచ్చాడు. ఆయన ముఖంలో అలసట, నడకలో నీరసం అవరించుకున్నాయి.

ఆయన నోటితో చెప్పకుండానే గ్రహించింది శ్రీదేవి. వాసు జాడ తెలియలేదు.

“మీరు వెళ్ళి విశ్రాంతి తీసుకోండి పెదనాన్నగారూ! నా అదృష్ట మెలావుంటే అలాగే జరుగుతుంది” అన్నది శ్రీదేవి.

మరో అరగంట కూచుని తండ్రీ కొడుకు లిద్దరు తమ కాలేజికి వెళ్ళిపోయారు.

వెళ్ళే ముందు సర్వోత్తమరావు మరీ మరీ చెప్పాడు. “పన్నెండు గంటలకి కేరియర్ పంపించమని అటెం డెంట్‌కి చెప్పివచ్చానమ్మా! స్నానం చేసి భోజనం

చెయ్యి—టెంపరేచర్ తగ్గింది. మరేం ఫరవాలేదు!"
అని.

శ్రీదేవి మౌనంగా తలూపింది.

వాళ్ళు అలా వెళ్ళగానే యేదో నిర్ణయాని కొచ్చిన దానిలా లేచి చకచక దుస్తులు మార్చుకున్నది. తమ వెంట తెచ్చుకున్న గాడ్రెజ్ తాళంకప్ప సుమ్మానికి లాక్ చేసి, బయటకొచ్చింది.

ఆమె లక్ష్యం ఒక్కటే! తనకొచ్చిన విపత్తు నుంచి గట్టున పడెయ్యగల వ్యక్తి ఒక్కడే!

అతను పర్ణశాలలో తపస్సు చేసుకుంటున్న బాబూజీ! ఆయన తప్పకుండా వాసు జాడ చెప్పగలడు. అదే ఆమె ధైర్యం!

సరాసరి రెల్లుగడ్డి పర్ణశాలను చేరుకున్నది.

మధ్యలో, దారిలో గడ్డం వ్యక్తి గాని, సంజీవి గాని కనిపిస్తారేమోనని ఆమె గుండె పీచుపీచుమంటూనే వుంది.

కాని వాళ్ళిద్దరి జాడలేదు!

పర్ణశాల దగ్గర పల్లెజనం కొందరు బాబూజీ సేవ కోసం ఎదురుచూస్తూ నిల్చున్నారు.

బాబూజీని కల్సుకోవాలన్నట్టుగా లోపలకు కబురు పెట్టింది శ్రీదేవి.

అయిదు నిమిషాల్లోనే ఆమెకు పిలుపొచ్చింది.

పన్నెండు గంటల్లోపలే బాబూజీ యెవరికయినా సమాధానాలు చెపుతారు. ఆ తర్వాత మళ్ళీ ధ్యానంలో మునిగిపోతారు—ఆ విషయం శ్రీదేవికి తెలియదు. కాని అనుకోకుండా పన్నెండు గంటల లోపలే అక్కడికి రావటం తన అదృష్టంగా భావించుకున్నది.

అప్పుడు మధ్యాహ్నం పదకొండు ముప్పయి అయిదు నిమిషాలయింది!

శ్రీదేవి లోపలికి నడిచింది.

లోపల ఓ బండరాతిమీద పరచిన దర్భాసనం మీద ఆసీనులై వున్న పండు ముదుసలి కనిపించాడామెకు అతన్ని చూడగానే యెంతటివాళ్ళకయినా గౌరవభావం కలుగుతుంది.

అంత క్రితమే యెవరో యిద్దరు భక్తులకి వాళ్ళ సమస్యలకు పరిష్కారం సూచించి మళ్ళీ ధ్యానంలో ఉన్నారని అక్కడివాళ్ళు శ్రీదేవికి చెప్పారు.

రోజుకి ముగ్గురికి మాత్రమే బాబాజీ సమాధానాలు చెప్తారట. ఇది కూడా అక్కడి అనుచర బృందం లోని వాళ్ళు చెప్పారామెకు. ఆ లెక్కన శ్రీదేవి మూడో భక్తురాలు.

కొన్ని క్షణాల తర్వాత బాబాజీ కళ్ళు తెరిచి యెదురుగా వినమ్రంగా నిల్చున్న శ్రీదేవిని చూసి ఆదరంగా నవ్వారు.

శ్రీదేవి ఆయనకు నమస్కరించి "స్వామీజీ నా భర్త గతరాత్రి నుంచి కనిపించటంలేదు. మా కాలేజి నుంచి యెవరో దుండగులు వారి నెత్తుకుపోయారు. దయచేసి వారి జాడ తెలిపి నన్ను రక్షించండి!" అన్నది వినయంగా.

బాబాజీ వదనం గంభీరముద్ర దాల్చింది. కొద్దిసేపు మౌనంగా ధ్యానంలోకి వెళ్ళిపోయారు.

అయిదు నిమిషాల తర్వాత ఆయన కళ్ళు తెరిచి శ్రీదేవివంక దయగా చూసి "నీ భర్త వాసు క్షేమంగా వున్నారు. అయితే అతను నలుగురు శత్రువుల మధ్య

బందీగా వున్నాడు" అన్నాడు.

శ్రీదేవి ముఖంలోకి కొండంత వెలుగు వచ్చింది. "ధన్యురాల్ని స్వామీ! ఆయ నెక్కడున్నారు?"

బాబాజీ కొద్దిసేపటివరకు మాట్లాడలేదు. "కొండ దిగువన చిట్టడివి వున్నది. ఆ చిట్టడివిలో ఓ బంగళా వున్నది. అది పూర్వకాలం రాజులెవరో కట్టించారు. ప్రస్తుతం శిథిలావస్థలో వున్నది. అందులో నీ భర్తను బంధించారు తల్లీ!" అన్నాడు బాబాజీ.

మరుక్షణం బాబాజీకి పాదాభివందనం చేసి ఒక్క ఉదుటున బయటికొచ్చింది శ్రీదేవి.

పర్ణశాలని ఆనుకొని ఏటవాలు కొండ, కొండలమధ్య లోయ, లోయకి ఎడమపక్కగా పవర్ స్టేషను, కుడి పక్కగా పంపింగ్ హౌస్ కనిపించాయి శ్రీదేవికి.

పరీక్షగా ముందుకి—కొండ దిగువకు దృష్టిని సారించింది. ఒత్తుగా పెరిగిన పొదలతో చెట్లతో చిట్టడివి కనిపించింది. చెట్ల మధ్యగా దూరంగా ఏదో పురాతన కట్టడం కనిపించింది.

బాబాజీ చెప్పిన శిథిలబంగళా అదే అయివుంటుంది. చూడటానికి దగ్గరగానే కనిపించినా దాన్ని చేరటానికి ఎంత కాదన్నా రెండు మూడు గంటలు పడుతుంది.

ముందు బస్‌లో ప్రయాణం చేసి కొండ దిగువకు వెళ్లాలి. ఆ తర్వాత చిట్టడివిలో ప్రవేశించి, ఆ పురాతన భవనాన్ని చేరాలి!

శ్రీదేవిలో తెగింపు ధైర్యం, చొరవ చోటు చేసుకున్నాయి. వెంటనే బస్ స్టాప్ దగ్గరకు నడిచింది. వచ్చేటప్పుడు హేండ్ బాగ్ తెచ్చుకోవటం మరచిపోలేదు. అందులో అవసరానికి సరిపడే డబ్బుంది.

ఆ హడావిడిలో సర్వోత్తమరావు గాని నరోత్తమ రావుగాని ఆమెకు గుర్తురాలేదు.

# 7

బస్‌లో కొండదిగువకు ప్రయాణం సాగించింది శ్రీదేవి. కొండెక్కేటప్పుడు మనసును ఆహ్లాదపరచిన ప్రకృతి దృశ్యాలు యిప్పుడామె మనసు కెక్కడంలేదు. చిరాగ్గా, ఆందోళనగా వుంది. టెన్షన్‌తో మెదడు నరాలు చిట్లి పోతాయేమో నన్నట్టుగా వుంది.

ఓ అరగంట పైగానే పట్టింది కొండ దిగటం.

కొండ దిగుతూనే బస్ నుంచి కిందికి దుమికి పవర్ స్టేషన్ వైపు చకచక సాగిపోయింది శ్రీదేవి. కొండ మీది నుంచి చూసినపుడు ఎంతో దగ్గర అనిపించిన పవర్ స్టేషన్ ఓ గంటవరకు చేరుకోలేకపోయింది.

ఓ పక్క కడుపులో ఆకలి దహించివేస్తోంది. పది రెండు గంటల ప్రాంతంలో మందుబిళ్ళ వేసుకోవటం కోసం తాగిన కాఫీ తప్ప మరే ఆధరవూ లేదు కడుపులో. అయినా ఆమె లెక్క చేయలేదు. ఓ పక్క నిస్త్రాణగా నీరసంగా వున్నా—వడి వడిగా అడుగులు వేస్తూనే ఉంది.

ఒకే లక్ష్యంతో ఒకే గమ్యంతో ముందుకు దూసుకు పోతోంది శ్రీదేవి. యిలాగైనా భర్తను శత్రువుల బారి నుంచి రక్షించుకోవాలి! ఆయన్ని రక్షించే ప్రయత్నంలో తన ప్రాణం పోయినా సరే! తను లెక్క చేయదు.

ఆమె మరో గంటలో శిథిలబంగళా దగ్గర కొచ్చేసింది.

అది చాలా పెద్ద బంగళా—విశాలమైన గదులు, ఎత్తయిన స్తంభాలు మూరానికి ఓ పెద్ద కోటలాగా

భ్రమ కలిగిస్తున్నాయి.

సరాసరి లోనికి చొచ్చుకొనిపోయింది.

దారిలో ఆమె కెవరూ ఎదురుకాలేదు. ఎవరూ అడ్డగించలేదు.

ముందు విశాలమైన హాలు కనిపించింది. పెద్ద మండువా ఆగి. దానికి చేర్చి వరసగా పెద్ద పెద్ద గదులున్నాయి. వాటి తలుపులు చాలవరకు చెదలు తినేసి శిథిలావస్థలో వున్నా గత వైభవ చిహ్నాలు చెక్కు చెదరకుండా నిలిచి వున్నాయి.

ఈ గదుల్లో యెందులోనో తన భర్తను బంధించి వుండొచ్చు.... అన్ని గదులూ వెదుకుతూపోతే....!?

అప్పటికే ఆమె బాగా అలసిపోయింది.

ఒక్క క్షణం ఆగి అలపు తీర్చుకోవాలనుకున్నది. మరుగ్గా వున్న ఓ గది గోడ నానుకుని నిల్చున్నది.

పక్కనే గుప్పున ఖరీదయిన ఆల్కహాలు వాసన ముక్కుపుటాల్ని అదరగొట్టింది.

చటుక్కున తల తిప్పి చూసిన శ్రీదేవి నిశ్చేష్టురాలై నిల్చుండిపోయింది.

అక్కడ నలుగురు గూండాలాంటి వ్యక్తులు కూచుని సీసాలకి సీసాలు మద్యం గడగడ తాగేస్తున్నారు___ సిగరెట్లు కాల్చుతూ, మాంసం నంజుకొంటూ కేరింతలు కొడ్తున్నారు.

అయితే వాళ్ళెవరూ శ్రీదేవిని గమనించలేదు.

గమనించలేదని ఆమె భ్రమపడింది. కాని కోరలు చాచుకుని తన మీదకు లంఘించటానికి ఓ నరరూప రాక్షసుడు కాచుకుని వున్నాడని ఆమెకు తెలియదు.

"వచ్చావా, నీ కోసమే చూస్తున్నాను!" అన్న

మాటలు వినిపించి చటుక్కున అటు తలతిప్పి నిర్ఘాంత పోయింది శ్రీదేవి.

# 8

"బాబూజీ, మీరా? ఇక్కడ?" అన్నది శ్రీదేవి తన కళ్ళను తనే నమ్మలేకపోతూ.

పర్ణశాలలోని మౌని బాబూజీ- ఆమె కెదురుగా నిల్చుని చిరునవ్వు నవ్వుతున్నాడు.

బాబూజీ నవ్వుతూ ఆమెను సమీపించాడు. "నీ భర్తను రక్షించుకోవాలని పాపం యింతదూరం వచ్చావు కదూ! నీ కెలాంటి ప్రమాదం ఎదురుకాకూడదని నిన్ననుస రిస్తూ నే నొచ్చాను. నీ భర్తను చూస్తావా?" అడిగాడు నవ్వుతూ.

శ్రీదేవి ధర్మసంకటంలో వూగిసలాడుతోంది. పర్ణ శాలలో తపస్సు చేసుకునే బాబూజీ తనని యీ శిథిల భవనానికి వెళ్ళమని సూచించిన బాబూజీ, తనకన్న ముందు గా నే యిక్కడి కెలా చేరుకున్నాడు? పైగా తనకి సహాయం చెయ్యాలని తనకి తోడుగా రావటమా? అసం భవం! ఇందులో యేదో మోసముంది.

"రా, అలా నిల్చుండిపోయావేం? నీ భర్త వాసుని శత్రువుల బారినుంచి తప్పించాలని వచ్చావు కదా! ఇంకా ఆలోచిస్తూ సమయాన్ని వ్యర్థం చేస్తావెందుకు?" బాబూజీ ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

విషసర్పం తనని తాకినట్టు విల విల్లాడింది శ్రీదేవి. అతని చెయ్యిని విదిల్చికొట్టి, "మీరు ....నువ్వు బాబూజీవి కాదు!" అన్నది!

బాబూజీ వికటంగా నవ్వి "నువ్వు చాలా తెలివైన దానివి. ఎస్, యు ఆర్ రైట్! నేను బాబూజీ కాని

బాబూజీని! అయితే నీకు సలహా చెప్పిన బాబూజీనే! పర్ణశాలలో నీకు కనిపించిన బాబూజీనే!

తపస్సు చేసుకుంటూ ముక్కు మూసుకుని పర్ణశాలలో సంవత్సరాల తరబడి భక్తుల మన్ననలందుకున్న బాబూజీ ఎప్పుడో స్వర్గలోకాన్ని వెతుక్కుంటూ పోయాడు. దాదాపు ఆర్నెల్లయింది. అప్పట్నుంచీ నేనే బాబూజీని" అంటూ తెల్లగా వెండిలా మెరుస్తూన్న గడ్డాన్ని, మీసాల్ని, తెల్లజుట్టును లాగిపారేశాడు.

బాబూజీ స్థానంలో ముప్పయ్యేళ్ళ యువకుడు నిల్చుని వున్నాడు. కర్కశంగా నవ్వుతున్నాడు. అతని కళ్ళలో ఎరుపుజీరలు అతను బాగా తాగివున్నాడని చెప్పక నే చెప్తున్నాయి. కాంతతో, తమకంతో శ్రీదేవిని సమీపించి మళ్ళీ చెయ్యి అందుకున్నాడు.

"నన్ను విడిచిపెట్టు. మా వారినెక్కడ దాచావో చెప్పు! నీ మాట నమ్మి తెలివితక్కువగా యిక్కడకు వచ్చి చాలా పొరపాటు చేశాను. నన్ను, నా భర్తను వదిలెయ్యి....ప్లీజ్!" రెండు చేతులు జోడించింది శ్రీదేవి.

"పిచ్చిదానా, నీ భర్త యిక్కడెందుకుంటాడు? కొండమీదే వున్నాడు. ముప్పయిమూడో నా కాటేజిలో భద్రంగా వున్నాడు. నిన్నిక్కడికి రప్పించటం కోసమని నీ భర్త యిక్కడున్నాడని కల్పించి చెప్పాను.

నిన్న సాయంత్రం నువ్వు నీ భర్తతో బస్ దిగినప్పుడే నా మనుషులు నీ అందం గురించి నీ పర్సనాల్టి గురించి నాకు వెంటనే కబురు చేశారు. నేను, నా ఫ్రెండ్సు ఆర్నెల్లుగా యీ పర్ణశాల కొండకొచ్చే సుందరాంగుల నెందరిన్నో ఉమ్మడిగా అనుభవించాం. వాళ్ళ భర్తల్ని

బంధించి అనక వదిలేశాం. అమ్మాయిల్ని కూడా మా అవసరాలు తీరాక వదిలేసేవాళ్ళం.

కాని, బాబూజీయే యివన్నీ చేస్తూన్నట్టు యెవరికీ తెలియకుండా ఆర్నెల్లుగా గడుపుకొస్తున్నాం. ఈ రోజు కూడా నా నిజరూపం నీకు తెలియకుండా పోయేది. గాని, నేనే కొంచెం తొందరపడ్డాను.

నిన్న అటెండెంట్ తెచ్చిన కారియర్లో కావాలనే మత్తుమందు కలిపించాం. మీ రిద్దరు మత్తులో మునిగి వుండగా నిన్నెత్తుకొచ్చేయాలనుకున్నాం. కాని నీ మొగుడు లోపల్నుంచి తలుపు బోల్టు పెట్టుకోవటంవల్ల తలుపులు తెరవటం ఆలస్యమయ్యింది మాకు. నీ మొగుడు తలుపులు తెరిచేవరకు ఆగవలసి వచ్చింది.

అప్పుడు కూడా, నిన్ను తీసుకొచ్చేలోపల మీ ఎదుటి కాలేజి మూసలాళ్ళు అడ్డొచ్చి మా పనికి ఆటంకం కలిగించారు. లేకుంటే పోయిన రాత్రే ముప్పయిమూడో నెంబరు కాలేజి పులకించిపోయి వుండేది నీ శృంగారంతో....'' అతను ఒక్కో అడుగే ముందుకు వేస్తున్నాడు.

శ్రీదేవి భయంతో కంపించిపోతూ ఒక్కో అడుగు వెనక్కు వేస్తోంది. బాబూజీగా పరిచయమైన ఆ వ్యక్తి చటుక్కున ముందుకు జరిగి ఆమెను తన బాహువుల్లో బంధించాడు.

శ్రీదేవి ఎగిరి అతని గుండెలమీద తన్నింది. అతను ఊహించని యీ దాడికి ఓ క్షణం తడబడి మళ్ళీ ఆమె మీదికి లంఘించబోయాడు. శ్రీదేవి ఈసారి అతని కాళ్ళ మధ్య సున్నిత ప్రదేశంలో తన్నింది.

అతను విలవిల్లాడుతూ నేలమీదకు విరుచుకు పడి

పోయాడు.

శ్రీదేవి ఒక్క ఉదుటన్న బయటకు పరుగెత్తింది. ఆ వ్యక్తి కేకలు పెడుతున్నాడు. అంతవరకు బ్రాందీ మత్తులో తూలుతున్న అతని అనుచరులు నలుగురూ ఒక్కసారిగా మత్తునుంచి బయటపడి శ్రీదేవిని వెంబడించారు.

శ్రీదేవి పదడుగులు పరుగెత్తి గడ్డిదుబ్బు తగిలి బోర్లా పడిపోయింది. మోచేతులు, మోకాళ్ళు చెక్కుకు పోయాయి.

సరిగ్గా అప్పుడే అనుచరులు నలుగురు ఆమెను సమీపించారు.

వాళ్ళు నలుగురు ఆమెమీదికి లంఘించే సమయంలో ఊహించని విధంగా సంజీవి, గడ్డం వ్యక్తి వాళ్ళ నలుగురు మీద వెనుక నుండి దాడి చేశారు.

వాళ్ళెక్కడ్నుంచి వూడిపడ్డారో తాగుబోతులు ఊహించేలోపల వాళ్ళ నలుగుర్ని పాదవాటి కట్టె పుల్లలతో నెత్తిమీద బలంగా మోదారు సంజీవి, గడ్డం వ్యక్తి.

అసలే బాగా తాగివున్న ఆ నలుగురికీ తలలు దిమ్మెక్కి వూపిరాడలేదు. జేబుల్లో దాచుకున్న కత్తుల్ని పైకి తెచ్చేలోపల మళ్ళీ సంజీవి, గడ్డం వ్యక్తి వాళ్ళని వూపిరి తిరక్కుండా కట్టెలతో మోది, నేల కరిపించారు.

కిందపడ్డ శ్రీదేవి అప్పటికి సర్దుకుని లేచి నిల్చుంది.

సరిగ్గా అప్పుడే బాబూజీ వేషం ధరించిన ఆ వ్యక్తి అక్కడ ప్రత్యక్షమయ్యాడు. అతని చేతిలోని రివాల్వర్

నూటిగా శ్రీదేవికి గురిచేసి వున్నది!

"మీరెవరైనా నా కుదురుపని చెయ్యాలని ప్రయత్నిస్తే యీ మెను నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాను. కట్టెపుల్లలు నేల మీద పడేసి చేతులెత్తి ఆమె పక్కనే నిలబడండి" అని ఆజ్ఞాపించాడా వ్యక్తి.

సంజీవి, గద్దవ్యక్తి ఒకరి ముఖాలొకరు చూసుకుని కట్టెపుల్లలు నేలమీద పడేసి శ్రీదేవి పక్కగా వచ్చి నించున్నారు.

## 9

"రెడీ. వన్....టూ....మీ యిష్టదైవాన్ని తల్చుకోండి! ఈ రజనీమీద తిరగబడ్డవాళ్ళెవరూ బతికి బట్టగట్టలేదు. నా రహస్యాలు తెలిసిన మిమ్మల్ని ప్రాణాలతో వదలను....త్రీ...." అనబోయాడు బాబాజీగా పరిచయమైన రజనీ.

అంతే! ఆ మరుక్షణం అతని చేతిలోని రివాల్వర్ ఎగిరి దూరంగా పడింది. రక్తం కారుతున్న చేతిని ఎడమ చేతో అదిమి పట్టుకుని అదిరిపడి చూశాడు రజనీ!

ఎదురుగా పొగలు కక్కుతున్న రివాల్వర్‌తో నరోత్తమరావు నిల్చుని వున్నాడు.

"వాళ్ళు కాదు, నువ్వు తల్చుకో నీ ఇష్టదైవాన్ని!" అంటూ శ్రీదేవివైపు తిరిగి, "నువ్వు యీ యిద్దరితో కాటేజ్‌కి వెళ్ళమ్మా! నాన్నగారు ఎదురుచూస్తూన్నారు. నీ భర్త వాసు జాడ తెలిసింది. ముప్పయిమూడో కాటేజిలో బంధింపబడి వున్నట్టు మేనేజ్‌మెంట్ వాళ్ళు కనిపెట్టి, యింతక్రితమే అతిన్ని మీరు బసచేసిన కాటేజ్‌కి అప్పగించారు. మీ నాన్న పుల్లారావు కూడా వచ్చాడు. ప్రస్తుతం అల్లుడితోనే వున్నాడు పరామర్శిస్తూ...."

అన్నాడు.

రజనీ కుర్రుగా చూశాడు.

"మీ రిక్కడికెలా వచ్చారు? నే నిక్కడున్నట్టు మీ కెలా తెలుసు?" అడిగింది శ్రీదేవి. ఓ పక్క భర్త క్షేమంగా వున్నాడన్న వార్త, మరోపక్క తండ్రి తనను వెతుక్కుంటూ పర్ణశాలకు వచ్చాడన్న శుభ వార్త, ఆమె మనసును ఆనందంలో ముంచెత్తేశాయి.

"నువ్వు ఫోంచేశావో, లేదో చూడటానికి వచ్చిన వాకు గుమ్మానికి వేలాడుతున్న తాళంకప్ప కనిపించింది. ఏమైపోయావోనని తర్జన భర్జనల్లో వున్న మా యిద్దరికీ ఎంక్వయిరీ ఆఫీస్ నించి కబురొచ్చింది వాసు దొరికాడని! వెంటనే ఆ కాటేజ్ కి వెళ్ళి వాసుని వెంటబెట్టుకుని మీ కాటేజ్ కొచ్చాం.

అప్పుడే మీ నాన్న మీ కాటేజ్ కొచ్చాడు. వాడు నేను యింటర్ వరకు క్లాస్ మేట్స్. పుల్లారావు కూతురు వని గతరాత్రే నేను గుర్తించాను. నీ భర్త నెవరో ఎత్తుకు పోవటం చూశాంకదా, కంప్లెయింట్ యివ్వటానికి పేరు కోసం చూశాం. టేబిల్ మీద నీ డైరీ కనిపించింది. అందులో మీ గురించిన వివరా లున్నాయి.

అప్పుడే తెలిసింది నువ్వు పుల్లారావు కూతురని! మీ భార్యాభర్తలు మా కెంతో సన్నిహితులని, మీ రక్షణ భారం మా మీద వేసుకున్నాం. తర్వాత మీ నాన్నకు ఫోన్ కూడా చేశాము.

మేమందరం నీ గురించి వెతుక్కోవటం మొదలెట్టాం.... వాసు లేవలేని స్థితిలో వున్నాడు. నేనే అతన్ని రావద్దని చెప్పి ఆపుచేశాను.

ఇంతలో సంజీవి, యీయన స్నేహితుడైన యీ సలీం

నన్ను కల్సుకున్నారు. సంజీవి ఉదయం నేను నీకు ట్రీట్ చేస్తూండగా చూశాడట. అంచేత నన్ను వెంటనే గుర్తుపట్టి, నువ్వు కొండదిగుతూ బస్‌లో వెళ్తున్నావని ఒంటరిగా వెళ్తున్నావని వెంటనే నిన్ను కల్సుకోవటానికి వెళ్ళాలని చెప్పాడు.

నేను వీళ్ళిద్దర్నీ ముందు పంపించి, రివాల్వర్ కోసం నా కాలేజ్‌కి తిరిగొచ్చాను. నువ్వేదో ప్రమాదంలో చిక్కుకున్నావని ముందుగా తెలీదు. అయినా ముందు జాగ్రత్తకోసమని రివాల్వర్ వెంట తెచ్చుకోవటం యిలా ఉపయోగపడింది" అంటూ ముగించాడు నరోత్తమ రావు.

ఈ లోపల సంజీవి, గడ్డంవ్యక్తి సలీం, కిందపడిన నలుగుర్నీ, రజనీని కట్టకలిపి ఓ నైలాన్ తాడుతో కట్టేశారు. ఆ తాడును శిథిల భవనంలో వెతికి తెచ్చాడు సలీం.

శ్రీదేవి సలీంవంక, సంజీవివంక అయోమయంగా చూసింది.

సంజీవి గొంతు సవరించుకుని, "శ్రీదేవీ! నీ పెళ్ళి వాసుతో జరిగిపోయిందని తెలిశాక నా మనసు మార్చుకున్నాను. మామయ్యను కూడా పట్టుదలకు పోవద్దని, నిన్ను వదులుకోవద్దని నచ్చచెప్పాను—ఆయన నన్ను నీ కోసం వాసు యింటికి పంపాడు. నిన్న ఉదయం మీరు పర్ణశాలకు హనీమూన్‌కి వెళ్ళారని వాసు యింట్లో చెప్పారు. మామయ్య నన్ను వెంటనే మీ దగ్గరకు వెళ్ళి యింటికి తీసుకురమ్మని పంపాడు.

నిన్న పర్ణశాలకు వచ్చే బస్‌లు దాటిపోవటంతో ఈ రోజు ఉదయమే బయల్దేరి వచ్చాను. రాగానే పర్ణశాల

కొండమీద సలీం కనిపించాడు. సలీం నా స్నేహితుడు. నువ్వు నా మేనమామ కూతురువని వీడికి తెలియదు. వీడి నో సారి అవమానించావని అందుకని నీ మీద కక్ష తీర్చుకోబోతున్నానని చెప్పాడు. అయితే నువ్వు నాకే మవుతావో చెప్పాక, తన అభిప్రాయాన్ని వెంటనే మార్చుకున్నాడు. నీకు క్షమాపణ చెప్పుకుంటానని చెప్పాడు.

ఇద్దరం మీ కాటేజ్ కి వచ్చాం. కాని తలుపు తాళం పెట్టివున్నది. నిన్ను ముందు చూసిన వెంటనే కాటేజ్ కి వచ్చివుంటే నువ్వు యీ ప్రమాదంలో చిక్కుకొని వుండకపోయేదానివి! మేమిద్దరం తర్జన భర్జనల్లో కొంత టైం వేస్టుచేశాం. ఇంతలో నువ్వు తాళంపెట్టి వెళ్ళి పోయావు.

నిన్ను వెతుక్కుంటూ వచ్చాం. బస్ కిటికీవైపు చూచున్న నిన్ను చూశాం. అప్పటికే బస్ కొండదిగి పోతున్నది.

ఇంతలో డాక్టర్ నరోత్తమరావుగారు కనిపించారు. నువ్వు ఒక్కదానివీ వెళ్ళిపోతున్నావని చెప్పాం. ఏదయినా అఘాయిత్యం చేస్తావని డాక్టరుగారు భయ పడ్డారు. వాసు కనపడటం లేదన్న విషయం అప్పుడే తెలిసింది మాకు.

వెంటనే మేమిద్దరం టాక్సీ కుదుర్చుకుని కొండదిగుత వచ్చాం. డాక్టరుగారు కాటేజ్ కి వెళ్ళొస్తామని వెళ్ళి పోయారు. కొండ దిగేసరికే నువ్వు చిట్టడవిలోకి వెళ్ళి పోవటం జరిగింది. మేము నిన్ను వెంబడించాం. ఇదీ జరి గిన సంగతి!" అని ముగించాడు.

సలీం శ్రీదేవిని సమీపించి, "నన్ను క్షమించండి! మీ

మీద పగ తీర్చుకోవాలనుకున్నాను. మీరు నా ఫ్రెండు బంధువని తెలిశాక నా అభిప్రాయం మార్చుకున్నాను. మీరు నా చెల్లెలుతో సమానం!" అన్నాడు.

శ్రీదేవి నవ్వుతూ అతనికేసి చూసి, "నిన్న రాత్రి నుంచి ఉదయంవరకు నన్ను వెంటాడి వాడలగొట్టేశారు కదూ!" అన్నది. తర్వాత సంజీవికేసి తిరిగి, "నిన్న పొరపాటు చేసుకున్నాను బావా! ఉదయం కిటికీలో నుంచి నిన్ను, సతీంగార్ని చూశాను. మీ ఇద్దరు నా మీద పగబట్టారని భ్రమ పడ్డాను. నా ప్రాణాలు రక్షిస్తారని కల్లో కూడా అనుకోలేదు" అన్నది.

సంజీవి మందహాసం చేసి, "నిన్ను చూసిన వెంటనే నిన్ను కలుసుకోకుండా మేమిద్దరం కేంటిన్ కి వెళ్ళటం పొరపాటయింది. నీమీద దురభిప్రాయాన్ని పోగొట్టాలనే వీడ్ని కేంటిన్ కి తీసుకువెళ్ళి బోధ చేశాను. ఇద్దరం నీ కాలేజ్ కి తిరిగొచ్చేసరికి నువ్వు పారిపోతావని కలగంటామా?" అన్నాడు.

నరోత్తమరావు "పదండి, పదండి! వీళ్ళను సగౌరవంగా పర్ణశాల మేనేజ్ మెంట్ కి అప్పగించాలి! మీ ఇద్దరు ముందు పవర్ హౌస్ దగ్గర్నుంచి పర్ణశాల ఎంక్వైరీ ఆఫీస్ కి ఫోన్ చేసి పోలీసులని పంపించమని చెప్పండి! నేను వీళ్ళను కాపాలా కాస్తూంటాను. నువ్వు వీళ్ళతో వెళ్ళమ్మా!" అన్నాడు శ్రీదేవిని చూసి.

—: అయిపోయింది :—

# ఘాట్‌రోడ్ ప్రమాదం

బొమ్మిడి అచ్చారావు

రాత్రి పన్నెండు గంటల సమయం.

ఘాట్ రోడ్ మీద కడప నుంచి హైదరాబాద్ వెళ్లే బస్ పోతోంది. చుట్టూ ఎటు చూసినా చెట్లు, లోయలు, బండరాళ్ళ గుట్టలు. బస్ ఏమాత్రం బాలెన్స్ తప్పినా లోయల్లో పడిపోవటం ఖాయం! లోయలు, దిగువ యేముందో కనిపించనంత లోతుగా వున్నాయి.

బస్‌లో దాదాపు ఏభైమంది ప్రయాణీకు లున్నారు. కండక్టరు, డ్రైవరు తప్ప ప్రయాణీకు లందరూ హాయిగా నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోవలసిన నిద్రా సమయం కాని, ఏ ఒక్కరు నిద్రపోవటంలేదు సరికదా, భయంతో టెన్షన్‌తో బిగుసుకుపోయారు.

బస్ బాడీలో రక్తంమడుగులో పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఆఖరి శ్వాస వదిలి పడున్నాడు భయంకరంగా, ఆ దృశ్యం చూడలేక అందరు కళ్ళు మూసుకున్నారు.

ప్రొఫెసర్ జాదవ్ మాత్రం గంభీరంగా తన సీట్లో

కూచుని జరుగుతున్న తంతు చూస్తున్నాడు.

బస్‌లో అజానుబాహులైన యిద్దరు వ్యక్తులు తుపాకుల్తో నిల్చుని వున్నారు. ఒకడు ప్రొఫెసర్ జాదవ్ పక్కనే నించుని వున్నాడు. రెండోవాడు డ్రైవర్‌కి రివాల్వర్ గురిచేసి నిల్చున్నాడు.

"డ్రైవర్, మొండితనానికి దిగొద్దు. బస్ ఆపు. ఒన్ టూ...." రెండో వ్యక్తి రివాల్వర్ సేఫ్టీ కాచ్ తప్పించాడు. డ్రైవర్ బస్ ఆపలేదు సరికదా మరింత వేగంగా ఏక్సిలేటర్ తొక్కాడు.

సరిగ్గా అప్పుడే బస్ మలుపు తిరుగుతోంది. బ్లైండ్ కర్వ్! బాగా యిరుకు మలుపు. చుట్టూ లోయలు

ఆ యిద్దరు దుండగులు ఒక్కసారిగా ప్రొఫెసర్ జాదవ్‌ని అతని బ్రీఫ్ కేసుతో సహా, వాటేసుకుని డోర్ దగ్గరకు తీసుకొచ్చారు. అప్పటికీ డ్రైవర్ బస్ ఆపలేదు.

రెండో దుండగుడి చేతిలోని రివాల్వర్ గర్జించింది.

డ్రైవర్ అమాంతం స్టీరింగ్ మీద వాలిపోయాడు. బస్‌లో ఒక్కసారిగా హాహాకారాలు చెలరేగాయి.

దుండగు లిద్దరు ప్రొఫెసర్‌తో బాటు రోడ్ మీదికి ఉరికేశారు లాఘవంగా.

మరుక్షణం పెద్ద శబ్దంచేస్తూ బస్ లోయలోకి దొర్లిపోయింది. ఆ నిశీథ నిర్జన ప్రాంతంలో ఆ శబ్దం చాలా సేపు ప్రతిధ్వనిస్తూనే వుంది.

## 2

మర్నాడు పేపర్లన్నిటిలోను బస్ ప్రమాదం గురించిన వార్త ప్రముఖంగా ప్రచురించబడింది.

బస్‌లోని ప్రయాణీకుల్లో ఓ రాజకీయ నాయకుడు,

యిద్దరు ప్రముఖ పారిశ్రామికవేత్తలు, ఓ పేరుమోసిన పెయింటరు, ఓ పోలీస్ సర్కిల్ ఇన్‌స్పెక్టర్ వుండటం విశేషం!

అర్ధరాత్రి జరిగిన ప్రమాదాన్ని చూసిన ప్రత్యక్ష సాక్షులెవరూ లేకపోవటంవల్ల, డ్రైవర్ అజాగ్రత్త వల్ల బస్ లోయలో పడిపోయి వుంటుందని పత్రికలు ఊహాగానం చేశాయి. అయితే ప్రయాణీకు లెంతమంది చని పోయారో, అసలెవరైనా బతికున్నారో లేదో ఆ వివరాలు ప్రచురించటానికి వ్యవధి చాలనందున ఆ మరునాడు ప్రచురిస్తామని వ్రాశాయి.

కడప నుంచి హైదరాబాద్ పోయే రూట్‌లో గిద్దలూరు నంద్యాల మధ్యనున్న ఘాట్ రోడ్ దగ్గర జరిగిందా ప్రమాదం. అంతక్రితం రోడ్డు ప్రమాదాలయితే జరగలేదుగాని, దారిదోపిడీలు తరచు జరుగుతుండేవి ఘాట్ రోడ్‌లో.

చెట్లనో, పెద్ద రాళ్ళనో రోడ్డు కడ్డంగా వేసి వచ్చే పోయే బస్‌లని ఆపి, సాయుధులైన బందిపోట్లు ప్రయాణీకులని బెదిరించి వారినుంచి బంగారు వస్తువులను, పెద్ద మొత్తంలో నగదును దోచుకుని ప్రతిఘటించినవారిని తీవ్రంగా గాయపరచి తమ పని పూర్తికాగానే దట్టంగా అలుముకున్న చెట్ల గుబురుల్లోకి పారిపోయి మాయమై పోయేవారు.

రాను రాను బస్‌లతోబాటు పోలీస్ ఎస్కార్టు, మొబైల్ పెట్రోలింగ్ చర్యలు - తీవ్రతరం కావటంతో దారిదోపిడీలు కనబడకుండా తెగిపోయాయి. చాన్నాళ్ళ తరవాత యిప్పుడు జరిగిన ప్రమాదమే ఆ రూట్‌లో సెన్సేషనల్ వార్తయ్యింది.

ఉదయమే పేపర్‌లో ప్రమాద వార్త చదివిన శరత్ నిర్ఘాంతపోయి పదేపదే ఆ వార్త చదివాడు.

అదే బస్‌లో అతని తండ్రి ప్రయాణం చేశాడు. తాను కొత్తగా పరిశోధించిన అంశం గురించిన వివరాలు హోంమినిష్టర్‌కి తెలియచేయటానికి హైదరాబాద్ బయల్దేరి వెళ్ళాడు అతని తండ్రి, ప్రొఫెసర్ జాదవ్. అనుకోకుండా ప్రమాదంలో చిక్కుకుపోయాడు.

శరత్ ఏమాత్రం ఆలస్యం చెయ్యలేదు. ఉన్న పళంగా ప్రమాదస్థలానికి బయల్దేరాడు. సరాసరి బస్ స్టేషన్‌కి వెళ్ళి హైదరాబాద్ పోయే బస్ ఎక్కాడు. సాయంత్రానికి స్పాట్‌కి చేరుకున్నాడు.

ప్రమాద స్థలమంతా చాలా హడావిడిగా వుంది. అప్పటికే చాలావరకు శవాల్ని వెలికి తీశారు. వాళ్ళ తాలూకు బంధువులు దాదాపు అందరు అక్కడికి చేరుకున్నారు. పోలీసులు, సహాయ సిబ్బంది పూర్తిగా సహాయ చర్యల్లో మునిగిపోయి వున్నారు. దాదాపు అరవై అడుగుల దిగువ లోయలో పడిపోయిన కారణంగా ఎవరూ బతకలేదు.

బస్ తుక్కయిపోయింది. క్రేన్ సహాయంతో బస్‌ని గుట్టమీదికి చేర్చారు. బస్‌లో చిక్కుకుపోయి సీట్లుకింద ఇంజన్ పక్కన, సీట్లు మధ్య క్రష్ అయిపోయిన ప్రయాణీకులు కొంతమంది రూపురేఖలు తెలియటంలేదు. అతి సన్నిహితులు తప్ప గుర్తుపట్టలేని విధంగా అతి దారుణంగా వున్నాయి శవాలు.

ఆ శవాల మధ్య తన తండ్రి జాదవ్‌ని గుర్తుపట్టడానికి ప్రయత్నిస్తున్నాడు శరత్. అప్పటివరకు పైకి తీసిన శవాల్లో తండ్రి శవం లేదు!

శరత్ ఆశానిరాశల మధ్య ఊగిసలాడుతున్నాడు.

గాలింపు యింకా కొనసాగుతూనే వున్నది.

అప్పుడు రాత్రి ఎనిమిదిన్నర గంటలయింది.

సెర్చ్‌లైట్ల వెలుగు ఆ ప్రదేశాన్ని ప్రకాశవంతంగా చేసింది. చుట్టుపక్కల కొన్ని వందల గజాల వరకు స్పష్టంగా కనిపిస్తోంది.

శరత్ మలుపు దగ్గర గొంతు కూర్చుని చూస్తున్నాడు.

చుట్టూ పెద్ద హడావిడి జరుగుతున్నా అతని ఏకాగ్రతకు భంగం కలగలేదు. బి.టెక్ ఫైనలియర్ చేస్తున్న శరత్‌కి ప్రతి చిన్న విషయాన్ని నిశితంగా పరిశీలించటం, ఆకళింపు చేసుకోవటం బాగా అలవాటయింది.

అతని శ్రమ వ్యర్థం కాలేదు.

మలుపు తిరిగే చోట, ఆర్ అండ్ బి. డిపార్టుమెంటు వాళ్ళు రాత్రిళ్ళు రహదారి స్పష్టంగా కనిపించటం కోసం తెల్లసున్నం కొట్టి పాతే రాళ్ళు, కొద్దిగజాల దూరంవరకు ఎవరో లాగిపారేసినట్టు స్పష్టంగా కనిపించింది! అంటే ఎవరో కావాలనే రాళ్ళను, ఫెన్సింగ్ తీగను తొలగించి వేశారు. అంటే, యిది కేవలం కాకతాళీయంగా జరిగిన ప్రమాదం కాదన్న మాట! కావాలని కల్పించిన ఏక్సిడెంట్!

బస్‌ని కావాలని ప్రమాదంపాలు చేస్తే వాళ్ళకి ఒరిగేదేమిటి? బస్‌లో వాళ్ళ శత్రువు లెవరైనా వున్నారా? వాళ్ళని నాశనం చెయ్యటం కోసం మొత్తం ప్రయాణీకు లందరి ప్రాణాలు నిర్దాక్షిణ్యంగా తీసేశారా?

ఇంతకీ వాళ్ళెవరు? బస్ ప్రయాణీకుల్లో వాళ్ళ

శరత్ తల విదిలించాడు. ఎవరైనాగాని, వాళ్ళెంత శత్రువులైనా గాని, తమ కక్ష సాధించుకోవటం కోసం అమాయకులయిన తక్కిన ప్రయాణీకుల్ని మట్టుపెట్టడం రాక్షసత్వం!

శరత్ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఓ పక్క తండ్రి గురించిన దుఃఖం వివశుడ్ని చేస్తోంది. కనీసం శవం కూడా యింతదాకా కనిపించలేదు. గాలింపు ఎంతకీ ముగిసేలా కనిపించటం లేదు.

తెల్లవార్లూ గాలింపు జరుగుతునే వుంది.

అన్ని శవాలు పైకి తెచ్చేశారు. ప్రయాణీకుల్లో ఒక్కరు కూడా బతికిలేరు. కొసప్రాణంతో మిగిలిన నలుగురైదుగురు పైకి చేరుకునే లోపల ప్రాణాలు వదిలేశారు.

ఎక్కువమందికి కాళ్ళు చేతులు విరిగిపోయి, రక్తస్రావం హెచ్చు మోతాదులో జరిగి ప్రాణాలు పోగొట్టుకున్నారు. కొందరైతే ఒంటిమీద చిన్న గాయం కూడా లేకుండా కేవలం భయంతోను, షాక్‌తోను చనిపోయారు.

శరత్ శవాలన్నిటినీ ఆత్రుతగా వెతికాడు తండ్రి కోసం.

ప్రొఫెసర్ జాదవ్ శవం శవాలగుట్టలో లేదు! అంతే కాదు ఆయన తనవెంట తీసుకువెళ్ళిన బ్రీఫ్‌కేస్ కూడా కనిపించలేదు.

ప్రయాణీకు లందరి సూట్‌కేసులు, ఏర్ బాగ్స్, వాళ్ళ వస్తువులు దాదాపు అన్నీ దొరికాయి. వాటిలో తండ్రి బ్రీఫ్ లేకపోవటం, తండ్రి శవమే మాయంకావటం

శరత్‌ని దిగ్భ్రాంతిలో ముంచింది. ఆయన ఏమైనట్టు? ఈ బస్‌లో ప్రయాణం చెయ్యలేదేమో!కి బస్ ఆఖరిక్షణంలో మిస్సయి....నో, నో....అనే తండ్రిని బస్ ఎక్కించాడు. ఇదే బస్! అనుమానం లేదు.

ఈ బస్ తనకి బాగా గుర్తు! నెంబరు కూడా తనకి చక్కగా గుర్తుంది. బస్‌లు, టాక్సీలు, ఆటోలు, టెలిఫోన్‌ల నెంబర్లు తను ప్రతిదీ గుర్తుపెట్టుకుంటాడు. తన జ్ఞాపకశక్తి చాలా గొప్పదని స్నేహితులందరు చెప్పు కుంటారు.

మరయితే మార్గమధ్యంలో ఎక్కడయినా ఆయన బస్ దిగిపోయాడా? దిగిపోయే అవసరంగాని, దిగాల్సిన అగత్యంగాని యేముంటాయి?

అతని ప్రశ్నకు వెంటనే సమాధానం దొరికింది.

సామాన్లలో తండ్రి కళ్ళద్దాలున్నాయి!

శరత్ వాటిని చేతిలోకి తీసుకుని చూశాడు ఖచ్చితంగా అవి తండ్రి కళ్లద్దాలే!

అయితే....ఆయన ఖచ్చితంగా యీ బస్‌లోనే ప్రయాణం చేశాడు. కాని, మనిషి యేమయిపోయినట్టు....?

బ్రీఫ్ కూడా మాయమయిపోయింది. కారణమేమిటి....?

బంధువుల ఏడుపులు, మొత్తుకోళ్ళు హృదయవిదారకంగా వినిపిస్తున్నాయి. దాదాపు అన్ని శవాలు గుర్తింపబడ్డాయి. శవాలన్నీ గిద్దలూరుకి తరలింపబడ్డాయి. అధికారుల అనుమతితో శరత్ ఆ కళ్ళజోడును తీసుకున్నాడు.

తండ్రి శవంగా గాని, సజీవంగా గాని కనిపించటం

లేదన్న విషయం పోలీసులకి తెలియచేశాడు. లోయలో శవాలుగాని, శవం తాలూకు వస్తువులుగాని యేమీ లేవని నిర్ధారించి చెప్పారు. కళ్లద్దాలు తండ్రివేనని, ఆయన్ని తనే బస్ ఎక్కించానని చెప్పాడు శరత్.

ఎస్.ఆర్. తీసుకుని చూశాడు పోలీస్ ఇన్స్పెక్టర్. అందులో యెందరు యెక్కడ్నుంచి యెక్కడకు ప్రయాణిస్తున్నదీ వుంటుంది. ఒక్క టిక్కెట్ తేడా వచ్చింది.

శరత్ చెప్పిన విషయంతో ఆ టికెట్ తేడారావటం ఏకీభవించగానే ఇన్స్పెక్టర్ ఆలోచనలో పడ్డాడు. మరోసారి, చివరిసారిగా లోయలో గాలింపు జరిపించాడు. కాని జాదవ్ శరీరం దొరకలేదు.

ఇన్స్పెక్టర్, శరత్ భుజం తట్టి, "ఉయ్ ట్రైడ్ అవర్ లెవెల్ బెస్ట్! సారీ....ఆయన మధ్యలో ఎక్కడయినా దిగిపోయారేమో! లేక యే కారణంచేతనైనా ప్రయాణం మధ్యలో కేన్సిల్ చేసుకుని యింటికి తిరిగి వెళ్ళిపోయారేమో వెరిఫై చేసుకోండి! ఆయన గురించిన పూర్తి వివరాలు నోట్ చేసుకుంటాం, చెప్పండి. ఏమాత్రం ఆచూకీ తెలిసినా మీకు కబురు చేస్తాను" అన్నాడు.

శరత్ ఆయనకు వివరాలు చెప్పి, "నేను నిన్న ఉదయం పేపర్ చూడగానే బయల్దేర వచ్చేశాను. నాన్నగారు ప్రయాణం కేన్సిల్ చేసుకుని తిరిగివచ్చే పక్షంలో నాకు యింటి దగ్గరే ఎదురయ్యేవారు. మధ్యలో ఎక్కడయినా దిగిపోయి, బస్ కదిలిపోయి వుంటే తర్వాతి బస్‌లో హైద్రాబాద్ వెళ్ళి వుండేందుకు కూడా అవకాశముంది. ఆ విషయం నేను కన్ఫర్మ్ చేసుకుంటాను.

థాంక్స్ ఎ లాట్!" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ బెస్ట్ విషెస్ చెప్పాడు.

శరత్ ఆలోచిస్తూ నడవసాగాడు.

"మీ తండ్రిగారు యీ బస్‌లోనే ఏక్సిడెంట్‌కి గురయ్యారనుకుంటాను....!?" అన్న మాటలతో ఉలిక్కిపడి చూశాడు శరత్.

అతను శరత్ వంక జాలిగా, స్నేహపూర్వకంగా చూస్తున్నాడు. శరత్ తలెత్తి అతనివంక పరిశీలనగా చూసాడు. చనిపోయిన ప్రయాణీకుల బంధువులా వున్నాడు.

దాదాపు నలభై యేళ్ళుండవచ్చు. నల్లగా, లావుగా, ఎత్తుగా వున్నాడు. పాంటు, షర్టు వేసుకొని వున్నాడు. జుట్టు అక్కడక్కడ నెరిసింది. ముఖంమీద స్ఫోటకం మచ్చలున్నాయి. మీసం లేదు, దట్టమయిన కనుబొమలు యెదుటి మనిషిని తీక్ష్ణంగా గుచ్చి గుచ్చి పరీక్షిస్తున్నట్టు కళ్ళను కప్పేస్తున్నాయి.

శరత్ అతని ప్రశ్నకు అవునన్నట్టు తలూపి, "మీరెవరు?" అన్నాడు.

"నా పేరు జయకర్. ప్రొఫెసర్ జయకర్. మీ నాన్నగారి పేరు ప్రొఫెసర్ జాదవ్....అవునా?"

శరత్ కళ్ళు పెద్దవి చేసి చూశాడు. "అవునూ! మీకెలా తెలుసు?" అన్నాడు.

"జాదవ్, నేను ఎమ్మెస్సీలో క్లాస్‌మెట్స్."

"చాలా సంతోషం సార్! కాని, మా నాన్నగారి జాడ...."

"నాకు తెలుసు—ఆయన సురక్షితంగా వున్నారు."

శరత్ కి ఎగిరి గెంతెయ్యాలనిపించింది. ప్రొఫెసర్ జయకర్ ని కౌగలించుకోవా లన్నంత వెర్రి ఆనందం కలిగింది.

"నిజమా? ఎక్కడున్నారు ఆయన? మీకు కనిపించారా?" ఆత్రుతగా అడిగాడు శరత్.

"నాకు కనిపించటమే కాదు; ప్రస్తుతం మా లేబరేటరీలోనే వున్నారు."

"మీ లేబరేటరీనా, అదెక్కడ?"

"ఇక్కడికి దగ్గరే!"

"నన్నక్కడికి తీసుకువెళ్తారా?"

"అందుకే కదా, వచ్చాను!? మీ నాన్నగారు చెప్పి పంపారు, బస్ ఏక్సిడెంట్ విషయం తెల్సుకుని ఇక్కడికి నువ్వొస్తావని, ఖంగారుపడుతుంటావని, నీ గురించిన గుర్తులు చెప్పి పంపారు...."

శరత్ కి వెంటనే ఓ సందేహం తలెత్తింది. నాన్నగారు బస్ మధ్యలోనే ఎందుకు దిగిపోయినట్టు? హైద్రాబాద్ వెళ్ళేవక్తి మధ్యలో యీ లేబరేటరీ దగ్గర యెందుకు ఆగినట్టు? ఇద్దరు స్నేహితులు, క్లాస్ మెట్స్ కావటంవల్ల ఒకరితో మరొకరు చర్చించుకోవాలనే ఉద్దేశంతో ఆఖరి క్షణంలో ప్రోగ్రాం మార్చుకున్నారా?

అతనిలో చెలరేగుతున్న ఆలోచనల్ని గమనించినట్టుగా అన్నాడు జయకర్. "పద బాబూ, వెళ్దాం!"

"ఉండండి, మా నాన్నగారు క్షేమంగా వున్నారని పోలీస్ ఇన్స్పెక్టర్ కి చెప్పివస్తాను...."

"అక్కర్లేదు. చెప్పకపోయినంత మాత్రాన వచ్చిన నష్టంలేదు. మనం వెంటనే వెళ్ళాలి" జయకర్ అతని సమా

ధ్యానానికి యెదురుచూడకుండా ముందుకు నడవటంతో శరత్ కి అతన్ని అనుసరించక తప్పలేదు.

పోలీస్ ఇన్ స్పెక్టర్ తనవాళ్ళతో బిజీగా వున్నాడు. అతను గాని, అక్కడి మనుషులు గాని, అధికారులుగాని ఎవరూ శరత్ ని గమనించే స్థితిలో లేరు. ఎవరి పనుల్లో వాళ్ళున్నారు.

జయకర్ లోయకి దూరంగా ఘాట్ రోడ్ దిగువకు శరత్ ని తీసుకువెళ్ళాడు. శరత్ యీ అడవిలో లేబరేటరీ యేమిటా అని ఆశ్చర్యపోతుండగా దట్టంగా పెరిగిన యూకలిప్టస్ చెట్ల గుబురులోకి నడిచాడు జయకర్.

శరత్ కి యేదో అనుమానం సోకింది. ఆపదలో చిక్కుకోబోతూన్నట్టు సిక్స్త్ సెన్స్ చెప్తోంది. పక్కకు తిరిగి జయకర్ తో యేదో చెప్పబోయాడు. అప్పటికే ఆలస్యమయింది.

అతనిమీద ఒక్కసారిగా చుట్టుపక్కల నుంచి యెవరో వ్యక్తులు దాడిచేశారు. తియ్యటి వాసన ముక్కుపుటాలకు సోకింది. ఎవరో, తననేం చెయ్యబోతున్నారో గ్రహించే లోపల అతనికి స్పృహ తప్పిపోయింది. అచేతనంగా నేలమీదకు జారిపోయాడు శరత్.

## 3

"నా కొడుకునేం చేశారు దలచుకున్నావు? ఎందుకు మామీద యింత కక్ష నీకు?" కోపంగా అరిచాడు ప్రొఫెసర్ జాదవ్.

ఆయన వయసు ఏభై సంవత్సరాలుంటుంది. గడ్డం మీసాలు గుబురుగా పెరిగిపోయాయి. జుట్టు తైల సంస్కారం లేనట్టు చిందరవందరగా వుంది. అయితే

అతని ముఖంలో దివ్యతేజస్సు ఉట్టిపడుతోంది. కళ్ళలో తెలివితేటలు, చురుకుదనం, పట్టుదల ప్రతిఫలిస్తున్నాయి. నిశితంగా వున్న చూపు ఎదుటివ్యక్తిని ఎక్స్‌రే తీస్తున్నంత పదునుగా వుంది.

స్ఫోటక మచ్చల వ్యక్తి వికటంగా నవ్వాడు.

"మై డియర్ ప్రొఫెసర్! నీ పరిశోధనల ఫలితం కోసం ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తున్నాం. ఈరోజు దాన్ని ప్రభుత్వానికి అప్పగించేస్తానంటే చేతులు ముడుచుకూర్చుంటామనుకున్నారా? దానికి ఓ బ్రహ్మాండమైన ఆఫర్ సిద్ధంగా వుంది. కాని నువ్వు నీ ప్రాణాలైనా యిస్తానుగాని, దాన్నివ్వనంటున్నావు. అదెక్కడుందో చెప్పనంటున్నావ్....అందుకే నీ కొడుకును పట్టుకున్నాం....

వాడి కోసం అనవసరంగా కడప వెళ్ళాం. ఏక్సిడెంట్ స్పాట్‌కి వచ్చాడని మీ యింట్లోని నౌఖరు చెప్పాడు. వెంటనే మా వాడు యిక్కడికి ఫోన్ చేసి చెప్పాడు. నేను రంగంలోకి దిగి, నీ కోసం అలమటించిపోతున్న నీ కొడుకుని కనుక్కున్నాను. ఇన్‌స్పెక్టర్‌తో నీ జాడ తెల్సుకోమని చెపుతుంటే తేలిగ్గా గుర్తుపట్టేశాను.

ఇప్పుడయినా మించిపోయింది లేదు. నీ కొడుకు సజీవంగా వుండాలంటే ఆ ఫార్ములా ఎక్కడ దాచావో చెప్పెయ్యి. మాకు హేండోవర్ చేసిన మరుక్షణం మీ తండ్రీ కొడుకులిద్దర్నీ క్షేమంగా వదిలేస్తాను."

జాదవ్ ముఖంలో అవమానం. కోపం. ఉక్రోషం, నిస్సహాయత ఒకేసారి చోటుచేసుకున్నాయి.

"నేను ఇరవై ఎనిమిదేళ్ళుగా కృషిచేసి, పరిశోధించి

సాధించిన తపః ఫలిత మది! దాన్ని నీలాంటి స్వార్థపరుల చేతికి అందనిస్తానా? నెవ్వర్" జాదవ్ పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"ఆ మొండితనమే వద్దంటున్నాను జాదవ్! నేనెంత సమర్థుడినో నీకు తెలుసు. నిన్ను రక్షించుకోవటం కోసం బస్‌లోని ప్రయాణీకులందర్నీ లోయలో పడేసిన డ్రైవర్ కన్నా నువ్వు మొండివాడివి. నీకన్నా నేను జగమొండిని! నీ చేత నిజం ఎలా చెప్పించాలో, ఆ ఫార్ములాని ఎలా మా చేతికి తెచ్చుకోవాలో తెలియనంతటి అసమర్థుణ్ని కాను. అందుకే నీ కొడుకును పావుగా ఉపయోగించుకోవాలని ప్లాన్ చేశాను" జయకర్ మళ్ళీ నవ్వాడు.

జాదవ్ స్పృహ లేకుండా పడివున్న కొడుకు వంక చూశాడు. తనే చిక్కాడనుకుంటే తన కొడుకు కూడా యీ దుర్మార్గుడి చేతుల్లో చిక్కుకుపోయాడు.

జాదవ్ కళ్ళు చెమరించాయి ఆ క్రితం రోజు రాత్రి జరిగిన సంఘటన కళ్ళముందు మెదిలింది....

'బస్ ఘాట్ రోడ్ మీద పోతుండగా దాన్ని ఆపటానికి కొందరు దుండగులు ప్రయత్నించారు. దారిదోపిడి దొంగల భయమున్న ప్రాంతం కావటంతో డ్రైవర్ బస్‌ని స్లో చేసినట్టే చేసి, ఒక్కసారిగా ముందుకు వేగంగా దూకించాడు బస్‌ని.

దుండగులు చెదిరిపోయారు. అందులోని ఈ జయకర్ మరో అనుచరుడితో బస్ వెనక నుండే నిచ్చెన పట్టుకుని ఎగబ్రాకి గ్లాస్ విండోస్ ద్వారా లోపలికి ప్రవేశించారు. బస్‌లో వున్న పోలీస్ ఇన్‌స్పెక్టర్ రివాల్వర్ తీయబోయేంతలో అతన్ని జయకర్ దారుణంగా కాల్చేశాడు. డ్రైవర్‌తో బాటు బస్‌లోని ప్రయాణీకులంతా

బిగుసుకుపోయాయి.

జయకర్ బస్ ఆపమని డ్రైవర్ని గద్దించాడు. డ్రైవర్ ఏమాత్రం ఆపకుండా ముందుకే పోనిస్తున్నాడు. జయకర్ కోపంతో డ్రైవర్ని గురిచూసి కాల్చాడు. అంతే! డ్రైవర్ స్టీరింగ్ మీద వాలిపోయాడు. బస్ సరిగ్గా అప్పుడే టర్నింగ్ దగ్గర కొచ్చింది.

జయకర్, అతని అనుచరుడు తనని వాటేసుకుని, తన బ్రీఫ్తో సహా, డోర్లో నుంచి బయటికి లాఘవంగా దూకేశారు. బస్ ఒక్కసారిగా లోయలోకి జారి పోయింది. ప్రయాణీకుల హాహాకారాలు తను స్పష్టంగా విన్నాడు. ఆ హడావిడిలో తన కళ్ళద్దాలు బస్లోనే జారి పడిపోయాయి.

తనని జయకర్, అతని అనుచరుడు ఆ చీకట్లో అడవి లోకి లాక్కొచ్చి ఊరు తెలియని యీ భూగర్భంలో పారేశారు. తన బ్రీఫ్ కేస్లోను, దుస్తుల్లోను ఫార్ములా కోసం వెతికారు. దొరక్కపోగానే హింసించటం మొదలెట్టారు.

తను ఫార్ములా ఎక్కడ దాచిందీ వాళ్ళకు చెప్పక పోవటంతో శరత్ని వల పన్ని తీసుకొచ్చారు. రక్త సంబంధంతో కడుపుతీపితో తను నిజం చెప్పేస్తాడని, వాళ్ళు చెప్పినట్టు చేస్తాడని వాళ్ళ భ్రమ!

లోలోన నవ్వుకున్నాడు జాదవ్! ఈ ఫార్ములా కోసం ప్రపంచమంతా యెంతో ఆసక్తిగా యెదురు చూస్తున్నారని తనకు తెలుసు. తన పరిశోధన చాలా విలువైనది.

అణుబాంబు ప్రమాదం నుంచి, దాని విష ఫలితాల నుంచి భారతదేశాన్ని యెలా రక్షించుకోవచ్చునో పరిశో

ధించాడు తను. బాంబు పడిన ప్రదేశంలో ఆ బాంబు పేలకుండా నిరోధించగల రసాయాన్ని కనుగొన్నాడు. ఆ రసాయనం వెదజల్లే ఓ రకమైన గ్యాస్ వల్ల బాంబు పేలకుండా వాతావరణంలో ఓ రక్షక పొర యేర్పడుతుంది! అది ఆ ప్రాంతాన్ని సురక్షితం చేస్తుంది.

అందుకే తన పరిశోధన పట్ల ప్రపంచ దేశాలన్నీ యెంతో ఆసక్తిని కనపరిచాయి. తన పరిశోధన ఫలితానికి కోట్లలో కట్టలేనంత విలువున్నది! అందుకే జయకర్ ముఠా తనని వల పన్ని పట్టుకొన్నది! తన ప్రాణం పోయినా తను తన జీవితాన్ని కరిగించి కనుగొన్న యీ మహత్తరమైన పరిశోధనా ఫలితాన్ని దేశద్రోహుల చేతుల్లో పడనివ్వడు. దాన్ని చాలా భద్రంగా తను దాచుకున్నాడు. జయకర్ లాంటివాళ్ళు లక్షమంది ప్రయత్నించినా దాన్ని కనుగొనలేరు. ఆ విశ్వాసం తనకుంది.

జాదవ్ సంతృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు.

జయకర్ తన వాళ్ళవంక చూసి, "ఈ శరత్‌ని వేరే సెల్‌లో బంధించి వుంచండి. రేపు చూద్దాం వీడి సంగతి!"

స్పృహతప్పి వున్న శరత్‌ని చేతులమీద మోసుకుని వెళ్ళిపోయారు ఇద్దరు అనుచరులు.

జాదవ్ వంక కోరగా చూసి, "ప్రొఫెసర్! టుమారో ఈజ్ ది డెడ్ లైన్!" అన్నాడు జయకర్.

## 4

చటుక్కున మెలకువ వచ్చింది శరత్‌కి.

తనో చీకటి గదిలో నేలమీద పడున్నాడు. జయకర్ గుర్తొచ్చాడు. తను స్పృహతప్పిపోయిన వైనం

గుర్తొచ్చింది. ఎవరు వాళ్ళు? జయకర్ మనుషులేనా? ఆసలు జయకర్ సైంటిస్టేనా? తన తండ్రి బతికి వున్న మాట నిజమేనా? అయితే, ఎక్కడున్నాడు?

తన నిక్కడ యెవరు బంధించారు? తనని బంధించడం వల్ల యెవరికి ఉపయోగం? అసలది యే ప్రాంతం? ఘాట్ రోడ్ సమీపంలో వున్న ప్రదేశమేనా? లోపల యింత చీకటిగా వుందేమిటి? వెలుగు పైనుంచి సన్నగా పడుతోంది. రాత్రో, పగలో తెలియటం లేదు.

శరత్ తల విదిలించాడు యెదురుగా చిన్న బల్ల మీద మూతలు పెట్టివున్న భోజన పదార్థాలు కనిపించాయి. వాటిని చూడగానే శరత్ కి ఆకలి గుర్తొచ్చింది.

ఎప్పుడో తిన్న అన్నం. రెండురోజులయిందో. మూడు రోజులయిందో!? బహుశ జయకర్ గాని, అతని మనుషులు గాని తను స్పృహతప్పి వున్న సమయంలో వీటి నిక్కడ పెట్టేసి వుండాలి! ఆకలితో శోష వచ్చేలా వుంది. ఏదో కొంత కడుపులో పడితే నే గాని, ప్రాణం నిలిచేలా లేదు.

శరత్ ఆహారపదార్థాల్ని ముందుకు లాక్కొని చాలా ఆకలిగా తిన్నాడు. టైమెంతై వుంటుందన్న ఆలోచన వచ్చింది. వాచీ చూసుకొన్నాడు. పదకొండున్నర చూపిస్తోంది.

రాత్రా, పగలా? చుట్టూ చూశాడు. అది భూగర్భంలోని గదిగా అప్పుడు గుర్తించాడు.

భూగర్భంలో కట్టబడ్డ ఆ చీకటిగదుల్లో నివసిస్తున్న వ్యక్తులు యెలాంటివారై వుంటారో అతనికి గ్రహించేందుకు అరనిమిషం పట్టలేదు.

తను వెంటనే యిక్కడి నుంచి తప్పించుకోవాలి. ఏదో ఫలితాన్నాశించే వీళ్ళు తనని బంధించి వుంటారు. ఇప్పటిదాకా తనని ప్రాణాలతో వుంచారు కాబట్టి తనని యేదో విద్రోహ కార్యానికి ఉపయోగించుకోవాలనే ఉద్దేశం వుందన్నమాట! అది నెరవేరకుండా చెయ్యాలి.

శరత్ తను బంధింపబడ్డ ఆ చీకటిగదిని పరీక్షగా చూశాడు. అప్పటికి అతని కళ్ళు చీకటికి అలవాటు పడ్డాయి. అన్ని వస్తువులు పగటి వెలుగులోలాగానే స్పష్టంగా కనిపిస్తున్నాయి. అది చాలా యిరుకు గది. ఓ బల్ల తప్పితే అందులో వేరే వస్తువులేం లేవు. ఓ చెక్క తలుపు మాత్రం బయటవైపు నుంచి బంధింపబడి వున్నది.

లాగి చూశాడు శరత్. బయట గొళ్ళెం పెట్టబడి వుంది.

కీ హోల్ అంత బెజ్జం వుంది తలుపులో. దాన్నుంచి బయటకు చూశాడు.

బయట హాలులాగా నడవా వున్నది. అక్కడ వో కొవ్వొత్తి వెలుగుతోంది. అంటే లోపల కరెంటు లేదన్నమాట! ఇంత సొరంగం సృష్టించుకుని, జనరేటర్ ఎందుకు ఏర్పాటు చేసుకోలేదో వీళ్ళు? జనరేటర్ శబ్దం బయటికి వినిపించి తమ ఉనికిని బయటపెడుతుందనే ఉద్దేశంతో కావచ్చు!

శరత్ నిశితంగా హాలుని పరికించి చూశాడు.

దూరంగా యిద్దరు వ్యక్తులు కూచుని కునికిపాట్లు పడుతున్నారు, తప్పితే యింకెవరూ కనిపించలేదు. హాలుకి చేర్చి అటు, యిటు తనని బంధించిన గదుల్లాటివే మూడు, నాలుగు గదులు కనిపించాయతనికి. బహుశా

వాటిలో కూడా తనలాంటి వాళ్ళనిగాని బంధించారా?

శరత్ ఇంజనీరింగ్ బ్రెయిన్ చాలా పదునుగా చురుగ్గా పనిచేస్తోంది. జేబులోనించి కీబంచ్ తీశాడు. తండ్రి ప్రయోగశాలకు, బీరువాకు ముఖ్యమైన గదులకు సంబంధించిన తాళాలు అవి. వాటిలోనించి చిన్న నైఫ్ విడిగా తీసి పట్టుకున్నాడు. తలుపు బెజ్జంనించి బయటికి జొనిపాడు. గొళ్ళెంగాని, గడియగాని తగల్లేదు. అంటే బెజ్జం సమీపంలో తాళంలేదన్నమాట.

ఈసారి తలుపు బార్డర్ చుట్టూ నైఫ్‌తో గీతలా గీస్తూ వెళ్ళాడు. తలుపు పైభాగంలో నైఫ్‌కి అడ్డుకి వచ్చింది.

శరత్ ఒక్కక్షణం ఆగి ఊపిరి పీల్చుకున్నాడు.

అక్కడ గొళ్ళెమో, గడియో వుండి వుండాలి!

మెల్లిగా ఒత్తాడు! టిక్‌మన్న చప్పుడుతో చెక్క గడియపక్కకి తప్పుకున్నది. తలుపు తెరుచుకున్నది. ఓసారి అటు యిటు నడవాలోకి చూశాడు.

పిల్లిలా అడుగులు వేసుకుంటూ నడవాలో మెల్లిగా నడుస్తున్నాడు. బయటికిపోయేదారి కోసం వెయ్యి కళ్ళతో వెతుకుతున్నాడు. దూరంగా, కాపలావాళ్ళిద్దరు కూచున్న స్థలానికి దగ్గరగా, ఓ చిన్న తలుపు కనిపిస్తోంది. చెక్కతలుపు కాదు, రాతిపలకలా వున్నది. బహుశా సొరంగమార్గాన్ని మూస్తున్న పలక అయివుండాలి! అక్కడకు చేరాలంటే వాళ్ళిద్దర్ని దాటుకొని వెళ్ళాలి.

ఎలా? వాళ్ళు ఏమాత్రం మేల్కొన్నా ప్రమాదం! ప్రాణం తీయటానికి వెనకాడరు. శాశ్వతంగా యీ భూగృహంలో తను సమాధి అయిపోతాడు.

శరత్ చాలా వేగంగా ఆలోచిస్తున్నాడు. అది తప్ప మరో మార్గమేదైనా వుందేమోనని పరిసరాల్ని ఎక్స్‌రే

కళ్ళతో పరిశోధించాడు. వేరే దారిలేదు!

ఊపిరి బిగబట్టి మెల్లిగా అటు నడిచాడు. కావలి వాళ్ళిద్దరు గుర్రుపెడుతున్నారు. అటు యిటు వున్నగదుల్లో ఏమున్నారో చూడాలన్న ఆసక్తిని బలవంతాన అదిమి పట్టి బిలద్వారం వైపు నడిచాడు.

కావలివాళ్ళు ఆ మగతనిద్రలోనే కదిలారు.

శరత్ చటుక్కున సొరంగ గోడలకి బల్లిలా కరచుకొని నిల్చుండిపోయాడు కొద్ది క్షణాలసేపు. తర్వాత వాళ్ళు కళ్ళు తెరవలేదన్న విషయం కన్ఫర్మ్ చేసుకొని రాతి పలకని సమీపించాడు.

రాతిపలక కరకరమని శబ్దం చేస్తూ తెరచుకొంది. సరిగ్గా అదే సమయానికి కావలివాళ్ళిద్దరు త్రుళ్ళిపడి లేచారు.

శరత్ ఒక్క అంగలో బయటకి ఉరికాడు.

కావలివాళ్ళ నిద్రమత్తు వదిలిపోయింది. పక్కనే పెట్టుకున్న తుపాకులు చేతపట్టుకున్నారు. బిలమార్గం వైపు ఉరికారు.

అప్పటికే శరత్ బయటకొచ్చేశాడు. చుట్టూ దట్టమైన, చెట్లు, గుట్టలు. అదంతా అడవిప్రాంతమని శరత్ కరవాయిపోయింది. ఘాట్ రోడ్ పక్కనుంచి యూకలిప్టస్ చెట్లమధ్యను తనని జయకర్ నడిపించుకురావటం గుర్తొచ్చింది. అయితే యీ అడవిలోనే రహస్యంగా సొరంగం తవ్వి, భూగర్భంలో నివాసముంటున్నాడన్న మాట జయకర్!

తను క్షేమంగా తప్పించుకుపోతే యీ నిజాన్ని పోలీసులకి తెలియచేయాలి. ఈ దొంగ సైంటిస్ట్ ఆ భూగృహంలో ఎలాంటి సంఘ విద్రోహ కార్యాలు

నడుపుతున్నాడో వెలుగులోకి తేవాలి. పరుగెడుతూనే ఆలోచిస్తున్నాడు.

శరత్ తన వెనుక ఎవరో పరుగెత్తుకువస్తున్నట్టు గుర్తించాడు. త్రుళ్ళిపడి వెనక్కు చూశాడు. ఎవరో ఇద్దరు పరుగెత్తుకువస్తున్న జాడ పొడగట్టింది. ఒక్కసారిగా పరుగు వేగం పెంచాడు.

వెనకనుంచి వాళ్ళు బాగా దగ్గరైనట్టు ఆ చీకట్లోనే గుర్తించాడు. సరిగ్గా అప్పుడే వెనకనుంచి రెండు తుపాకీ గుళ్ళు సర్ సర్ మంటూ శరత్ పక్కనుంచి దూసుకుపోయాయి. కాస్తలో ప్రమాదం తప్పింది.

ఆ అడవిలో తనకి దారితెన్ను తెలియదు. అయినా పిచ్చివాడిలా ప్రాణంకోసం పరుగెడుతూనే వున్నాడు, శరత్. వాళ్ళు మళ్ళీ తుపాకీలతో కాల్చేలోపల వారి కందకుండా దిశమార్చి పరుగెత్తసాగాడు.

మరోసారి తుపాకీలు గర్జించాయి.

చెట్లమీద విశ్రాంతిగా నిద్రిస్తున్న పక్షులు ఒక్కసారిగా అదిరిపడిలేచి గోలగా అరిచాయి. ఆ నిశ్శబ్ద నిర్జనారణ్యంలో వాటి అరుపులు చాలాసేపు ప్రతిధ్వనించాయి.

శరత్ మరోసారి తుపాకీ గుళ్లనుంచి లాఘవంగా తప్పించుకున్నాడు. ఈ ఖంగారులో ఘాట్ రోడ్ ఎటువున్నదో తను ఎటునుంచి ఎటు పరుగెత్తుతున్నాడో అతనికేమాత్రం అర్థంకావడంలేదు. అయినా పరుగెడుతున్నాడు.

కాళ్లకు కత్తుల్లాంటిరాళ్లు గుచ్చుకొంటున్నా వాడిముళ్ళు నాటుకొంటున్నా, రక్తం చిందుతున్నా, అతనేం లెక్క చేయడంలేదు.

అయితే వెనుకనుంచి ఒకేసారి హాహాకారాలు వినిపించి

చటుక్కున వెనుతిరిగి చూశాడు. అంతవరకు తనని వెన్నంటి వస్తూన్న వ్యక్తులు కనిపించలేదు. కాని వాళ్ళు వేసిన చావుకేకలు మాత్రం చెవుల్లో గింగురుమంటు న్నాయి.

శరత్‌కి చాలా ఆశ్చర్యంగావుంది. వాళ్ళేమయ్యారు? ఎందుకలా వెర్రికేకలు వేశారు? ఏదైనా పురుగు ముట్టిందా, లేక క్రూరమృగాలేమైనా వేటాడాయా? తనకి క్రూరమృగాల గర్జనలేవీ వినిపించలేదే....!? అయినా యీ అడవిలో క్రూరమృగాలసలున్నాయా? ఏమో.... తనకీ ప్రదేశం పూర్తిగా కొత్త. ముఖ్యంగా అడవిలో సంచరించటం జీవితంలో మొదటిసారి.

ఏ పక్కన యేముందో, ముందు నుయ్యేవుందో, గొయ్యేవుందో తెలీని అయోమయావస్థలో ప్రాణం కాపాడుకోవటానికి తనుపడ్డ ఆరాటం అతన్ని ఊపిరి తీసుకోనివ్వలేదంతవరకు. వెనుక తరుముతున్న మనుషులు కనిపించకుండా పోయాక కాసేపు నిలిచి ఊపిరి తీసుకున్నాడు.

అంతదాకా తన శరీరానికి గాయాలయి, నెత్తురు స్రవిస్తున్న విషయాన్ని కూడా అతను విస్మరించాడు. కాస్త తెరిపిన పడగానే శరీరం పడుతున్న బాధ మనసుకి తాకింది. ఒక్కసారిగా సర్వశక్తులు హరించిపోయినట్టు డీలాపడిపోయాడు శరత్.

రేడియండయల్ రిస్టువాచీ రాత్రి మూడు గంటలయి నట్టు గుర్తు చేస్తోంది. ఆ రాత్రి సమయంలో నిర్జనంగా వున్న ఆ అడవిలో దిక్కుతోచని స్థితిలో, భయాన్ని మరిచిపోయి అలా చాలాసేపు నిల్చుండిపోయాడు శరత్.

సరిగ్గా అప్పుడే అతని కుడిపక్కనుంచి ఎండుటాకుల

మీద ఏదో జంతువు సమీపిస్తున్న సవ్వడి వినిపించింది.

శరత్ ఎలర్టుగా విన్నాడు. మనుషులో, జంతువులో తెలియదుగాని, సవ్వడి అతి దగ్గరలో వినిపిస్తోంది. అంత దాకా గందరగోళంగావున్న ఆ అడవిలో ఒక్కసారిగా యేదో తెలియని నిశ్శబ్దం అలముకొన్నది.

శరత్ గుండె అతివేగంగా కొట్టుకొంటోంది. స్థాణువులా కదలక మెదలక అలాగే నిల్చుండిపోయి ఆపదలను ఆహ్వానించటానికి సన్నద్ధుడయినట్టుగా చప్పుడు వినిపిస్తున్న వైపే కళ్ళు చిట్లించి చూస్తున్నాడు.

# 5

తుపాకీగుళ్ల శబ్దానికి నిద్రనుంచి చటుక్కున మేల్కొంచి కూచున్నాడు జయకర్. అంతక్రితమే అతనికి నిద్రపట్టింది. అయితే అతనిది కోడి కునుకు. ఏమాత్రం సవ్వడి వినిపించినా చటుక్కున మెలకువ వచ్చేస్తుంది.

మంచంలో కూచుని కొద్ది క్షణాలవరకు మత్తునుంచి తేరుకోలేదు. అతనిమీద కాళ్ళు చేతులు పెనవేసి పడుకొనివున్న నగ్నసుందరిని పక్కకు తప్పించి, లేచి నైట్ గౌన్ వేసుకొన్నాడు. తలుపు తెరుచుకొని నడవాలోకి వచ్చాడు.

కొవ్వొత్తి కుడ్డి వెలుగులో సెంట్రీలిద్దరు లేకపోవటం, బిలద్వారం పక్కకి తొలగించి వుండటం గుర్తించాడు. అతని గుండె ఝల్లుమన్నది!

ఎన్నడూ లేనిది, యీ సమయంలో బిలద్వారం ఎవరు తెరిచివుంటారు? సెంట్రీలేమయ్యారు? ఒక్కసారిగా సెంట్రీలు కూర్చుండే స్థలంవైపు పరుగెత్తాడు జయకర్. అక్కడెవరూ లేరు. వెనుతిరిగి ప్రొఫెసర్ జాదవ్ ని బంధించిన సెల్ దగ్గర కొచ్చాడు.

సెల్ లోపల నేలమీద చతికిలపడి, నిద్రపోకుండా యేదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు—ప్రొఫెసర్ జాదవ్.

జయకర్ దృష్టి శరత్‌ని బంధించిన సెల్ మీదపడింది! తలుపులు బార్లా తెరిచివున్నాయి. ఒక్క ఉదుటున సెల్ దగ్గరకు పరుగెత్తాడు. లోపల శరత్ లేడు!

జయకర్‌కి పరిస్థితి అర్థమైపోయింది. శత్రువు తప్పించుకు పారిపోయాడు. సెంట్రీల కళ్లల్లో కూడా దుమ్ము కొట్టి ఎలా పారిపోయాడు? వాడ్ని పట్టుకొని జాదవ్ ముందు పెడితే నేగాని, జాదవ్ లొంగిరాడు.

జయకర్ కొద్దిక్షణాలు కర్తవ్య విమూఢుడిలా నిల్చుండిపోయాడు. ఆ వెంటనే గదిలోకి పరుగెత్తి రివాల్వర్ టార్చిలైటు తీసుకొన్నాడు. కొన్ని బుల్లెట్స్ని సెట్‌గాన్ జేబులో వేసుకొన్నాడు. తనగదికి చేర్చివున్న గదిలో నిద్రపోతున్న మరో ఇద్దరు అనుచరుల్ని తట్టి లేపాడు.

వాళ్ళు తుళ్ళిపడుతూ లేచి కూచున్నారు. వాళ్ళని తనతో రమ్మని చెప్పాడు. వాళ్ళు చెరో తుపాకీ అందుకొన్నారు. జయకర్ వాళ్లతో బిలం బయటకొచ్చాక బిల ద్వారం మూసెయ్యమని అనుచరుల నాదేశించాడు.

టార్చి ఫోకస్ చేశాడు. శక్తివంతమైన టార్చి వెలుగు చాలా మారం స్పష్టంగా ప్రసరిస్తోంది.

ఒక్కక్షణం ఆలోచనలోపడ్డాడు—శరత్ సెంట్రీలు యే డైరెక్షన్ లో వెళ్ళివుంటారా, అని! ముగ్గురు మూడు వైపుల వెతకటం మంచిదని నిర్ణయించుకుని, "మీ ఇద్దరు చెరోపక్క వెతకండి. నేను సరాసరి ముందుకు వెళ్తాను. హారియప్, వాడు తప్పించుకుపోవటానికి ఏమాత్రం అవకాశమివ్వకూడదు." అన్నాడు జయకర్.

అనుచరులిద్దరు చెరోవైపు వేటకుక్కల్లా పరుగులు పెట్టారు. జయకర్ ముందుకు సూటిగా దూసుకుపోయాడు. పరిచితమయిన అడవిలో సునాయాసంగా వెళుక్కుంటూ పరుగెడుతున్నాడు.

# 6

కొద్దిక్షణాలు టెన్షన్‌తో, అదిరే గుండెతో అలాగే కదలక మెదలక నిల్చున్నాడు శరత్.

పక్కనుంచి యేదో గబ్బువాసన! వింతగా వున్నదా వాసన—గతంలో ఎక్కడో అల్లాంటి వాసన తన అనుభవంలోకి వచ్చింది. అదేమిటి? గుర్తుకు తెచ్చుకోవాలన్నా గుర్తురావటంలేదు. మనసు మొద్దుబారిపోయింది. యేదో ప్రమాదం ముంచుకువస్తున్నట్టు తన సిక్స్త్ సెన్స్ చెపుతోంది.

ఎండుటాకుల మీద ఆ మృగం నడచి వస్తున్నదనటానికి సూచనగా శబ్దమవుతోంది.

తన చేతిలో ఆయుధంగాని, మరే విధమైన రక్షణ సాధనంగాని లేవు అది పెద్దపులో, సింహమో, అలాంటి మరో క్రూరజంతువో తెలియదు. కొన్ని అడవుల్లో అంతు తెలియని క్రూరమృగాలుంటాయని తను చదివాడు. ఆ మధ్య పేపర్లలో కూడా చూశాడు. ఆఫ్రికా అడవుల్లో అయితే, కొన్ని పేరు తెలియని వింత క్రూరమృగాలు కూడా వున్నాయని చదివాడు.

ఇది ఓ మాదిరిగా పెద్ద అడవే! ఇప్పుడు తను నిల్చున్న ప్రదేశం చాలా దట్టమైన చెట్లతో అలముకునివుంది. అసలే రాత్రి సమయం, దిక్కు దరీ తోచని ప్రదేశం!

శరత్ ఊపిరి తీసుకోవటం మరచిపోయినట్టు కదలకుండా శిలా విగ్రహంలా నిల్చుండిపోయాడు. కొన్ని

రకాల క్రూరమృగాలు చనిపోయిన జంతువులను తినవు. ముఖ్యంగా సింహం! తను ప్రాణం లేకుండా చిక్కుకుపోతే కొంత రక్షణ దొరికినట్టే! ప్రాథమిక సూత్రాన్ని అమల్లో పెట్టాడు.

అయితే ఊహించని విధంగా ఆ మృగం గాల్లో ఎగిరింది. దాని ఉద్దేశం శరత్ మీద దూకి చంపాలని! అయితే జరిగింది వేరొకటి.

సరిగ్గా శరత్ కి రెండడుగుల దూరంలో నేలమీద వేటగాళ్ళు పెట్టిన మాటువుంది. సూటిగా ఆ గొయ్యిలో పడిపోయిందా మృగం. పడిపోతూ పెద్దగా గాండ్రించింది.

దాని గాండ్రింపు శరత్ గుండెల్లో నేకాక ఆ అడవి లోనే కొద్దిసేపటివరకు మార్మోగింది.

శరత్ కి ముచ్చెమటలు పోశాయి. అది పెద్దపులి!

ఎంతలో ఎంత పెద్ద ప్రమాదం తప్పింది!

గోతిలో పడిపోయిన పెద్దపులి గాండ్రిస్తోంది భయంకరంగా. నిస్సహాయంగా, ఉక్రోషంగా సుహోద్రేకంగా గోతిలో అటూ యిటూ పరుగెడుతూ గాండ్రిస్తోంది.

శరత్ గుండెల నిండా గాలి పీల్చుకున్నాడు. తను అదృష్టవశాత్తూ పరుగెత్తటం ఆపి వుండకపోతే, తను ఆ గోతిలో పులిస్థానంలో పడివుండేవాడు. తన బదులు తనని భక్షించాలని వచ్చిన పులి పడింది.

శరత్ కి తనని వెంబడించిన సెంట్రీలు ఎందుకు కనపడలేదో, వాళ్ళెందుకు ఆర్తనాదాలు చేశారో వెంటనే స్ఫురించింది. ఇలాంటి మాటు గోతుల్లో ఓ దానిలో వాళ్ళు పడిపోయి వుంటారు.

తను అడ్డదిడ్డంగా తుపాకీ గుళ్ళు కందకూడదని, అటు యిటు దిశలు మారుస్తూ పరుగెత్తాడు. అదృష్టవశాత్తు తను ఆ గోతికి దూరంగా పరుగెత్తి వచ్చేశాడన్న మాట! కాని, సెంట్రీలు మాత్రం హడావిడిలో చూసుకోకుండా గోతిలో పడిపోయారు.

శరత్‌కి అంత విపత్కర పరిస్థితిలోను నవ్వొచ్చింది. మనసారా నవ్వుకున్నాడు. తనకి హాని చెయ్యాలనుకున్న క్రూర మృగం, క్రూర మృగాల కన్న క్రూరులైన మనుషులు, మనుషులు తీసిన గోతుల్లో పడిపోయారు.

రేపు ఉదయం వేటగాళ్ళు వచ్చేవరకు సెంట్రీలు బతికుంటే, అదృష్టవంతులే! లేకుంటే ఉదయానికి వాళ్ళ శవాలు మిగులాయి. ఈ లోపల మరో క్రూర జంతువు గాని గోతిలో పడితే, హాయిగా దానికి ఆహారమయి పోతారు.

శరత్ గుండె అది తల్చుకోగానే ఝల్లుమన్నది. అసలు యీ అడవిలో యింకా యిలాంటి మాట్లు ఎన్ని తవ్వి పెట్టారో! ఆ వేటగాళ్ళు వల పన్ని వెళ్ళిపోయారో, లేక ఆ పరిసరాల్లోనే యే చెట్లమీదనైనా పొంచి వున్నారో....!? తను యెటు కదలాలన్నా సంకోచంగానే వుంది. తన చుట్టూ యిలాంటి మాట్లు వుండే వుంటాయి.

పెద్ద పులుల్ని, ఏనుగుల్ని పట్టుకోవటానికి అటవికులు గాని, అటవీశాఖ నియమించిన వేటగాళ్ళు గాని యిలా మాట్లు పన్ని పట్టుకుంటారు. అటవీశాఖ పులులవల్ల ప్రజలకి ముప్పు వాటిల్లిన సందర్భాలలోనే యిలా వేటగాళ్ళని నియమించి ఆ పులిని పట్టిస్తుంది! మామూలు పరిస్థితుల్లో అయితే, వన్యమృగాల వేటకు అనుమతించదు.

ఓ పక్క వన్య ప్రాణులు అరుదయి తరిగిపోతున్న దృష్ట్యా అడవుల్లో వేటని నిషేధించారు. డిపార్టుమెంటుకి తెలియకుండా అడవిలో ప్రవేశించటం కూడా నేరమే!

అయితే, ఈ మాట్లు యెవరు ఆరేంజి చేశారు? యెవరో స్వార్థపరులైన ప్రయివేటు వ్యక్తులే అయి వుండాలి!

శరత్ యిలా ఆలోచిస్తూండగానే దూరంగా ఎక్కడి నుంచో సన్నటి వెలుతురు కనిపించింది. ఉలిక్కిపడి చూశాడు ఆ వైపు.

టార్చి వెలుతురు! సరిగ్గా తను నిల్చున్న వైపే ఎవరో టార్చితో వస్తున్నారు. ఎవరు? తను పారిపోయిన సంగతి యీ పాటికి జయకర్ గుర్తించాడా? ఇంకా సిబ్బందితో తనని పట్టుకోవటానికి వస్తున్నాడా? లేక మాట్లు పెట్టిన వేటగాళ్ళు గాని వస్తున్నారా?

ఎవరైనా, తనకి ప్రమాదమే! నిర్దాక్షిణ్యంగా తన ప్రాణాలు తీసేస్తారు. ఓ ప్రమాదం తప్పిందంటే మరో ప్రమాదం వెతుక్కుంటూ వస్తోంది. తప్పించుకునే దారి కోసం అటు యిటు వెతుకుతున్నాడు కళ్ళతోనే!

అప్పుడు తెల్లవారుఝామున నాలుగు గంటలయింది.

అతని ఎడమపక్కన యేదో పాడుపడిన దేవాలయం లాంటి కట్టడం కనిపించింది. లోపల సన్నటి వెలుతురు కూడా వుంది. ఏదో దీపంలా కనిపిస్తోంది.

శరత్ యేమాత్రం ఆలస్యం చెయ్యకుండా ఆ కట్టడంవైపు బాణంలా దూసుకుపోయాడు. తను తల దాచుకోవటానికి ప్రస్తుతం యేదొక మరుగు ప్రదేశం

కావాలి. లేకుంటే ఆ జయకర్ చేతికి చిక్కిపోవాల్సి వస్తుంది ఆ తర్వాత తన ప్రాణాలమీద ఆశ వదిలేసు కోక తప్పదు.

శరత్ పది నిమిషాల్లో ఆ కట్టడాన్ని చేరుకున్నాడు. అది పాడుపడ్డ దేవాలయం కాదు. పూజా పునస్కారాలు జరుగుతున్న చిన్న గుడి! లోపల చమురు పోసిన రాతి దిమ్మెల్లో దీపం వెలుగుతోంది.

విగ్రహాం కాళ్ళవైపు వున్నది దీపం.

విగ్రహాం దాదాపు ఏడడుగుల ఎత్తున్నది.

శరత్ లోపలకు ప్రవేశిస్తూనే విగ్రహాంవైపు దృష్టి సారించి చూసి, అదిరిపడ్డాడు.

ఏడడుగుల విగ్రహాం యేదో కొండదేవతదిలా వున్నది. నాలుక చాచుకుని భయంకరాకృతిలో చూసేవాళ్ళ గుండెల అదరగొట్టేలా వుంది. నఖశిఖ పర్యంతం సిందూరంతో పూయబడి రక్తవర్ణంలో ఒళ్ళు గగుర్పొడిచేలా కనిపిస్తోంది.

విగ్రహాం మెడలో యేవో కాయలు, తీగెలు కలిపి అల్లిన దండ వేలాడుతోంది. విగ్రహాం కాళ్ళవైపు పాడవాటి వేటకత్తి ఆ గుడి వెలుగులో కూడా మెరుస్తోంది. ఓ రాతి పాత్రలో ఎర్రగా జిగటగా వున్న ద్రవమేదో వున్నది. అది అప్పుడే నలుపు వర్ణానికి తిరుగుతున్నట్టు గ్రహించాడు శరత్.

గుహాలాంటి ఆ గుడిలోపల యేదో మెత్తకవాసన, ముక్కుకు యింపుగా లేని యేదో వాసన వేస్తోంది. శరత్ యెమాత్రం ఆలోచించకుండా విగ్రహాం వెనుకవైపుకి వెళ్ళాడు.

అక్కడ ఓ స్త్రీ, ఓ పురుషుడు పడుకొని వున్నారు.

శరత్‌ని చూడగానే వాళ్ళు ఒక్కసారిగా లేచి అతని మీదికి లంఘించి ఒడిసిపట్టుకున్నారు.

కవ్వుమనబోయిన కేకను గొంతులోనే అణిమిపెట్టుకుని వాళ్ళ వంక విచిత్రంగా, భయంగా చూస్తూ వుండిపోయాడు శరత్.

## 7

ఓ అరగంట తర్వాత ముగ్గురు ఒకేచోట కలిశారు.

"కనిపించాడా?" అనడిగాడు జయకర్.

అనుచరులిద్దరు లేదన్నట్టు తలలు అడ్డంగా ఆడించారు.

జయకర్ కోపంతో ఊగిపోయా.

"అఫ్ట్రాల్ ఓ కుర్రకుంక మనకి బురిడీ కొట్టించి పారిపోవటమా? యేరీ, జాన్, జాఫ్రీ కనిపించారా?" అడిగాడు అనుచరుల్ని.

జాన్, జాఫ్రీ శరత్‌ని వెంబడించిన సెంట్రీలు. వాళ్ళు యేదో చెప్పేలోపల పక్కనుంచి సెంట్రీల గొంతులు వినిపించాయి.

"మే మిక్కడున్నాం!" అంటూ ఎలుగెత్తి అరుస్తున్నారు.

జయకర్ తక్కిన యిద్దరు అనుచరులు ఉలిక్కిపడి చుట్టూ చూశారు. జాన్, జాఫ్రీ యెక్కడా కనిపించలేదు. కాని, వాళ్ళ గొంతులు గుర్తు పట్టాడు జయకర్.

"వాళ్ళిక్కడే యెక్కడ్నుంచో అరుస్తున్నారు? నూతిలోంచి అరుస్తున్నట్టు...." అనబోతూ చటుక్కున అడవిలో వేటగాళ్ళు పన్నే మాట్లు గురించి గుర్తుకొచ్చి "జాగ్రత్త! దగ్గర్లో మాటున్నట్టుంది. మీరూ గోతిలో పడతారు. జాన్, జాఫ్రీ పడ్డట్టుంది...." అన్నాడు జయకర్.

అడుగులో అడుగు వేసుకుంటూ ముగ్గురూ జాన్, జాఫ్రీ పడిపోయిన గోతి దగ్గరకు వెళ్ళారు, వాళ్ళ కేకల ఆధారంతో.

జయకర్ టార్చి వెలుగులో వాళ్ళని చూసి, "ఇదేమిరా? ఆ కుర్రా డేడి? మీ రిందులో ఎలాపడ్డారు?" అనడిగాడు.

"ముందు మమ్మల్ని పైకి లాగండి. చెప్తాను"అన్నారు. జాఫ్రీ-జాన్ సన్నగా మూలుగుతున్నాడు.

"ఏమయింది జాన్?" అడిగాడు జయకర్.

"కాలి ఎముక విరిగినట్టుంది" అన్నాడు జాఫ్రీ. జాన్ అవునన్నట్టు నీరసంగా తలూపాడు.

"నాకు మణికట్టు దగ్గర బలంగా గాయమయింది. విరిగిందేమో ననుకొంటున్నాను" అన్నాడు జాఫ్రీ. అతను మొండివాడు. జాన్ కన్న బలవంతుడు, ధైర్యవంతుడు.

జయకర్, అనుచరులు తీగలతో తాడు అల్లి గోతి లోకి వదిలారు జాన్, జాఫ్రీ అతి కష్టమ్మీద పైకి వచ్చారు—జాన్ కదల్లేక పోతున్నాడు. జాఫ్రీ ఎడమ చేతి మణికట్టు లావుగా వాచిపోయింది. అది దాదాపు ముప్పై అడుగుల గొయ్యి. ఆ ధాటున పడిపోవటంవల్ల ఒకరిమీద మరొకరు అస్తవ్యస్తంగా పడిపోయారు. వాళ్ళ చేతుల్లోని తుపాకులే వాళ్ళమీద అదనపు భారాన్ని పడేశాయి.

అనుచరు లిద్దరు జాన్ని భుజాలమీద మోసుకుంటూ వస్తే, జయకర్ జాఫ్రీని మెల్లిగా నడిపించుకుంటూ తమ స్థావరం చేరుకున్నారు.

"వీళ్ళిద్దరి సంగతి నేను, వమీమా చూసుకుంటాం. మీ రిద్దరు వెళ్ళి ఆ కుర్రాడ్ని యెలాగైనా సరే వెతికి

పట్టండి. కాసేపట్లో యెలాగూ తెల్లారిపోతుంది. వాడు దొరక్క తప్పదు. నా టార్చ్ పట్టుకెళ్ళండి" అంటూ అనుచరుల్ని వాళ్ళి అడవిలోకి తరిమేశాడు జయకర్.

ఈలోపల అతని ప్రియురాలు షమీమా లేచి అక్కడి కొచ్చింది.

వాళ్ళ మాటలు ప్రొఫెసర్ జాదవ్ స్పష్టంగా విన్నాడు. అతనికి పరిస్థితి చూచాయగా అర్థమయి పోయింది. శరత్ తప్పించుకుపోయాడా? తనకి తెలిసి వేరే ఖైదీలెవరూ ఇక్కడ బందీలుగా లేరు. వీళ్ళు మాట్లాడుకొంటున్నది శరత్ గురించే అయివుంటుంది. అదే జరిగితే, తను భయపడాల్సిన పనిలేదు. శరత్ క్షేమంగా దాటిపోతే అంతే చాలు!

జాదవ్ వంటి సైంటిస్టు కూడా ఆ సమయంలో కని పించని దైవానికి మనసులోనే మొక్కుకున్నాడు. తను కూడా అవకాశం దొరికితే యిక్కడ్నుంచి పారిపోవాలి! తన అమూల్యమైన పరిశోధనా ఫలితాన్ని యీ దుర్మార్గుడికి, దేశద్రోహికి దొరకనివ్వడు తను. తన ప్రాణం పోయినా దాన్ని వీళ్ళకి చిక్కనివ్వడు.

జాదవ్ ఛాతీ ఉప్పొంగింది, దేశభక్తితో.

అంతదాకా రాని నిద్ర అతనికి ముంచుకొచ్చింది.

## 8

"ఎవరు మాట్లాడుతున్నది?" అన్నది శశిరేఖ ఉత్సాహంగా.

"నేనమ్మా, రామయ్యను! ..." అన్నాడు నౌఖరు మెల్లిగా.

"శరత్ వున్నాడా, అక్కడ?" హుందాగా అడిగింది.

"లేదమ్మా, తమకు తెలీదా అమ్మా, పెద్దయ్యగారు వస్తున్న బస్ అక్కడెక్కడో తిరగబడిపోయిందట గదమ్మా!?"

"వాట్? ఆ తిరగబడిపోయిన బస్‌లో అంకుల్ వున్నారా? వాటే క్రేజడీ!....అయితే, శరత్ గాని అక్కడకు వెళ్ళాడా?"

"అవునమ్మా! శరత్ బాబు యీ రోజు ఉదయమే బయల్దేరి వెళ్ళారమ్మా! పెద్దయ్యగారెలా వున్నారో, యేమయ్యిందోనని చాలా గాబరాపడతా యెళ్ళారమ్మా!...."

"అరరె, నాకు మాట మాత్రమైనా ఫోన్ చేసి చెపితే నేనూ వెళ్ళేదాన్నిగా! ఇప్పుడెలా?" శశిరేఖ వాచీ చూసుకుంది.

సాయంత్రం ఆరున్నరయింది. ఉదయంనించీ ఫోన్ చెయ్యకపోవటం చాలా తప్పయింది. ఉదయం పేపర్లో బస్ ఏక్సిడెంట్ గురించి చదివింది. కాని అందులో నే ప్రొఫెసర్ అంకుల్ హైద్రాబాద్ వస్తున్నట్టు ఆమెకు తెలీదు. శరత్‌ని కలుసుకొని మూడు రోజులయిపోయిందప్పటికే. అందుకే క్రితం రాత్రి ప్రొఫెసర్ ప్రయాణం గురించి ఆమెకు తెలియలేదు.

పాపం, శరత్! తల్లిలేని కుర్రాడు. ఇప్పుడు తండ్రి కూడా లేకపోతే.... ఉహూ, అలా ఎన్నటికీ జరగదు. అంకుల్ కేమీ కాదు. ఆయన సజీవంగా వుంటారు. తనకా నమ్మకముంది. శరత్ కెలాంటి కష్టమొచ్చినా తను భరించలేదు.

శరత్‌ని హృదయపూర్వకంగా కోరుకుంటున్నది తను. అతని మనసు తనకి తెలుసు. చాలా సున్నితమయినవాడు.

అంతటమించి మంచివాడు. సంస్కార మున్నవాడు. మూడేళ్ళుగా తనతో పరిచయమున్నా, పరిచయం స్నేహంగా పరిణమించిందేగాని, యే నాడు అతను హద్దు మీరలేదు. ఎన్నో సందర్భాలలో తను అతనికెంత సన్నిహితంగా వచ్చినా, అతను తొందరపడలేదు. అంత నిగ్రహపరులు చాలా అరుదుగా వుంటారు.

శశిరేఖ ఫోన్ పెట్టేసి, అలసటగా సోఫాలో కూలబడింది.

శశిరేఖ ఆ సిటీలో కల్ల పెద్ద క్రిమినల్ లాయర్ రంగనాథ్ కుమార్తె. బి.ఎస్సీ ఫైనలియర్ చదువుతోంది. ప్రొఫెసర్ జాదవ్. రంగనాథ్ చిన్ననాటి స్నేహితులు. ఎప్పుడూ తన ప్రయోగాల గొడవతో లేబ్ లో సతమతమయ్యే జాదవ్ కి రంగనాథ్ పెద్ద రిలీఫ్. నవ్విస్తూ చతురోక్తులతో స్నేహితుడ్ని అలరిస్తుంటాడు రంగనాథ్.

ఇద్దరు పెదవి విప్పి అనుకోలేదు గాని యిద్దరి మనసుల్లోను ఒకరితో మరొకరు వియ్యమందాలనే ఆలోచన వున్నది. అందుకు తగ్గట్టే శశిరేఖ, శరత్ మనసారా ప్రేమించుకుని ఒకరికొకరు సన్నిహితంగా వచ్చారు. శరత్ ఇంజనీరు అయిన మరుక్షణం వాళ్ళిద్దరి పెళ్ళి జరిగిపోతుంది.

శశిరేఖ మనసు పరిపరివిధాల పోతున్నది.

కనీసం తండ్రయినా యీ సంగతి చెప్పలేదేమిటి? బహుశా ఆయనకూడా తెలిసివుండదు అంకుల్ ప్రయాణం సంగతి? లేకుంటే ఉదయం కాఫీల సమయంలో తప్పక ప్రస్తావించి వుండేవారు.

కాఫీ తాగుతూ పేపరు చూడటం రంగనాథ్ దినచర్యలో అతి ముఖ్యమయినది. తమ చర్చల్లో బస్

ప్రమాదం గురించి ప్రస్తావనకి వచ్చింది. అప్పుడయినా నాన్న చెప్పివు దేవారు. కా ట్టి ప్రమాదంలో అంకుల్ చిక్కుకున్న విషయం నాన్నకు తెలీదన్నమాట!

ఇప్పుడు తనేం చెయ్యాలి? జరగకూడని దేదైనా జరిగితే మానసికమైన ధైర్యాన్ని శరత్ కందివ్వాలి. అది తన ప్రస్తుత కర్తవ్యం. శరత్ వచ్చేవరకు యెదురు చూడాలి. బహుశా రాత్రి బాగా వేళమీరి పోయాకి గాని, రేపుగాని శరత్ తిరిగొస్తాడేమో.... చూడాలి!

ఆ రాత్రంతా అసహనంగా గడిపింది శశిరేఖ.

తెల్లవారుతూనే శరత్ యింటికి ఫోన్ చేసింది. రామయ్య రసీవ్ చేసుకున్నాడు.

"ఇంకా రాలేదమ్మ, చినబాబు!...." అన్నాడు రామయ్య.

శశిరేఖ అనుమానం బలపడింది.

"నిన్న ఉదయం వెళ్ళిన మనిషి యింకా రాలేదా? యేం చేస్తున్నట్టు?...." జనాంతికంగా ఫోన్ లోనే అనేసి మళ్ళీ తేరుకొని, "నీకుగాని ఎక్కడ్నుంచయినా ఫోన్ చేశాడా" అనడిగింది.

"లేదమ్మాయిగారూ! నేను అందుకే ఎదురుచూస్తుండాను. ఏ సంగతీ తెల్వదమ్మా. నాకు శానా గాబరాగా వుండాది." అన్నాడు రామయ్య. శరత్ తల్లి బతికున్నప్పట్నించీ అతను వాళ్ళింట్లో నమ్మకంగా పని చేస్తున్నాడు. శరత్ అంటే అతనికి పంచప్రాణాలు. శరత్ తల్లి బతికున్నా అతనికన్నా గొప్పగా చూసివుండకపోయేది కొడుకుని. అంతగా వాళ్ళ జీవితాల్లో, వాళ్ళ కుటుంబంలో ఓ సభ్యుడిగా కలసిపోయాడు రామయ్య.

"నీకు శరత్ నించి ఫోన్ వచ్చినా, శరత్ గాని వచ్చినా

నాకు వెంటనే ఫోన్ చేయి రామయ్యా!" అన్నది శశిరేఖ.

"తప్పకుండానమ్మా! వెంటనే బాలుచేత ఫోన్ చేయిస్తానమ్మ. అంతవరకు దయిర్యంగా వుండండి" రామయ్య గొంతులో విచారం ధ్వనిస్తున్నా అదిమిపట్టి ఆమెకు ధైర్యం చెప్పాడు.

శశిరేఖ నిరుత్సాహంగా కూచుండిపోయింది ఫోన్ పక్కనే. ఏం చెయ్యాలో తోచటంలేదు. యేదో జరిగింది. లేకుంటే యీపాటికి శరత్ ఖచ్చితంగా తిరిగొచ్చి వుండేవాడు.

ఆ సాయంత్రం వరకు ఆమె ఫోన్ పక్కనే కూచున్నది. శరత్ వెళ్ళి అప్పుడే ముప్పైఆరు గంటలు దాటి పోయింది.

ఒకవేళ అంకుల్‌కి ప్రమాదంగా వుందేమో.... నంద్యాలలోనో, గిద్దలూరులోనో హాస్పిటల్లో చేర్చారేమో....శరత్ తండ్రిని కనిపెట్టుకుని వుండిపోయి వుంటాడు....యే విషయం తండ్రిలాంటి రామయ్యకు ఫోన్ చెయ్యకుండా వుంటాడా?

అశాంతిగా కణతలు రుద్దుకున్నది శశిరేఖ.

అనిమిశంగా అటు ఇటు పచార్లు చేయసాగింది.

## 9

వాళ్ళిద్దరు తనమీదపడి ఎందుకు పెడరెక్కలు విరిచి కట్టేశారో చాలా సేపటికిగాని అర్థం కాలేదు శరత్‌కి.

వాళ్ళిద్దరు పూర్తిగా అనాగరిక ఆటవికులు. ఒంటి మీద సరైన ఆచ్ఛాదనలేదు. ఆ మాటకొస్తే తను ఆ గుహాలోకి వచ్చేటప్పటికి వాళ్ళు దాదాపు నగ్నంగానే వున్నారు. వాళ్ళు యే స్థితిలో వున్నారో తను స్పష్టంగా

చూశాడు. అందుకే తనమీద ఆగ్రహించి మీదపడి బంధించారా?

అయినా, కొండదేవత ఆటవికులకి పవిత్రమైన దేవత కదా!? అలాంటి దేవత సన్నిధిలో వాళ్ళు కామకేళీ కలాపాలతో కన్నుమిన్ను కానక ఎందుకు ప్రవర్తిస్తున్నారు? అది వాళ్ళ దృష్టిలో తప్పుకాదా!? ఎక్కడా స్థలమే దొరకనట్టు ఆ దేవత గుడిలో ఎందుకు ఆ పనికి పూనుకున్నారు? వాళ్ళెవరు? భార్యాభర్తలా, లేక ప్రేయసీ ప్రియులా? రహస్యంగా కలుసుకోవటానికి ఆ గుడిని సంకేత స్థలంగా నిర్ణయించుకున్నారా?

శరత్ కళ్ళెత్తి వాళ్ళిద్దరివంకా చూశాడు.

మొగాడికి పాతికేళ్ళుంటాయి. ఆడదానికి పద్దెనిమిది వుండొచ్చు. మంచి వయసులో వున్నారిద్దరు. మొగాడు చాలా మోటుగా, కర్కశంగా వున్నాడు. మొలచుట్టూ తీగెలు, ఆకులతో అల్లిన ఆచ్ఛాదన కట్టుకున్నాడు.

ఆడది పైభాగమంతా నగ్నంగా వదిలేసి మొల చుట్టూ సన్నటి నార చీరకట్టింది. అంటే యీ అడవిలోని ఆటవికులు అంతగా నాగరికత తెలిసినవాళ్ళు కాదన్న మాట! గుడ్డలు కట్టుకోవటం వీళ్ళకు ఇంకా తెలియదన్న మాట!

ఇద్దరి మెడల్లోను పూసలదండలున్నాయి. జుట్టు ఎర్రగా రాగిరంగుకి తిరిగివున్నది. తైల సంస్కారం లేదు. వాళ్ళ కళ్ళు చాలా భయంకరంగా ఎదుటి మనుషుల్ని పట్టి పట్టి చూస్తున్నట్టున్నాయి.

చెరోవైపు చెరోజబ్బ పుచ్చుకున్నారు శరత్‌ని. గుడి నుంచి బయటకు లాక్కువచ్చారు. శరత్ పెనుగులాడ లేదు. అసలు ఆ ప్రయత్నమే చెయ్యలేదు. వాళ్ళు

మొరటువాళ్ళు. పైగా మూర్ఖులు. తను ఎదిరించే కొద్దీ యేదైనా హాని తల పెట్టవచ్చు. అందుకే మౌనంగా వాళ్ళ వెంట వెళ్ళాడు.

ఓ అరగంట తర్వాత శరత్‌ని వాళ్ళ గూడెం తీసుక వెళ్ళారు. రెల్లుగడ్డితోను, తాటాకులతోను కట్టిన పూరి గుడిసెలు దాదాపు ముప్పయి నలభైవున్నాయా గూడెంలో.

అప్పటికి తెల్లవారటానికి తో వ్యవధి లేదు. తూర్పున తొలి తెలిరేఖలు విచ్చుకుంటున్నాయి.

ఆటవికుల్లో మొగవాడు గొంతెత్తి పిలవగానే అందరు నిద్రలు మానేసి పరుగు పరుగున వచ్చి గూడెం మధ్యనున్న బండరాతి దగ్గర గుమిగూడారు.

మొగాళ్ళందరు మొగ ఆటవికుడిలాగే మొలలచుట్టూ ఆచ్ఛాదనలు కట్టుకుంటే, ఆడవాళ్ళందరు ఆ ఆటవిక స్త్రీలా నారబట్టలు కట్టుకున్నారు.

తనని పట్టి తెచ్చిన ఆటవికుడు కొండభాషలో వాళ్ళతో ఏదో చెప్పాడు. నాయకుడిలావున్న ఓ వృద్ధ ఆటవికుడు శరత్‌ని చూసి తల పంకించాడు.

అక్కడ సమావేశమైన వాళ్ళంతా శరత్ వైపు యేదో పెద్ద నేరం చేసినవాడిని చూసినట్టు చూస్తున్నారు.

అప్పటికి తెల్లవారింది. సూర్యుడు ఉదయించబోతున్నాడు.

నాయకుడు ముందుకొచ్చి "హోర్నువ్వ?" అనడిగాడు కొండజాతి వాళ్ళు మాట్లాడుకునే యాసతో.

ప్లేన్ ప్రమాదంలో చిక్కుకుని బతికి బయటపడ్డానని, దారితోచని పరిస్థితుల్లో తిరుగుతూ కొండదేవత గుడిలో తెలియక ప్రవేశించానని, తనని వదిలేస్తే తనదారి తను చూసుకుంటానని శరత్ నాయకుడితో చెప్పాడు.

నాయకుడు తల అడ్డంగా తిప్పి నువ్వు చాలా పాపం చేశావన్నాడు. నీలాంటి పాపిని తేలిగ్గా వదలకూడదన్నాడు. మా పద్ధతి ప్రకారం దానికి ప్రత్యేకమైన శిక్ష వుందన్నాడు. ఎంతటి వాళ్ళకైనా ఆ శిక్ష అమలు జరిపి తీరుతామన్నాడు.

శరత్ నిర్ఘాంతపోయి, అసలు తను చేసిన పాపమేమిటని, అంత కూడని నేరం తానేం చేశానని నిలదీసి అడిగాడు.

వృద్ధనాయకుడు వివరించి చెప్పాడు. శరత్ అతని మాటలు విని నిశ్చేష్టుడై నిల్చుండిపోయాడు.

వాళ్ళలో వింత ఆచారమున్నది!

పెళ్ళి, పెటాకులవంటి బాదరబందీలు, ఒక మగాడికి ఒకే స్త్రీ అనే నిబంధనలు, కట్టడి యేమీ లేవు వాళ్ళకి. అందరి ఆడవాళ్ళకు తమ యిష్టమొచ్చిన మగాడితో గడిపే అవకాశముంది ఆ గూడెంలో. అయితే తల్లీకొడుకుల మధ్య, అన్నా చెల్లెళ్ళు లేదా అక్కా తమ్ముళ్ళ మధ్య, తండ్రీకూతుళ్ల మధ్య మాత్రం సంబంధాలు నిషిద్ధం.

ఓ సంవత్సరంపాటు ఆడ మగ కలిసి కాపరం చేసే వాళ్ళను అపురూపమైన జంటగా పేర్కొంటారు గూడెం పాళ్ళందరు. ఈ యేడాదిలోపల ఆ జంటకు బిడ్డలు కలిగితే సరి, లేకుంటే వాళ్ళని కొండదేవత గుడిలోకి పంపిస్తారు.

ఎవరూ లేకుండా వాళ్ళిద్దరు మాత్రమే ఆ కొండ దేవత గుడిలో సృష్టికార్యం జరుపుతారు. అలా జరిగిన మూడో నెలకే ఆటవిక స్త్రీ గర్భం ధరిస్తుందని వాళ్ల నమ్మిక.

అయితే, యిక్కడ ఓ మెలిక వున్నది! భార్యాభర్తలుగా చలామణి అవుతున్న ఆటవికు లిద్దరు ఎవరూ

లేని సమయంలో యెవరికంటా పడకుండా గుడిలో కలియాలి.

పొరపాటున యెవరైనా ఆ సమయంలో గుడిలోనికి ప్రవేశించినా, వాళ్ళని ఆటంకపరిచినా ఆ మనిషిని అదే కొండదేవతకు ఆహారంగా అర్పించాలి! అలా జరక్కపోతే దేవత ఆగ్రహించి గూడేన్ని నాశనం చేస్తుంది. ఇదీ వాళ్ళ ఆచారం!

వృద్ధ నాయకుడు యిదంతా చెపుతుంటే శరత్ చేష్టలుడిగినవాడై అంతా విన్నాడు. అతని పై ప్రాణాలు పైనే పోయాయి. తను గుడిలో ప్రవేశించిన సమయానికి ఆ స్త్రీపురుషు లిద్దరు రతికేళిలో నిమగ్నులై వున్నారన్న మాట! తను కావాలని వాళ్ళను చూడలేదు, వాళ్ళని భగ్నం చెయ్యలేదు. కేవలం తన ప్రాణం కాపాడుకోవటం కోసం లోపలికి ప్రవేశించి, ఆ ప్రాణాన్నే యిప్పుడు పోగొట్టుకోబోతున్నాడు.

ఆటవికుల కట్టుబాట్లకి, వాళ్ళ నిర్ణయానికి తిరుగుండదు! తను యేం చెప్పినా వాళ్ళు వినరు. ఎలా నచ్చచెప్పినా మరో మాటకు అవకాశ మివ్వరు. శరత్ కర్తవ్యం తోచనివాడిలా వాళ్ళ వింత ఆచారానికి ఆశ్చర్యపడూ అలాగే నిల్చుండిపోయాడు.

అనాగరికులైన అడవి మనుషుల ముందు తనని నిలదీసి తనపై నిందారోపణ చేసి, తనని శిక్షించబూనటం తలచుకుంటేనే వాళ్ళెంత మూర్ఖంలో అరమవుతోంది.

ఏమైనా సరే, వీళ్ళబారినుంచి తప్పించుకోవాలి! ఈ ఆటవికుల చేతుల్లో దిక్కుమాలిన చావుకాదు తను కోరుకున్నది. కాని తను అనుకోకుండా వీళ్ళ చేతుల్లో చిక్కాడు. తండ్రి విషయం ఓ పక్క నిర్ధారణగా

తెలియనేలేదు; తన కిక తెలుసుకునే అవకాశం శాశ్వ
తంగా పోబోతున్నది! తండ్రినిక కడసారి చూసే అవ
కాశం లేదా?

శరత్ కొద్ది క్షణాలు అలాగే మౌనంగా నిల్చుండి
పోయాడు. సూర్యుడు పై పైకి వస్తూన్నాడు.

## 10

మూడో రోజు కూడా శరత్ రాలేదన్న విషయం
రామయ్య ద్వారా విన్నది శశిరేఖ. ఆమె మనసు ఆరాటా
న్నదుపులో పెట్టలేకపోతోంది.

ప్రొఫెసర్ అంకుల్ ఏదో ప్రమాద పరిస్థితిలో
వున్నాడు—లేకుంటే ఖచ్చితంగా శరత్ మర్నాడే తిరి
గొచ్చి వుండేవాడు.

సరిగ్గా అప్పుడే పేపర్ బోయ్ పేపరు పడేసి
పోయాడు.

శశిరేఖ దాన్నందుకుని ఆత్రుతగా పేజీలు తిరగే
సింది. ఘాట్ రోడ్ ప్రమాదం గురించి ఫోటోలతో
సవివరంగా వచ్చేసింది.

ప్రయాణికులు ఏభై రెండుమంది ఫోటోలు, డ్రైవర్,
కండక్టర్ ఫోటోలతో బాటు ప్రచురించారు ఒకే
బొమ్మగా. అయితే ప్రొఫెసర్ జాదవ్ జాడ మాత్రం
తెలియటంలేదని, ఆయన కుమారుడు స్వయంగా స్పాట్ కి
వచ్చి తండ్రి గురించి ఎంక్వయిరీ చేశాడని, శవాల్లో
తండ్రి శవం లేకపోవటం గమనించి పోలీసులకు ఫిర్యాదు
చేశాడని, ప్రొఫెసర్ జాదవ్ బతికున్నదీ లేనిదీ నిర్ధా
రణ కాలేదని, ఇంకా దర్యాప్తు జరుగుతున్నదనీ రాశా
రందులో.

శశిరేఖ టెన్షన్ అణచుకుంటూ పేపరంతా అమూ

లాగ్రం చదివింది. అంతకు మించిన వివరాలు దొరకలేదు. ఆ రోజు పేపర్లన్నీ అప్పటికప్పుడు బజార్నించి తెప్పించి చూసింది. ఏ పేపర్లోను అంతకు మించిన వివరాలేమీ ప్రచురింపబడలేదు. శరత్ గురించి అంతకు మించి యేమీ తెలిసే అవకాశం లేకపోయింది.

శరత్ మూడు రోజుల్నుంచీ యేం చేస్తున్నట్టు? తండ్రి శవం కనపడకపోవటంతో, ఆయన బతికే వుండా అని ఎంక్వయిరీ చేస్తున్నాడా చుట్టుపక్కల? లేక హైదరాబాద్ గాని వెళ్ళాడా? యే విషయం తను స్పాట్ కి వెళ్ళి తెల్సుకుంటే నే గాని నిర్ధారణగా తెలియదు.

తండ్రితో చెపితే అభ్యంతర పెడతాడు. అదీగాక ఆయన తన కేసులతో తల మునకలుగా వున్నాడు. తర వాత తను ఎంక్వయిరీ చేస్తానని వాయిదా వేసేస్తాడు. తను యెంక్వయిరీ చేయించడు, తనని వెళ్ళనివ్వడు.

శరత్ విషయం తెలిసేవరకు తనకు ముద్ద మింగుడు పడటంలేదు. పిచ్చెత్తినట్టుగా వుంది. ఓ పక్క తండ్రి జాడ తెలియక శరత్ దిక్కు తోచని పరిస్థితిలో వున్నాడు. పోనీ అతనైనా తిరిగొచ్చి వుంటే తామిద్దరు కలిసి యేదో విధంగా అంకుల్ ఆచూకీ తెలుసుకోవటా నికి ప్రయత్నించేవాళ్ళు. కాని అతను రాలేదు.

శశిరేఖ ఆలోచనలతో సమయాన్ని వృధాపుచ్చదల చుకోలేదు. అప్పటికప్పుడే ఓ నిర్ణయానికొచ్చేసింది. తల్లికి చెపితే అసలే గుమ్మం కదలనివ్వదు. డబ్బాడిగితే అనుమానం వస్తుంది. తనే కేష్ తీసుకుని, అక్కడ స్లిప్ రాసిపెట్టి వెళ్తే సరిపోతుంది. ఖంగారుపడదు.

ఓ హేర్ బాగ్ లో రెండు చీరెలు, అవసరమైన

వస్తువులు సర్దుకున్నది. కేష్ తీసుకుని బాగ్ మధ్యలో చీర మడతల మధ్య పెట్టింది. చిన్న స్లిప్ రాసి కేష్ లాకర్లో పెట్టింది.

అప్పటికింకా తండ్రి మార్నింగ్ వాక్ నించి తిరిగి రాలేదు. తల్లి వంటింట్లో యేదో పని చక్కబెట్టుకుంటోంది.

రిక్షా పిలిచి యెక్కి కూచుంది. బస్ స్టేషన్ కి పోనిమ్మంది.

## 11

“మిస్టర్ ప్రొఫెసర్, ఇప్పటికైనా మించిపోయింది లేదు. ఆ ఫార్ములా ఎక్కడ దాచావో చెప్పు. లేదా ఫార్ములా రాసి యివ్వు. అయితే మమ్మల్ని దారి తప్పించటానికి నీ చేతికొచ్చిన యీక్వేషన్స్ వేసి యిచ్చేస్తే నీ చేతుల్తో నువ్వే గోరీ కట్టుకున్నావన్నమాటే! ఊఁ, ఇక ఆలస్యాన్ని భరించే ఓపిక నాకు లేదు. టెల్ మీ....” జయకర్ జాదవ్ వైపు సూటిగా చూస్తూ అన్నాడు.

జాదవ్ కొద్ది క్షణాలవరకు మాట్లాడలేదు. తర్వాత తల ఎత్తి జయకర్ ముఖంలోకి చూసి, “నాకు తెలియదు!” అన్నాడు కూల్ గా.

అంతే. అతని రెండు చెంపలు ఛెళ్ళు ఛెళ్ళున చరిచాడు జయకర్.

ప్రొఫెసర్ దంతాలు కదిలాయి. పళ్ళనుంచి రక్తం స్రవించి నోటికి ఉప్పగా తగిలింది. కళ్ళు తిరిగినట్టయి ముందుకి తూలాడు. నిరంతర దీక్షతో అన్నపానీయాలు కూడా నిర్లక్ష్యం చేసి అతని శరీరం చిక్కి శల్యమయింది. ఆ శరీరం ఏమాత్రం ప్రతిఘటనను ఎదుర్కొలేని స్థితిలో వుంది.

జయకర్ వికటంగా నవ్వి, "ఇది శాంపిల్ మాత్రమే! నాకు మనిషినుంచి నిజాన్ని ఎలా రాబట్టాలో బాగా తెలుసు. ఇంకా యెన్నో చిట్కాలు తెలుసు. మనిషి ప్రాణం పోకుండా చిత్రవధ చేయగలను.... చెప్పు, యింత సేపూ చాలా మర్యాద యిచ్చాను. ఇక నా తరం కాదు. కమాన్! టెల్ మీ, టెల్ మీ ..." అరిచాడు కోపంగా.

జాదవ్ కోపాన్ని, బాధనీ, ఉక్రోషాన్నీ పళ్ళ బిగువున భరించాడు. అతని ముఖంలో నరాలు ఉబ్బాయి—కళ్ళు రక్తాన్ని వర్షిస్తున్నట్టు ఎర్రగా అయ్యాయి.

"నన్ను నిలువునా కోసేసినా నీ కా ఫార్ములా యివ్వను. ఏం చేసుకుంటావో చేసుకో!" అన్నాడు జాదవ్ తీక్షణంగా జయకర్ వంక చూస్తూ.

"నీ కొడుకును నిలువునా కోసేస్తాను. అప్పుడయినా యిస్తావా?"

"నా కొడుకు నీ దగ్గిర లేడని నాకు తెలుసు."

జయకర్ తొట్రుపడి అంతలోనే సర్దుకుని, "అయితే నీ కొడుకును నువ్వే తప్పించేశావన్న మాట....!?" అన్నాడు.

"నన్ను యిక్కడ బంధించావు కదా, నే నెలా తప్పించుకోగలననుకున్నావు? నీకు ఆశ, స్వార్థం తప్ప తెలివి తేట లేవనుకుంటాను...."

"ఊఁ, అధిక ప్రసంగం....నీ కొడుకు నా చూపునించి తప్పించుకోలేడు. ఈ అడివిలో యే మూల దాక్కున్నా మరో గంటలో మా వాళ్ళు వేటకుక్కల్లా వేటాడి

తీసుకొస్తాను, అమాయకుడు, పారిపోగలననే అను కున్నాడు...."

"రాత్రెప్పుడో పారిపోయిన వాడిని తెల్లారి పది గంటలు కావస్తున్నా పట్టుకోలేకపోయిన వేటకుక్కలు మరో గంటలో పట్టుకుంటాయంటే నమ్మేటంత అవివేకిని కాదు...."

"వాడిని, వాడి బాబువైన నిన్ను ఈ భూగృహంలో భూస్థాపితం చేస్తాను....అది చూడటానికి నువ్వెలాగూ బతికుండవ్...." అని యింకా యేదో చెప్తూండగా జాఫ్రీ మెడలో ఎడమచేతిని జోలెలో తగిలించుకుని అక్కడికొచ్చాడు. అతని చేతికి, జాన్ కాలుకి ప్రథమ చికిత్స చేశారు జయకర్ — అతని ప్రియురాలు పమీలా.

ఏమిటన్నట్టు చూశాడు జయకర్ అతనివంక.

జాఫ్రీ అతనికి మాత్రమే వినిపించేటంత మెల్లగా "ప్రొఫెసర్ కీర్తి యీ రాత్రికి గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో హైదరాబాద్ వెళ్తున్నాడని యిప్పుడే మన విల్సన్ వైర్లెస్ మెసేజ్ పంపాడు. మీరు కావాలంటున్నాడు" అన్నాడు.

జయకర్ ముఖం ఆనందంతో వెలిగిపోయింది. ఒక్క అంగలో తన గదికి పక్కనే అమర్చుకున్న వైర్లెస్ సెట్ దగ్గరకు పరుగెత్తాడు.

పమీలా అందించుతోంది మెసేజ్‌కి. అతను రాగానే అక్కడినుంచి లేచి వెళ్ళిపోయింది.

జయకర్ మెసేజ్ రిసీవ్ చేసుకుంటున్నాడు.

"విల్సన్ హియర్ ....విల్సన్ హియర్ ...." అన్నా డవతలనుంచి విల్సన్.

"జయకర్ హియర్ ....స్టార్ట్ ....స్టార్ట్ ...." అన్నాడు జయకర్.

"ప్రొఫెసర్ కీర్తి వైజాగ్ నుంచి ఈ రోజు గోదావరికి హైద్రాబాద్ వెళ్తున్నాడు. అతని ఫైండింగ్స్ రిసెర్చి లాబరేటరీస్‌లో ప్రాసెస్ చెయ్యబోతున్నాడు. అతని పరిశోధన సత్ఫలితాల నిచ్చిందని పేపర్లలో వార్తలు వచ్చాయి. ట్రాప్ చెయ్యనా?"

"ఇంకా ఆలస్యం దేనికి? అతని ఫైండింగ్స్ మనకి చాలా ముఖ్యం! గోదావరి విజయవాడ చేరేసరికి అర్ధరాత్రవుతుంది. మనకి ఆ స్టేషన్ అయితేనే అనుకూలంగా వుంటుంది. బండిని అవుటర్ సిగ్నల్ దగ్గర ఆపేసి, మన వేన్‌లో అతన్ని యిక్కడికి తీసుకొచ్చెయ్యి. చాలా పకడ్బందీగా జరగాలి యేర్పాట్లు ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా అతనుకాదు ట్రాప్ అయ్యేది; మనం! బి కేర్ ఫుల్!"

"ఓ.కె. ఫ్రెండ్! అవన్నీ నా కొదిలెయ్. ఐ విల్ మేనేజ్ ...."

"ఆల్ రైట్ ....ఓవర్ ....ఓవర్ ...." అన్నాడు జయకర్. అతనికి చాలా ఆనందంగా వుంది. ప్రొఫెసర్ జాదవ్, ప్రొఫెసర్ కీర్తి యిద్దరు యిద్దరే. వుద్దండ పిండాలు. జాదవ్ అణుబాంబు ప్రమాదం నుంచి యెదుర్కొనే రసాయనం కనుగొంటే కీర్తి అతి తక్కువ ఖర్చుతో, అమిత వేగంగా పోయే చిన్న కారు కనుగొన్నాడు. జాదవ్ ఫార్ములాకు మల్లేనే కీర్తి ఫార్ములాకి కూడా అంతర్జాతీయ మార్కెట్ వుంది.

కొన్ని సంపన్న దేశాలు తామే పరిశోధనలు చేసి మొట్టమొదటిసారిగా ప్రపంచానికి చాటుకోవాలనే

కాంప్లెక్స్ కలిగివుంటాయి. కొన్ని దేశాల పరిశోధనా ఫలితాల్ని రహస్యంగా కొనుక్కొని తమ సైంటిస్టులు కనిపెట్టిన ఫలితంగా ప్రపంచ దేశాలకి చాటుకుంటారు. తమ దేశానిదే పై చేయిగా ప్రకటించుకుంటారు.

అలాంటి రెండు అగ్రరాజ్యాల నుంచి జయకర్ కి పెద్ద ఆఫర్స్ వున్నాయి. అతని ఏజెంట్లు దేశమంతా వున్నారు. వాళ్ళు ఏ యే సైంటిస్టు ఏ యే పరిశోధనలు చేస్తున్నారో, అవి ఎంతవరకు వచ్చాయో ఎప్పటికప్పుడు ఇన్ఫర్మేషన్ సేకరిస్తుంటారు.

ఇంటర్నేషనల్ మార్కెట్ వున్న పరిశోధనలయితే అనుక్షణం ఆ శాస్త్రవేత్త పరిశోధనా ఫలితాన్ని వెయ్యి కళ్ళతో కనిపెట్టి చూస్తూంటారు. చివరి క్షణంలో ఆ సైంటిస్టుని ట్రాప్ చేసి, ఫార్ములాని చేజిక్కించుకుంటారు. అనక ఆ సైంటిస్టుని పై లోకానికి పంపేస్తారు.

ప్రస్తుతం అలాంటి మార్కెట్ వున్న పరిశోధనలు దేశం మొత్తంమీద, ఆంధ్రులయిన జాదవ్, కీర్తి చేసి విజయాన్ని సాధించారు. అందుకే వాళ్ళిద్దర్ని ట్రాప్ చెయ్యటానికి జయకర్ బృందం సిద్ధమయ్యింది. జాదవ్ ని పట్టుకొన్నారు. ఇవాళ కాకున్నా రేపయినా ఫార్ములా చేజిక్కించుకోగలమనే ధైర్యం వాళ్ళకుంది.

ఇప్పుడు కీర్తి కూడా విజయవంతంగా పరిశోధన ముగించి తమ వల్లో చిక్కబోతున్నాడు.

## 12

శరత్ తన ఆయువు మూడినట్లే నిర్ణయించుకున్నాడు.

వాళ్ళలో వాళ్ళు ఆటవికులు అనుకొంటున్న మాటల్ని బట్టి ఆ రాత్రికే తనను వాళ్ళ కొండదేవతకు అర్పిస్తారని

అర్థం చేసుకున్నాడు. అంటే బలిస్తారా? నరబలి!

అయితే యీ అటవికులు నరరూప రాక్షసులన్న మాట. వీళ్ళింకా ఆదిమానవుడి దశలోనే వున్నారను కోవాలా? నాగరికత యింతగా అభివృద్ధి చెంది, అడవులు కూడా అభివృద్ధిలో ప్లెయిన్ ప్రాంతాలతో పోటీ పడుతున్న యీ రోజుల్లో యింకా యీ అడవిలో నరబలులిచ్చే తెగలవాళ్ళు నివసిస్తున్నారంటే అతనికి నమ్మ శక్యం కాలేదు.

మౌనంగా మరణాన్ని ఆహ్వానించక తప్పదని నిర్ణయించుకున్న ఆ క్షణాల్లో శరత్ కి గుర్తొచ్చింది శశిరేఖ!

అరె....తన హడావుడిలో ఆమె విషయమే విస్మరించాడు. తనకు మనసిచ్చి, తన తోడిదే లోకంగా తను లేకుండా, తనను ఒక్క రోజైనా చూడకుండా వుండలేని ప్రేయసి తన ఆరో ప్రాణం శశిని యింతసేపూ తలచుకోకపోవటం తనకే చిత్రంగా వుంది!

అంటే తన తండ్రిని యీ లోకంలో అన్నిటికన్నా మిన్నగా తను ప్రేమిస్తున్నాడన్న మాట!?....శశిరేఖ కన్నా కూడా మిన్నగా....! తండ్రి దూరమయ్యాక తెలిసింది తనకీ గొప్ప సత్యం!

శశి ఎలా వుందో....!? తండ్రి ఏక్సిడెంట్ లో చిక్కుకున్న వార్త విన్నాక తనకి మనసు పాడైపోయింది. వెంటనే స్పాట్ కి పరుగెత్తాలన్న ఆందోళన ఆత్రుత తన మనసుమీద తీవ్రంగా పనిచేసి మరో ఆలోచన రాకుండా చేశాయి. అందుకే శశితో కనీసం ఫోన్ చేసి చెప్పడాని క్కూడా అవకాశం లేకుండా పోయింది.

తనకి జన్మనిచ్చిన తండ్రి వున్నాడో, లేడో తెలి యదు. తనకి మనసిచ్చిన శశికి శాశ్వతంగా దూరమైపోతు న్నాడు. తను కొద్ది గంటల్లో ఈ లోకానికి దూరంగా.... ఏవేవో లోకాలకు....

కిర్రున చప్పుడు చేస్తూ తడిక తలుపు తెరుచుకుంది. వాళ్ళు చేతులు పొడవాటి బండకు కట్టేసి ఆ గుడిసె బందిఖానాలో తనని పారేశారు. తిండితిప్పలు లేక శోష వచ్చినా తన గురించి ఇప్పటిదాకా పట్టించుకునే నాథుడు లేడు. తనని బలివ్వటానికి తీసుకువెళ్తున్నారా యిప్పుడు....!?

శరత్ తలుపువైపు చూశాడు.

ఎవరో ఆటవిక స్త్రీ! ఆమె చేతిలో మట్టిపాత్రలో యేదో వుంది. ఆమె వయసు ఇరవైలోపే వుండొచ్చు— నల్లగా నిగనిగలాడుతున్న శరీరంతో, ఉబికి వస్తున్న వక్షు స్థలం నగ్నంగా కనిపిస్తుంటే, కేవలం నడుము చుట్టూ ఆకులు అలములు కప్పుకుని అతనివైపు నడిచి వచ్చింది.

శరత్ చూడకూడదనుకుంటూ ఆమె వంక చూశాడు. నల్లగా వున్నా అడవి మల్లెలా వుంది! అప్పుడే విచ్చిన ముద్దబంతి పువ్వులా వుంది. మసి పూసిన మాణిక్యంలా వుంది.

శరత్ ని సమీపించి నవ్వింది. తెల్లటి పలువరస గుడ్డి దీపపు వెలుగులో అందంగా మెరిసింది. నల్లటి ముఖంలో ఆమె నవ్వు ఉదయించిన చంద్రుడిలా వుంది.

"బువ్వ దిన్నవా?" అంది శరత్ వైపు మెరిసే కళ్ళతో చూస్తూ. లేదన్నట్టు తల అడ్డంగా తిప్పాడు.

"అయితే తిను" అంటూ మట్టి పాత్రలను అతని ముందు చాపింది.

శరత్ వాటివంక చూశాడు.

కాల్చిన మాంసం, జీడిపప్పు, ప్రట్ట తేనె, అరముగ్గిన పళ్ళు అతని ఆకలిని పదిరెట్లు పెంచుతూ కనువిందు చేశాయి.

ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఆమె మళ్ళీ నవ్వింది.

"ఊఁ....!" అన్నది చేతులు మరింత ముందుకు చాచి.

వాటి నందుకున్నాడు శరత్. ఓ అయిదు నిమిషాల సేపు ఆమె ఉనికినే మరిచిపోయి తిండిలో పడ్డాడు.

తర్వాత తన ఆత్రుతకీ, వాడావిడికీ సిగ్గుపడ్డాడు. ఆమె నవ్వుతూ అతను తినే పద్ధతి చూస్తూ నిల్చుంది అలాగే.

"కూచో....ఎవర్నువ్వు?" అనడిగాడు శరత్ ఆకలి బాధ ఉపశమించాక.

ఆమె నవ్వింది. మాటకు ముందు ప్రతిసారి నవ్వటం అలవాటులా వుంది—అయినా ఆ నవ్వు వెకిలిగా లేదు, ఎబ్బెట్టుగా లేదు. అతిగా లేదు. అడవిలో నివసించే ఆడది అంత అందంగా వుంటుందని అతనెన్నడూ వూహించలేదు.

"నే నీ గూడెపు నాయకుడి కూతురు. నిన్నరే తిరి అమ్మోరికి ఏట ఏస్తురు" అన్నదామె జాలిగా అతనివంక చూస్తూ.

"ఆ సంగతి నాకు తెలుసు. నాకు యివన్నీ తెచ్చి పెట్టావు. కాసేపట్లో చనిపోతానని తెలిసినా అన్నీ తిన్నాను. నీకు చాలా కృతజ్ఞుణ్ని. నేను చావుకు భయ పడటంలేదు" అన్నాడు శరత్ నిబ్బరంగా.

ఆమె మెచ్చుకోలుగా చూసిందతనివంక. తర్వాత

మెల్లగా చెప్పింది—"నేనిన్ను ఇడిపించటానికొచ్చిన, ఎల్లిపోతవా?"

శరత్ కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. ఆమె చెప్పేదేమిటో చాలాసేపు అర్థం కాలేదు. అర్థమయ్యాక ఆమె ఉన్నత వ్యక్తిత్వం అవగాహన కొచ్చింది. ఎందుకు యీమెకు తనమీద జాలి, దయ? తనేమౌతాడని యీ సహాయం చేస్తోంది? పైగా గూడెపు నాయకుడి కూతురయివుండీ తనని తప్పించటానికి సిద్ధపడుతోంది. శరత్ మనసు ఆమె పట్ల కృతజ్ఞతతో నిండిపోయింది.

"నన్నొదిలేస్తే, నీ గూడెం ప్రజలు నిన్ను బతకనిస్తారా ? యెందుకు నీ చావును కొని తెచ్చుకుంటావు?"

ఆమె మనోహరంగా నవ్వింది. "నీ కోసరమే అందగాడా. నాకు నీ మీద మనసయినాది మొనగాడా. నన్నేలుకుందువా?" అంది.

శరత్ నిర్ఘాంతపోయాడామె మాటలకు. ఈమెకు తనమీద మనసయిందా? ఏమిటి ఈమె ధైర్యం? తనని పెళ్ళాడాలనుకుంటోందా? ఆ ఉద్దేశంతోనే తనని విడిపించాలనుకుంటోందా? తనామెను తిరస్కరిస్తే తనని విడిపించదు.

ఆమెను మోసంచేసి మాయ మాటలతో మభ్యపెట్టి విడుదలయ్యేకన్నా ఆమెను తనమీద ఆశ పెట్టుకోవద్దని నిజం చెప్పి మందలిస్తే మంచిది! అప్పుడు తన నర్థం చేసుకుని విడిపించిందా సరే, లేకుంటే తనెలాగూ చావుకు సిద్ధపడే వున్నాడు.

ఆమె శరత్ వైపే ఆశగా, అతను చెప్పబోయే దాని కోసం ఆత్రుతగా, టెన్షన్‌తో చూస్తోంది. దగ్గరగా

వచ్చి అతని కళ్ళలోకి కళ్ళు పెట్టి చూస్తోంది.

"నీ పేరేమిటి?...." అన్నాడు శరత్ అప్రయత్నంగా.

"మల్లి" అన్నదామె.

"చూడు మల్లీ, నా కిదివరకే పెళ్ళయిపోయింది మానసికంగా. నేను నిన్ను పెళ్ళాడలేను. క్షమించు" అన్నాడు మెల్లగానే అయినా స్పష్టంగా.

ఆమె దెబ్బతిన్నట్టు చూసిందతనివంక. ఆమె ముఖంలో చిరునవ్వు మాయమై కన్నీళ్ళు బొట బొట చెక్కిళ్ళపై ధారగా స్రవించాయి. ఎడంచేత్తో కన్నీరు తుడుచుకుని అతనివంక ప్రేమగా, ఆరాధనగా, మళ్ళీ అతను కనిపించడనే ఆత్రంతో తమకంగా చూసింది.

శరత్ ఆమె చర్యల్ని విచిత్రంగా చూస్తూన్నాడు. మల్లి కిసుక్కున నవ్వింది. కన్నీరు, నవ్వు కలగాపులగంగా ఆమె ముఖంలో వింతగా ప్రకాశించాయి. శరత్ కి ఆమె ప్రవర్తన అర్థంకావటంలేదు.

ఆమె అతని ముఖం మీద ముఖం చేర్చి అతని చెక్కిళ్ళను ముద్దు పెట్టుకుంది. బలంగా అతన్ని కౌగలించుకుంది. అయితే యీ చర్యలో ఆమెలో ఉద్రేకం గాని, కోరిక గాని లేవు. అపురూపమైన వస్తువును చూసినట్టు అతని వంక నిండుగా చూసింది.

"నన్ను ముద్దెట్టవా అందగాడా!?..." అన్నది నవ్వుతూ.

శరత్ దెబ్బతిన్నట్టు చూశాడు. ఆమె ముఖంలోకి చూస్తూ ఆమె పలికిన తీరుకు ఆశ్చర్యపడుతూ, ఒంగి ఆమె నుదుట ముద్దు పెట్టుకున్నాడు.

మల్లి ముఖం చంద్రబింబంలా వెలిగిపోయింది. చకచక

అతని కాళ్ళ బంధనాలు, చేతుల బంధనాలు తన దగ్గ రున్న ఛురకతో కోసేసింది. బిగుసుకుపోయిన కట్లు అతని రక్తప్రసరాన్ని తీవ్రంగా నిరోధించాయి. కట్లున్నంత మేరా లోతుగా చర్మం కోసుకుపోయి, వాతలు తేలింది.

"ఎల్లిపో! వెంటనే యీడనుంచి ఎల్లిపో. ఇంకో గడీకో, యిప్పుడో నీ కోసరం మావోళ్ళు వొస్తరు. ఆల్లకి దొరక్కుండా పారెల్లు. ఊఁ!" తొందర చేసింది.

శరత్ ఆమె త్యాగనిరతకి నిశ్చేష్టుడైపోయి కొద్ది సేపు అలాగే చూస్తూండిపోయాడు. మల్లి మళ్ళీ హెచ్చరించింది. తొందర చేసింది.

శరత్ ఆమెను వదలేక వదలినట్లు గుడిసె బయటికి వచ్చాడు — సరిగ్గా అప్పుడే గుడిసెవైపు ఆటవికులు కాగడాలతో చకచక వస్తూ శరత్ కి కనిపించారు. వాళ్ళకి దొరక్కుండా పారిపోవాలి. తన కోసమే వస్తున్నారు వాళ్ళు. అనుమానం లేదు. చీకట్లో యేమీ కనిపించటంలేదు.... అయినా ప్రాణం కోసం పారిపోవాలి!

శరత్ కాగడాలు వస్తున్న దిశకు వ్యతిరేక దిశలో పరుగందుకున్నాడు.

సరిగ్గా అయిదు నిమిషాల తర్వాత మల్లి హృదయ విదారకంగా చేసిన ఆర్తనాదం అతని చెవులకు కర్ణకఠోరంగా, జాలిగా, అతి దయనీయంగా వినిపించి, పరుగెత్తుతున్నవాడల్లా ఒక్క క్షణం టక్కున నిల్చుండిపోయాడు.

ఏం జరిగింది? ఆటవికులు మల్లి తనని విడిపించిన సంగతి కనిపెట్టేశారా? ఆమెను చంపేశారా? అతని ఒళ్ళు జలదరించింది ఈ ఆలోచన రాగానే. తనని రక్షించ

టానికి మల్లి తన ప్రాణాలనే పణంగా పెట్టిందా? ఆమె త్యాగం ముందు, తన స్వార్థం గడ్డిపోచలా విలువలేనిది. ఆమె ఉన్నత వ్యక్తిత్వం ముందు తాను అనామకుడు.

'మల్లీ, ఈ జన్మంతా నీకు ఋణపడి వుంటాను. నన్ను క్షమించు' అనుకున్నాడు మనసులో. ఆమె అమాయక రూపమే అతని కళ్ళముందు కదులుతోంది.

మల్లి కేకలు మరి వినిపించలేదు. ఆమెని చంపేసి వుంటారన్నది నిర్వివాదాంశం!

సరిగ్గా అప్పుడే అతనివైపు కాగడాలు మహావేగంగా దూసుకొస్తూ కనిపించాయి. అంటే, ఆటవికులు తనని వెంటాడుతున్నారన్న మాట. తనని పట్టుకోవటానికి పరుగెత్తుకొస్తున్నారు. తను దొరక్కూడదు. దొరికితే జీవితమే మిగలదు.

శరత్ శక్తివంచన లేకుండా కాలిసత్తువకొద్దీ పరుగెడుతున్నాడు. మల్లి పెట్టిన భోజనంతో అతనిలో నూతన శక్తి వచ్చింది. ఆమె ప్రాణత్యాగం చేసి నిలిపిన తన ప్రాణం, మళ్ళీ ఆటవికుల చేతిలో పోనివ్వకూడదు.

అతను పరిగెడుతున్నాడు. వెనుక ఆటవికులు మహావేగంగా దూసుకొస్తున్నారు.

## 13

శశిరేఖ బస్ దిగేసరికి చీకటి పడిపోతోంది.

ప్రమాదం జరిగిన స్పాట్ దగ్గర దించమని కండక్టర్‌తో ముందుగానే చెప్పింది. అతను ఆమె వంక ఓ సారి పరిశీలనగా వింతగా చూసి, తలూపాడు.

అప్పటికి ప్రమాదం సంభవించి నాలుగోరోజు. అప్పటికే ఆ విషయం మరుగున పడిపోతోంది. కేవలం డ్రైవర్ అజాగ్రత్తవల్లనే ప్రమాదం జరిగినట్టు పోలీసులు నిర్ధా

శించి కేసు ఫైలు మూసేశారు. అందుకే కండక్టర్ కొంత ఆశ్చర్యంగా చూశాడామె వంక.

ఘాట్ రోడ్ మలుపు తిరిగేచోట ఆమెను దించి బస్ వెళ్ళిపోయింది.

శశిరేఖ బస్ దిగి చుట్టూ కలియచూసింది.

సంధ్య వెలుగు ఆరిపోయి చీకట్లు ముసురుకోబోతున్న ఆ సమయంలో ఆ చిట్టడివి భయంకరంగా, నిర్మానుష్యంగా కొండచిలువలా కనిపిస్తున్న ఘాట్ రోడ్ యింకా భయంకరంగా కనిపించింది. మొండిధైర్యంతో, శరత్ ఆలోచనలో మనసు చెదిరిపోయి ఒంటరిగా వచ్చి చాలా పొరపాటు చేశానా?....అని తర్కించుకొన్నది కొంత సేపు.

ఇక్కడేముందని తనొచ్చింది? శరత్ తిరిగి రాకపోవటంతో కంగారుపడి పరుగెత్తుకొచ్చింది గాని, నాలుగు రోజులపాటు శరత్ యీ రోడ్ మీద యెందుకు పడి గాపులు కాస్తూవుంటాడనే ఆలోచనే రాలేదు.

గిద్దలూరులోనో, లేక నంద్యాలలోనో దిగి ఎంక్వయిరీ చేస్తే ఏమైనా ప్రయోజనముండేది. ఎటూగాని ఈ స్పాట్‌లో దిగటం యెంత తప్పయిపోయిందీ అంటూ నిందించుకుంది.

గిద్దలూరునుంచి వచ్చే బస్‌లో నంద్యాల గాని, నంద్యాల నుంచి వచ్చే బస్‌లో గిద్దలూరుగాని వెళ్ళి ఎంక్వయిరీ చెయ్యాలి. ఏది ముందు వస్తే దాంట్లో యెక్కాలి—అని నిర్ణయించుకుని బస్ వస్తున్నదేమోనని రోడ్డు రెండు వైపులా దృష్టిని సారించింది శశిరేఖ.

కాని, ఎటునుంచీ యెలాంటి బస్ రావటంలేదు. ముఖ్యంగా మారుప్రాంతాలకు పోయే బస్సులే వస్తాయి

ఆ ఘాట్ రోడ్‌లో, హైద్రాబాద్‌కు పోయేవి గాని, హైద్రాబాద్ నుంచి వచ్చేవి గాని ఆ రోడ్‌న వచ్చేవరకు యెదురు చూడటం మాటలు కాదు. గంటల తరబడి వేచి వుండాలి! ఫ్రీక్వెన్సీ చాలా తక్కువ.

వాచీ చూసుకొంది శశిరేఖ. ఆరున్నరయింది. చీకటి పడిపోయింది. ఆ వాతావరణం గుబులు పుట్టిస్తోంది.

అలాగే నడుస్తూ ఏక్సిడెంట్ జరిగిన ప్రదేశాన్ని ఏకదీక్షతో పరిశీలించింది. బస్ ఎక్కడ ఒరిగి లోయలో పడిపోయిందో మార్కింగ్ చేస్తూ రాళ్ళు పేర్చి వున్నాయక్కడ. బహుశా పోలీసులు మార్క్ చేసి వుంటారని వూహించింది.

లోయలోకి తొంగి చూడబోయి, భయం వేసి ఆ ప్రయత్నం విరమించుకుంది. అంతు తెలియనంత లోతుగా భయంకరంగా కనిపించింది. అప్రయత్నంగా ఒక్క అడుగు వెనక్కు వేసింది—తూలి కిందకు పడిపోతానేమో నన్నట్టుగా.

సరిగ్గా అప్పుడే ఆమెకు సమీపంలో యేదో కారాగిన శబ్దం వినిపించి చటుక్కున వెనుతిరిగి చూసింది.

అంబాసిడర్ కారు! ఆమె ప్రాణం లేచివచ్చింది.

వాళ్ళని లిఫ్ట్ అడిగితే....!? అటు అడుగులు వేయబోయి చటుక్కున ఆగిపోయింది.

కారులోంచి ఇద్దరు గూండాల్లాంటి వ్యక్తులు దిగి తనవైపే వస్తున్నారు. బాగా తాగివున్నారనటానికి నిదర్శనంగా తూలిపోతూ అంతలోనే నిలదొక్కుకుని ఆమెవైపు సూటిగా చూస్తూ వస్తున్నారు.

శశిరేఖ ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. ఒక్క

సారిగా భయం, టెన్షన్ ఆమె నరం నరం పాకిపోయి వణికిపోయింది. తాగివున్న మనిషి పశువుతో సమానం. వివేకం కోల్పోయిన పశువేం చేస్తుందో ఆమెకు తెలుసు!

తను ఒంటరిగా ఆ నిర్జన ప్రదేశంలో.... తాగి గూండాల ముందు.... ఆమె ఇక ఆలోచించలేదు. ఒక్కసారిగా వెనుతిరిగి పరుగుతీసింది.

ఆమె అలా పారిపోతుందని ఊహించని గూండాల్లాంటి వ్యక్తులు కారువైపు చూసి యెవర్నో పిలుస్తూ ఆమె వెనుక పరుగెత్తారు. కారు డ్రైవింగ్ సీట్లో కూచున్న వ్యక్తి డోర్ తెరచుకుని దిగి తనూ వాళ్ళతో పరుగెత్తుకుంటూ వస్తూన్నాడు.

శశిరేఖ రోడ్డు దిగి అడవిలోకి పరుగెత్తింది. రోడ్ మీదయితే వాళ్ళకి దొరికిపోయే ప్రమాదముంది. అడవిలోనైతే ఏ చెట్టుచాటునో, పొదచాటునో దాక్కుని ప్రాణం, మానం కాపాడుకోవచ్చు.

ఆమె అడవిలోకి పారిపోతుంటే మరింత వేగంగా ఆమెతో బాటు వెనుక వస్తూన్నవాళ్ళు కూడా అడవిలోకి గెంతారు.

దట్టంగా పెరిగిన పొదలు, చెట్లు భయంకరంగా తలలు విరబోసుకున్న దయ్యాల్లా కనిపించాయి శశిరేఖకు. కాని ఆ దెయ్యాలకన్నా వెయ్యిరెట్లు భయం పుట్టిస్తున్నారు వెనుక వస్తూన్న రాక్షసులు! ఏ మాత్రం దొరికినా తనని సర్వనాశనం చేసేస్తారని ఆమెకు తెలుసు.

చురకత్తుల్లాంటి రాళ్ళు, ముళ్ళపొదలు ఆమె కాళ్ళను, చేతులను కోసేస్తున్నా, చీర చీలికలు పేలికలై పోతున్నా ఆమె పరుగు నాపలేదు. రెండు మూడుసార్లు చీర వచ్చిళ్ళు అడ్డుపడి ముందుకు పడబోయి అతి కష్టం

మీద నిలదొక్కుకున్నది. పరుగెడుతూనే వెనుతిరిగి చూస్తోంది మధ్య మధ్య.

వాళ్ళు పరుగెత్తుకొని వస్తూనే వున్నారు.

శశిరేఖకి ఆయాసంతో, నాలుక పిడుచకట్టుపోయి దాహంతో — శోష వచ్చినట్టుగా వుంది. అయినా లెక్క చెయ్యలేదు. గమ్యం లేని పరుగుతో అలా ఉరకులు పరుగులుగా ముందుకు పోతోంది.

ఎదురుగా నేలబారుగా వంగిన కొమ్మ ఆమె నుదుటికి కొట్టుకోబోయింది. కర్తవ్యం వెంటనే స్ఫురించింది. ఈ కొమ్మ నాధారం చేసుకుని చెట్టెక్కేస్తే....!? అనిపించింది. మరుక్షణం ఆచరణలో పెట్టింది.

చకచక కొమ్మను కిందకు వంచి దానిపైన యెక్కి, పైకి ఎగబాకింది. విశాలమైన చెట్టు అది! కొమ్మలు శాఖలు విస్తరించి చాలా గుబురుగా వుంది. కొమ్మల మధ్యలో ఆకుల చాటున దాక్కుంది. తను అక్కడ దాక్కున్న విషయం కనిపెట్టడం కష్టం! చాలా మరుగ్గా వుందక్కడ....

శశిరేఖ కొమ్మల మధ్యన కూచుని చూస్తోంది. గూండాలు స్పష్టంగా కనిపిస్తున్నారక్కడికి. వేగంగా పరుగెత్తుకొస్తున్నారు. సరిగ్గా చెట్టు కిందికి వచ్చారు. శశిరేఖ మనసంతా టెన్షన్‌తో నిండిపోయింది. గుండె వేగం హెచ్చింది.

చీకటి బాగా ముసురుకోవటంతో వాళ్ళు ముగ్గురూ తడుముకుంటూ నడుస్తున్నారు. చాలా శ్రద్ధగా ప్రతి పొద, పుట్ట, గుట్ట వెతికేస్తున్నారు. వారు ఏ క్షణంలో నైనా పైకి చూసే అవకాశం లేకపోలేదు. ఊపిరి విడుసే ఆ శబ్దానికి తన ఉనికి బయటపడిపోతుందనే భయంతో

ఊపిరి బిగబట్టుకుని కూచుంది శశిరేఖ.

ఆమె కూచున్న చెట్టుకిందికి వచ్చిన ముగ్గురు ఆగి, జేబులోంచి సిగరెట్లు తీసి వెలిగించుకుంటున్నారు. శశిరేఖ బల్లిలా కొమ్మలకు కరచుకుని టెన్షన్‌తో చూస్తోంది.

వాళ్ళు యేదో మాట్లాడుకుంటున్నారు మెల్లగా. మాటలు ముద్దగా వస్తున్నాయి. తనని వుద్దేశించి మాట్లాడుతున్నారని స్పష్టంగా తెలుస్తోంది.

సరిగ్గా అప్పుడే ఎక్కడ్నుంచో టార్చిలైటు ఫోకస్ పడింది వాళ్ళ ముగ్గురిమీద. వాళ్ళు ముగ్గురు త్రుళ్ళిపడి అటు చూశారు.

పైనుంచి శశిరేఖ కూడా గమనించింది. ఎవరో యిద్దరు వ్యక్తులు వేగంగా అటు వస్తున్నారు.

గూండాలు ముగ్గురూ ఒక్కసారిగా వెనుతిరిగి ఘాట్‌రోడ్ వైపు పరుగెత్తారు. టార్చితో వస్తోన్న వ్యక్తులిద్దరు "స్టాప్ దేర్ స్టాప్ ...." అంటూ గూండాలను వెంబడిస్తూ పరుగెత్తారు.

శశిరేఖ అయోమయంగా చూసింది.

వాళ్ళిద్దరు జయకర్ అనుచరులని గాని, తన ప్రియమైన శరత్ కోసం అడవి అణువణువునా గాలిస్తున్నారనిగాని ఆమెకు తెలియదు. ప్రస్తుతానికి ఆ గూండాల బెడద తప్పిపోయినందుకు ఆమెకు చాలా ఆనందంగా వుంది..

అయితే టార్చిలైటు ఫోకస్ మళ్ళీ త్వరలోనే ప్రత్యక్షమయ్యింది. వాళ్ళిద్దరు గూండాలు దొరక్క తిరిగొస్తున్నారు. చెట్టు దిగటానికి తయారవుతున్న శశిరేఖ మళ్ళీ ఆ ప్రయత్నం విరమించుకుంది.

జయకర్ అనుచరులిద్దరు చెట్టుకిందికి వచ్చారు.

పారిపోయిన గూండాలను గురించి మాట్లాడుకొంటున్నారు.

"వాళ్ళను చూసి పారిపోయిన ప్రొఫెసర్ కొడుకను కున్నాను. కాని.... వీళ్ళెవరో అర్థంకాలేదు...." అన్నా డొకడు.

"ఏమో.... ఆ కుర్రాడి స్నేహితులేమో ...వాడిని వెతుక్కుంటూ వచ్చారేమో....మనం వెళ్ళేసరికే కారెక్కి పారిపోయారు మరి...." అన్నాడు రెండో అనుచరుడు.

"అంతా నీ మూలాన్నే! తుపాకీ ప్రయోగించనిచ్చావు కాదు. కనీసం బెదిరించినా సరిపోయేది గాల్లో పేల్చి. అన్నీ యిలాగే చేస్తావు, చివాట్లు తింటావు...."

"నేను వాళ్ళు ఫారెస్టు డిపార్టుమెంట్ వాళ్ళేమో ననుకున్నాను. లేకుంటే...."

"డిపార్టుమెంటు వాళ్ళయితే ఎందుకు మనల్ని చూసి పారిపోతారు...? ఆ మాత్రం ఆలోచన లేకపోతే ఎలా?"

శశిరేఖకు కొద్ది కొద్దిగా అర్థమవుతోంది. ప్రొఫెసర్ కొడుకంటే ఖచ్చితంగా శరతే అయ్యుంటాడు. అంటే శరత్‌ని యిక్కడెక్కడో బంధించి వుండాలి....అత నెలాగో తప్పించుకుని పారిపోయాడు. అతని కోసం వీళ్ళిద్దరు వెతుకుతున్నారు.

అయితే శరత్ ఏమయినట్టు? ఈ మూడు రోజులుగా వీళ్ళకు బందీగానే వున్నాడా? ప్రొఫెసర్ అంకుల్ ఏమయ్యారు?

ఆ మరుక్షణమే ఆమె సందేహం నివృత్తి అయింది.

"ప్రొఫెసర్ కీర్తి కూడా ఈ రాత్రికే వస్తున్నట్టు

మధ్యాహ్నం బాప్ చెప్పాడు...."

"అవును. విజయవాడ నుంచి మన విల్సన్ మెసేజ్ పంపాడట. జాన్, జాఫ్రీ చెప్పారు....సమయానికి వాళ్లు కాళ్ళు చేతులు విరగ్గొట్టుకుని మూలపడ్డారు. లేకుంటే మనకి తోడుగా వుండేవాళ్ళు కదా...."

"అయితే, ప్రొఫెసర్ కీర్తి కూడా జాదవ్‌తోబాటు మనకు అతిథులు కాబోతున్నారన్న మాట. జాదవ్ యింతకీ ఆ ఫార్ములా సంగతి బయటపెట్టడం లేదు కదా.... ఈ కీర్తి కూడా అలాగే మొండికేస్తే....!?"

"మొండివాళ్ళ నెలా లొంగతీసుకుని తన దారికి తెచ్చుకోవాలో బాప్‌కి తెలిసినంతగా మరెవరికీ తెలియదు ...జాదవ్ ఓ లెక్కా? అతని తల్లో జేజెమ్మ చెప్తుంది ఫార్ములా...."

ఇద్దరు పగలబడి నవ్వుకున్నారు అదేదో పెద్ద జోక్ అన్నట్టుగా. ఇద్దరి భుజాలకు తుపాకులు వేలాడుతుండడం అప్పుడే గమనించింది శశిరేఖ.

వీళ్ళు చాలా క్రూరులు. ప్రొఫెసర్ జాదవ్ అంకుల్‌ను వీళ్ళే దాచేశారు. ఎక్కడో తెలీదు. మరో ప్రొఫెసర్ని కూడా వేటాడి తెస్తున్నారు. ఫార్ములాలు వశం చేసుకోవాలని వీళ్ళ పన్నాగం! ఏం చేస్తారు ఫార్మూలాలని?

అయితే శరత్‌ను కూడా వీళ్ళే ప్రొఫెసర్ అంకుల్‌తో బాటు బంధించి వుండొచ్చు. కాని అతను తప్పించుకున్నాడు. అంకుల్ వీళ్ళదగ్గిర ఇంకా బందీగా వున్నాడు.

వీళ్ళని అనుసరించి వీళ్ళ స్థావరమెక్కడో తెల్సుకుంటే....!? ప్రొఫెసర్ అంకుల్ని కాపాడగలిగితే....!?

కాని, అది తనవల్లవుతుందా? ఈ దుర్మార్గులు తనని పట్టుకొని .... అమ్మో ....

శరత్ కనిపిస్తే బావుండును .... అంకుల్ బతికే వున్నాడని, వీళ్ళదగ్గర బందీగా వున్నాడని అతనికి చెప్పి తామిద్దరు వెళ్ళి విడిపిస్తే....!? కాని, శరత్ యేడీ?

శశిరేఖ మనసంతా టెన్షన్‌తో నిండిపోయింది. కనీసం తానయినా అంకుల్ నెక్కడ దాచారో వీళ్ళ వెంట వెళ్ళి చూసుకుంటే బావుండేలా వుంది. కాని వీళ్ళు వెంటనే వాళ్ళ స్థావరానికి వెళ్తారో లేదో.... ఓ పక్క శరత్ కోసం అన్వేషిస్తున్నారు. అతను దొరికే వరకు తిరుగుతారేమో ....

జయకర్ అనుచరు లిద్దరు వెతుకుతూ వెళ్తున్నారు. టార్చి వెలుతురునుబట్టి వాళ్ళు ఎంతదూరంలో వున్నారో చెట్టుపై కూచున్న శశిరేఖకు స్పష్టంగా తెలుస్తూనే వుంది. అది చాలా ఎత్తయిన వృక్షం కావటంతో చాలా దూరంగా వున్న వస్తువులు కూడా కనిపిస్తున్నాయి. వాళ్ళిద్దరు చాలా తీవ్రంగా వెతుకుతూ ఎటో కనిపించ నంత దూరంగా వెళ్ళిపోయారు.

వాళ్ళు మళ్ళీ ఆచేట వస్తారని ఎదురుచూస్తూ చాలా సేపు చెట్టు మీద అలాగే కూచున్నది శశిరేఖ సహనంతో.

కాని వాళ్ళిద్దరు మళ్ళీ రాలేదు.

వాచీ చూసుకున్నది శశిరేఖ. తొమ్మిది కావటానికి పది నిమిషాల వ్యవధి వుంది. రాత్రి సమయంలో నిర్జనంగా వున్న అడవిలో చెట్టుమీద కూచుని ప్రాణం కాపాడుకోవలసి వస్తుందని తానెన్నడూ వూహించ

లేదు. ఈ రోజు ప్రాణభయం, తీపి తనను చెట్టెక్కిం చాయి.

శశిరేఖ చెట్టు దిగటానికి రెండోసారి ప్రయత్నించబోయింది. అయితే ఇంతలో ఊహించని సంఘటన జరిగిపోయింది.

దూరంగా యేవో కాగడాలు మహావేగంగా కదిలి వస్తున్నాయి. వాటిని పట్టుకొన్న వ్యక్తులు ఎందరున్నారో స్పష్టంగా తెలియటంలేదు. వాళ్ళు వెంటాడుతున్న మనిషి బాగా దగ్గరయ్యాడు. చాలా వేగంగా దూసుకువస్తూన్న ఆ వ్యక్తిని గుర్తించి చిన్నగా కేక పెట్టింది శశిరేఖ. అయితే అది ఆమె గొంతు దాటి రాలేదు.

అతను....శరత్....తన ప్రియమిత్రుడు శరత్.... అతన్ని ఎవరో తరుముతున్నారు. వాళ్ళు ఇందాకటి తుపాకులున్న వ్యక్తులు కాదు. ఎవరో....ఒంటిమీద ఆచ్ఛాదన లేని వ్యక్తులు. ఆటవికుల్లా వున్నారు. వాళ్ళ చేతుల్లో కాగడాలు, బల్లేలు వున్నాయి.

చెంగు చెంగున గెంతుతూ శరత్‌ని తరుముతున్నారు. ఒకళ్ళిద్దరు బల్లేలు విసిరారు శరత్ మీదకు. అమ్మో, అవి తగిలితే....!? కాని, అదృష్టవశాత్తూ శరత్ వాటికందనంత దూరంగా పరుగెడుతున్నాడు. కాని, ఎంతోసేపు అలా పరుగెత్తలేడు. అడవిలో పుట్టి పెరిగిన ఆటవికుల ముందు శరత్ బలం, వేగం యేపాటిది?

ఇప్పుడెలా? శరత్‌ని రక్షించుకోవటమెలా? శశిరేఖ చాలా వేగంగా ఆలోచిస్తోంది. ఆమె మనసు టెన్షన్ భరించలేక పోతోంది.

సరిగ్గా అప్పుడే శరత్ తను కూచున్న చెట్టుకిందికి

వచ్చాడు.

టక్కున నిల్చుండిపోయాడు, తనకి అడ్డుగా వచ్చిన వంగిన కొమ్మ అతనికన్నా అడ్డు తగలటమే అందు కారణం! వంగిన కొమ్మని చూడగానే శరత్ కి తన కొచ్చిన ఆలోచనే రావటం, చకచక కొమ్మమీదికి ఎగబాకి చెట్టు గుబుర్లోకి వచ్చేయ్యటం చాలా వేగంగా జరిగిపోయింది.

వెంటనంటి వస్తూన్న ఆటవికులు ఇది గమనించలేదనటానికి నిదర్శనం—ఎగాయెకిన ముందుకే వేగంగా పరుగెత్తటం! వాళ్ళు తెలివితక్కువ మనుషులని, ఆలోచించగల శక్తిగాని, జ్ఞానంగాని లేనివాళ్ళని ఆమె కర్ధమైపోయింది. శరత్ క్షేమంగా తెలివిగా తప్పించుకోవటం అదీ తనెక్కిన చెట్టుమీదికే రావటం ఆమెకు చాలా ఆనందం కలగజేసింది.

“శరత్!” అని శశిరేఖ పిలిచేవరకు అతనామెను గుర్తించనేలేదు. పిలుపును బట్టి శశిరేఖను గుర్తించి ఒక్కసారిగా “శశీ!” అంటూ సంభ్రమంగా పిలిచాడు. అతని కది కలో, నిజమో అర్థం కాలేదు. ఈ అడవిలో అర్ధరాత్రి కాబోతున్న సమయంలో తన శశి....యీ చెట్టు మీద....ప్రత్యక్షమవుతుందని అతనూహించలేదు....

శశిరేఖ అతనివంక నవ్వుతూ చూసింది.

“ఇష్! .... మాట్లాడకు .... అటు చూడు, వాళ్ళు యెందుకో మళ్ళీ వెనుతిరిగి వస్తున్నట్టుంది. ఈ ప్రదేశంలో జాగ్రత్తగా వెతుకులాట సాగిస్తే మనం దొరికిపోక తప్పదు” అని ఆమె చెప్తుండగానే ఆటవికులు పొదలు, తుప్పలు అన్నీ గాలిస్తూ అక్కడికొచ్చారు.

శరత్, శశిరేఖ ఊపిరి తియ్యడానికూడా భయపడి, బిగ బట్టుకుని చూచున్నారు.

అటవికులు చెట్టుకింది కొచ్చారు.

అప్పుడు సమయం రాత్రి పన్నెండు గంటలు కావస్తోంది.

## 14

"వెల్‌కం మిష్టర్ కీర్తి, వెల్‌కం!" జయకర్ నవ్వుతూ చేయి ముందుకు చాచాడు.

ప్రొఫెసర్ కీర్తి చేతులు వెనక్కి కట్టుకుని నిల్చుని సూటిగా జయకర్ వంక చూశాడు.

కీర్తికి దాదాపు ఏభై సంవత్సరా లుంటాయి. ఎర్రటి ఎరుపు. తల అక్కడక్కడ నెరిసిపోయింది. పొడవాటి గడ్డం, మీసాలు నలుపు తెలుపు సమ్మిశ్రితంగా వున్నాయి. ఎదుటి వ్యక్తిని తన అయస్కాంతశక్తితో ఆకర్షించుకునే కళ్ళు, కొసతేలిన ముక్కు, ఆరడుగులకు తక్కువకాని విగ్రహంతో ఒడ్డు పొడవుతో పాతికేళ్ళ యువకుడిలా చలాకీగా ఉత్సాహంగా వున్నాడు.

"హూ ఆర్యూ? నన్నెందుకు విజయవాడ నుంచి ట్రాప్ చేసి తెచ్చారు నీ మనుషులు? నాతో మీ కేం పని?" అన్నాడు కీర్తి సూటిగా.

"అసలు పనంతా మీతో నే మై డియర్ ప్రొఫెసర్! అలా కూచోండి. వివరంగా మాట్లాడుకుందాం....ఆఁ, మీరు పరిశోధించిన తక్కువ ఖర్చుతో నడిచే కారు ఫార్ములా మేం కొనదల్చుకున్నాం. చెప్పండి, ఎంత కావాలో... !?"

ప్రొఫెసర్ కీర్తి సింహనాదం చేశాడు. "వాడూ యూ మీన్? నే నెలా కనిపిస్తున్నాను నీకు? నా పరి

శోధనా ఫలితాన్ని నీ లాంటి స్వార్థపరులకి అమ్ముకునే టంత నీచుడ్ని కాదు! నే నీ గడ్డమీద పుట్టినందుకు నా పరిశోధనా ఫలితాన్ని నా దేశ ప్రజలకే అంకితం చేస్తాను. నా మాతృదేశానికి కల్లో కూడా ద్రోహం చెయ్యను...."

"అలా ఎగ్జయిట్ కావొద్దు ప్రొఫెసర్! నాదీ తెలుగు గడ్డే. నేనూ భారతీయుడ్నే. ఐ మీన్ మాతృ దేశ భక్తుడ్నే. అయితే ఫక్తు వ్యాపారిని. అందుకే వ్యాపార సరళి ముందు మాట్లాడాను. ఇప్పుడు వృత్తి ధర్మానికి కట్టుబడి, నీ నుంచి ఆ ఫార్ములాని రాబట్టుకునే విధానం ఆలోచించాల్సి వుంటుంది...."

"అసంభవం. అది నీ తరం కాదు...."

"విల్సన్...." అని పిలిచాడు జయకర్.

పొడవుగా ఇనుపచువ్వలా వున్న వ్యక్తి ముందుకొచ్చి నిల్చున్నాడు. అతనే ప్రొఫెసర్ కీర్తిని విజయవాడ నుంచి ట్రాప్ చేసి వేన్‌లో అక్కడికి తీసుకొచ్చాడు.

గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణం చేస్తూన్న కీర్తిని ట్రెయిన్ విజయవాడ జంక్షన్ చేరుతుండగా అవుటర్ సిగ్నల్ దగ్గర ఆపి, మెరుపు దాడిచేసి మరో యిద్దరి సాయంతో అప్పటికే సిద్ధంగా వున్న వేన్‌లో పడేసి గాలికన్నా వేగంగా ప్రయాణించి అక్కడికి చేరాడు.

"ఇతని సూట్‌కేస్ బ్రీఫ్ అన్నీ చెక్ చేశాం. ఎక్కడా ఫార్ములా గాని, పరిశోధన గురించిన వివరాలు తెలియచేసే పేపర్స్ గాని యేవీ దొరకలేదు" చెప్పాడు విల్సన్.

"ఆల్ రైట్!.... మై డియర్ ప్రొఫెసర్! మొండితనానికి పోయి ప్రాణం పోగొట్టుకోవద్దు. లెటజ్ బి

ఫ్రాంక్! నిన్ను నా దారికి తెచ్చుకోవటానికి నేనేమైనా చేస్తాను. మనిషిని కొంచెం కొంచెంగా చంపుతాను. చాలా దుర్భరమైన వేదనకి గురిచేస్తాను—అందుకే.... నా మాట విని, ఆ ఫార్ములా మాకు హేండోవర్ చెయ్యి. నిన్ను మరుక్షణం వదిలేస్తాం" అన్నాడు జయకర్ నచ్చచెప్తున్నట్టు.

"నీ ఇష్టమొచ్చినట్టు చేసుకో.... నేను నీ బెదిరింపులకు లొంగిపోను." స్థిరంగా చెప్పాడు కీర్తి.

"మీ ప్రొఫెసర్ జాతి ఇంత మొండిది కాబట్టి నిద్రాహారాలు. పెళ్ళాం బిడ్డలు ధ్యాస లేకుండా ఆ లాబరేటరీస్‌లో మీరూ ఓ టెస్టు ట్యూబ్ లన్నట్టు బతికేస్తారు. ఐ పిటీయూ పీపుల్...." అన్నాడు జయకర్.

తర్వాత విల్సన్ వంక తిరిగి, "ఇతన్నుంచి మనక్కావలసిన పద్ధతిలో సమాచారాన్ని రాబట్టు. చాలా అర్జంటుగా జరగాలి. అవతల పార్టీలు ఒత్తిడి తెస్తున్నారు. ఆ ప్రొఫెసర్ జాదవ్ గురించి నేను చూసుకుంటాను..." అన్నాడు అతనికి మాత్రమే వినిపించేటంత మెల్లిగా.

విల్సన్ కీర్తిని జబ్బ పట్టి లాక్కుపోయి, జాదవ్ పక్క సెల్లో పడేశాడు.

ఇనప తలుపు దగ్గరకు వేసి తాళం పెడుతూ, "రేపు సూర్యోదయానికి నువ్వు మాకా ఫార్ములా అందజేశావా సరే. లేకుంటే చాలా దారుణమైన బాధలననుభవిస్తావు. నాకు జాలి, కరుణ లేవు. ఎక్కువ సమయాల్లో నేను మృగంగానే వుంటాను. ఆలోచించుకో! గుడ్ నైట్!" అన్నాడు కీర్తి వంక క్రూరంగా చూస్తూ.

ప్రొఫెసర్ కీర్తి నవ్వుతూ చిద్విలాసంగా చూశా డతనివంక. "ఓ.కే; వెళ్ళిరా!" అన్నాడు.

# 15

ఆటవికులు చెట్టుకింద కొన్ని క్షణాలు నిల్చుని చుట్టూ పరిశీలనగా చూశారు. ఆ తరవాత విడివిడిగా చీలిపోయి అడవి నాలుగువైపులకు చెదిరిపోయారు.

తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు శశిరేఖ, శరత్.

"ఇప్పుడు చెప్పు, నువ్విక్కడి కెందుకొచ్చావు? ఎలా వచ్చావు?" అడిగాడు శరత్.

"వివరాలన్నీ తర్వాత మాట్లాడుకుందాం. మీ నాన్న గారు సజీవంగా వున్నారు" చెప్పింది శశిరేఖ.

శరత్ ముఖం వెలిగిపోవటం ఆ చీకట్లో కూడా స్పష్టంగా గమనించింది శశిరేఖ.

"నిజమా? నువ్వు చూశావా?" సంభ్రమాన్ని అణు చుకోలేకపోతున్నాడు శరత్.

"చూడలేదు గాని, ఇంతక్రితమే ఆయన్ని బంధించిన మనుషుల్లో ఇద్దరు చెప్పుకుంటుండగా విన్నాను. వాళ్ళ సొరంగంలో ఎక్కడో బంధించి వుంచినట్టు అర్థం చేసు కున్నాను. ఆ సొరంగం ఎక్కడో తెలియదు."

శరత్ సాలోచనగా తలూపి, "నా ఊహే నిజమైతే అది నన్ను బంధించిన సొరంగ మార్గంలోనే అయ్యుం టుంది. నేను అంతదూరం ఆలోచించలేదు. నాన్నగారు కళ్ళెదురుగా వున్నా కనుక్కోలేకపోయాను. పద, వెంటనే వెళ్దాం" అన్నాడు. అంటూ శశిరేఖవైపు చూసి ఆగిపోయాడు.

పై కొమ్మమీది నుంచి ఆమెమీదికి నోరు తెరచుకుని సాగుతున్న ఆకారం కొండచిలువదని అతను గుర్తించే

లోపల అది శశిరేఖ ముఖందాకా వచ్చేసింది.

మరుక్షణం ఆమెను పక్కకు లాగేశాడు. పట్టుజారి ఇద్దరు కొమ్మల మధ్య నుంచి ఒక్కసారిగా నేలమీద పడిపోయారు. ఎండుటాకులు ఎత్తుగా పరుపులా పేరుకుపోయి వున్నాయి గాని, లేకుంటే ఎత్తునుంచి పడినందుకు కాళ్ళు చేతులు విరిగిపోయుండేవి.

ఆకస్మాత్తుగా జరిగిన సంఘటనతో కొద్ది క్షణాల వరకూ ఇద్దరూ తేరుకోలేకపోయారు.

"మై గాడ్! ఎంత గండం గడిచింది!?" అంది శశిరేఖ గుండెలమీద చేయి ఆన్చుకుని భయంగా. ఆమె గుండె చప్పుడు స్పష్టంగా వినిపిస్తోంది. బాగా భయపడిపోయిందనటానికి నిదర్శనంగా ఒళ్ళంతా చెమటలతో తడిసిపోయి, బంగారు లాకెట్ ఆమె గుండెలమీద యెగిరెగిరి పడుతోంది. నాలుక పొడారిపోయింది.

ఒంటికి అంటుకున్న దుమ్మును, ఎండుటాకుల్ని దులుపుకున్నా రిద్దరూ.

శరత్ చేత్తో ఆమెను లేవదీసి, "పద, ప్రమాదాల నెదుర్కోటానికి నే నలవాటు పడిపోయాను. అసలైన జీవన్మరణ సమస్య నిప్పుడే ఎదుర్కోబోతున్నాం. నాన్నగారిని త్వరలో నే చూడబోతున్నాం" అంటూ ముందుకు అడుగువేశాడు.

సరిగ్గా అప్పుడే అడవిలోని చిన్న చిన్న జంతువులు, కుందేళ్ళు, లేళ్ళు. ఒక్కసారిగా అటు యిటు కకావికలుగా పరుగెట్టసాగాయి.

శశిరేఖ, శరత్ విస్మయంగా వాటివైపు చూశారు— అవెందుకు పారిపోతున్నాయి....? యెక్కడికి పారిపోతున్నాయి....?

శరత్ కి వెంటనే స్ఫురించింది. ప్రాణికోటి తన కంటె బలవంతుడయిన ప్రత్యర్థికి యెదురు నిలవలేక ప్రాణ రక్షణ కోసం చివరి క్షణంలో పలాయన మంత్రం పఠిస్తుంది.

అంటే ఈ జంతువులకన్నా బలమయిన జంతువేదో వీటిని వేటాడబోతోంది. అదేమయి వుంటుందో గ్రహించే సరికి శరత్ కి ముచ్చెమటలు పోశాయి.

"శశీ, కమాన్, క్విక్! పులో, సింహమో, చిరుత పులో ఈ వైపుగా వస్తూండివుండాలి! మనం వెంటనే మరో చెట్టేదయినా యెక్కి ప్రాణం కాపాడుకోవాలి. టైంలేదు" అంటూ దగ్గరలో నేలమీద వరకు ఊడలు దిగి శాఖోపశాఖలుగా విస్తరించిన మర్రిచెట్టువైపు శశిరేఖ చేతిని పట్టుకొని పరుగులు తీశాడు.

శశిరేఖకి కొండచిలువను చూసినప్పట్నుంచి చెట్టెక్కాలంటే వణుకు పుడుతోంది. అయినా క్రూర మృగానికి యెదురై ప్రాణాలు పోగొట్టుకునే కన్న పొంచివున్న ప్రమాదాన్ని ధైర్యంగా ఎదుర్కోవటమే నయమనుకున్నది.

ముందుగా శరత్ ఊడల్ని పట్టి పైకెగబాకి శశిరేఖను ఒడుపుగా పైకి మెల్ల మెల్లగా చేరుకున్నాడు.

సరిగ్గా అప్పుడే యెక్కడో పులి గాండ్రింపు వినిపించింది. పెద్దపులికాదు, చిరుత. చాలా వేగంగా గాలితో పోటీపడి పరుగెత్తుతోంది.

ఇద్దరూ ఊపిరి తీసుకోవటం కూడా మరచిపోయి చిరుతపులి వేటను టెన్షన్ తో చూస్తూన్నారు.

చిరుత వేగంగా పరిగెత్తి ఓ లేడిని పట్టుకొని వెంటనే కంఠం కొరికి చంపేసింది. అంతటిలో ఘూయకోక మరో

దుప్పిని, అడవి జాతుల్ని చంపింది. తీవిగా నిల్చుని తాపీగా అరగించటం ప్రారంభించింది.

సరిగ్గా అప్పుడే ఎక్కడ్నుంచో రివ్వురివ్వున బాణాలు వచ్చి చిరుత శరీరాన్ని తూట్లు పొడిచాయి. చిరుత మహోగ్రంగా అరచింది. దాని అరుపు ఆ అడవిలో చాలా సేపు ప్రతిధ్వనించింది. కోపంతో గిర్రున తిరిగింది చాలా సేపు.

ప్రత్యర్థులు కనిపించలేదు. పిచ్చిగా అటుయిటు పరుగెత్తింది. మరికొన్ని బాణాలు దాని శరీరంలో నాటుకున్నాయి.

చివరగా అడవి దద్దరిల్లేలా గర్జించి నేలమీద పడి కొట్టుకుని ప్రాణాలు వదిలేసింది.

అంతవరకూ చెట్లమీది నుంచి బాణాలు సంధించి వదిలిన ఆటవికులు కిందికి దిగొచ్చి చిరుతను చుట్టుముట్టి, అది చనిపోవటం గురించి ఆనందంతో గంతులు వేస్తూ 'హో' అని కేకలు పెడుతూ—కేరింతలు కొట్టారు. చిరుతను మోసుకుని వెళ్ళారు. అంతా క్షణాల్లో జరిగిపోయింది.

శరత్, శశిరేఖ ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు.

శరత్ తనని వెతకటానికి వెంటతరిమిన ఆటవికులుగా వాళ్ళని గుర్తించాడు. వాళ్ళింత సేపు చెట్లమీదున్నారా? ఉంటే తను, శశిరేఖ ఆ చెట్టు దిగి, ఈ చెట్టు ఎక్కటం గమనించలేదా? అంతా చిత్రంగా వుంది. తమని వాళ్ళు గమనించి వుంటే చిరుతకన్నా ముందు తమ భరతం పట్టి వుండేవాళ్ళు కదా! ప్రమాదాలు యెంత దగ్గరగా తప్పిపోతున్నాయి!? ఇదంతా తమ అదృష్టమా, లేక వాళ్ళ

అసమర్థతా?

"శశీ, మనం తెల్లవారేవరకు యిక్కడే గడిపేయటం మంచిది! ఆటవికులు ఓపక్క. ఆ జయకర్ మనుషులు మరో పక్క నా కోసం వేటాడుతున్నారు. ఇంతవరకు ఎలాగో వాళ్ళకి దొరక్కుండా దాక్కోగలిగాం. మనం కంట బడితే నిలువునా చీల్చేసి రక్తం తాగేస్తారు. కాషస్‌గా వుండాలి!" అన్నాడు శరత్.

శశిరేఖ తలూపి, "ఇల్లాంటే మరింత ప్రమాదమేమో! వాళ్ళు ఎందుకో యిప్పటిదాకా చెట్లమీద వెతక లేదు మనల్ని! బహుశా మనకి చెట్లెక్కటం రాదని వాళ్ళ అభిప్రాయం కావొచ్చు. ఇప్పట్నుంచి వెతకటం మొదలెడితే ... ....!?" అంటూ సందేహం వెలిబుచ్చింది.

"నేలమీద తిరిగేకన్నా చెట్టుమీద రక్షణ ఎక్కువ. అఫ్‌కోర్స్ కొండచిలువలు, పాములు గురించి కాషస్‌గా వుండాలనుకో. రిస్క్ తీసుకోవాలి. తప్పదు! ...."

"మరి యీ లోపల అంకుల్‌ని వాళ్ళేమయినా చేస్తే ....!?"

"చెయ్యరు. వాళ్ళకి నాన్నగారి నుంచి యేదో ప్రయోజన ముడి వుండాలి. నా అంచనా నిజమైతే నాన్నగారు పరిశోధన పూర్తిచేసి హైదరాబాద్ వెళ్తుండగా మాయమయ్యారు కాబట్టి. ఆయన పరిశోధన వివరాల కోసం బంధించి వుంచొచ్చు. నాన్నగారు ఓ పట్టాన రహస్యాల్ని వెల్లడించరు. ఆయన చెప్పనంతవరకు క్షేమంగా వుంటారు."

"కాని శత్రువులు రాక్షస ప్రవృత్తి గలవారు. అంకుల్‌ని హింసించో, బెదిరించో ...."

"ఎస్! .... బెదిరించటానికే నన్ను జయకర్ కోసం

చేసి అక్కడికి తీసుకు వెళ్ళాడు. వాళ్ల అజాగ్రత్తను ఆసరా చేసుకుని బయటపడ్డాను....”

అతనింకా యేదో చెప్తుండగా “ఇష్....” అంది శశిరేఖ అతన్ని మాట్లాడవద్దన్నట్టు. కిందికి వేలితో సూచించింది.

శరత్ నేలమీదకు చూశాడు.

జయకర్ అనుచరు లిద్దరు తిరిగి తిరిగి ఆ చెట్టుకిందికే వచ్చారు. అందులో ఒకడు యెందుకో తలెత్తి పైకి చూశాడు.

అంతే, శశిరేఖ, శరత్‌ల గుండెలు ఝల్లుమన్నాయి.

అప్పుడు సమయం తెల్లవారుఝామున మూడున్నరయింది.

# 16

ప్రొఫెసర్ కీర్తి తనని బంధించిన సెల్‌లో అటు యిటు తిరుగుతూ గోడల్ని, లోపల వున్న సామగ్రిని పరిశీలిస్తున్నాడు.

మట్టిని తొలిచి చేసిన సొరంగం అది! గోడలనీ చెమ్మగా అసహ్యంగా వున్నాయి. అవి కూడా మట్టివేవే ప్రత్యేకంగా కట్టించేం కాదు. భూమిలోపల జాగ్రత్తగా. తొలిచిన బిలం. ఆ బిలంలోపల తనని బంధించిన సెల్స్ లాంటివే కొన్ని విడి విడిగా గేట్లు పెట్టి విభజించారు. అంతే!

తనని ఆ సెల్‌లో బంధించేటప్పుడు పక్కనున్న సెల్స్‌ని చాలా సునిశితంగా, మెరుపువేగంతో పరీక్షించాడు కీర్తి.

తనకి ఎడంవైపునున్న సెల్‌లో ప్రొఫెసర్ జాదవ్‌ను బంధించారు. అస్పష్టంగా కనిపించినా, అతను జాదవే!

అనుమానంలేదు.

తనకి కుడివైపున యెవరో అందమయిన యువతి కేంప్ కాట్ లాంటి పడకమీద వయ్యారంగా పడుకొని వుంది.

ఆదే విధంగా తమ కెదురుగా మరో మూడు సెల్స్ వున్నాయి. ఓ దానిలో యిద్దరు వ్యక్తులు విశ్రాంతిగా పడుకొని వున్నారు. ఒకడి కాలికి కట్టు కట్టబడి వుంది. రెండో వాడి చేయికి మణికట్టునుంచి కట్టుకట్టివుంది. దాన్ని మెళ్ళోని జోలెలో పెట్టుకుని పడుకున్నాడు. బహుశా ఆ యిద్దరూ గాయపడి వుండాలి, అనుకున్నాడు కీర్తి.

అతని మేధస్సు తీవ్రంగా పనిచేస్తోంది. జేబు నుంచి రెండంగుళాల నైఫ్ తీశాడు. దాన్ని అరచేతిలో పెట్టుకొని గోడ దిగువ భాగంలో మెల్లగా రంధ్రం చేయసాగాడు.

అయితే పరిసరాల్ని వేయి కళ్ళతో పరిశీలించి చూస్తూనే వున్నాడు. తలుపుదగ్గిర కొంతసేపు ఆగి చుట్టూ పరికించి చూసి మళ్ళీ తన కార్యక్రమాన్ని కొనసాగిస్తూ వచ్చాడు

గోడ పెద్దగా బలంగా లేదు. త్వరలోనే ఓ అంగుళం వ్యాసార్థంతో ఓ చిన్న రంధ్రం ఏర్పడింది. కోటు జేబు నుంచి 'స్ట్రా' సైజులో వున్న సన్నపాటి కాగితం గొట్టాం తీశాడు. దాన్ని ఆ రంధ్రంగుండా అవతలి గదిలో వున్న జాదవ్ కి పంపించాడు.

కొద్ది నిమిషాల తర్వాత అట్నుంచి మళ్ళీ ఆ కాగితం గొట్టం కీర్తికి అందింది. అతను ఆత్రంగా గొట్టాన్ని విప్పి నేలమీద పరిచాడు. దానిమీద ప్రొఫెసర్ రాసిన అక్షరాలు చదువుకున్నాడు.

ఆ తర్వాత దాన్ని ముక్కలుగా చించి, మంచినీళ్ళు నిలవున్న కూజాలో పడేశాడు.

మళ్ళీ గేటుదగ్గరకొచ్చి కొద్ది నిముషాలు నిల్చున్నాడు. తన సెవరేనా గమనిస్తున్నారేమోనని పరిశీలనగా యెదురుగా వున్న మూడు సెల్స్‌వైపు చూశాడు.

సరిగ్గా తన కెదురుగా వున్న సెల్లో విల్సన్, తనని ట్రాప్ చేసిన అతని ఇద్దరు సహచరులు తీరిగ్గా కూచుని మందు సేవిస్తున్నారు. కుడివైపు సెల్లో జాఫ్రీ, జాన్ గాఢనిద్రలో వున్నారు. ఎడమవైపు సెల్‌లో యేమున్నదీ కనిపించటంలేదు.

ప్రొఫెసర్ కీర్తి ఓ మూలగా నుంచొని షూ సోల్ నుంచి పొడవాటి రేడియో ఏరియల్ వంటి తీగను బయటికి లాగాడు. దాని చివర బోలుగా వెడల్పుగా మైక్ లాగా వున్నది. దానిదగ్గర నోరుపెట్టి.

"హాలో....హాలో....ప్రొఫెసర్ కీర్తి హియర్.... ప్రొఫెసర్ కీర్తి హియర్...." అంటూ మెసేజ్ స్టార్ట్ చేసి రెండు నిమిషాలేదో మాట్లాడి ఏరియల్‌ని మళ్ళీ యధాప్రకారం సోల్ లోపలికి మడిచేశాడు కీర్తి.

తర్వాత గేటు దగ్గర కొచ్చి బయటకి తొంగి చూశాడు.

సరిగ్గా అప్పుడే గేటుతాళం తీసుకుని జయకర్ లోని కొచ్చాడు. అతని వెనుకనే విల్సన్ పొడవాటి నైలాన్ తాడు తీసుకొని లోపలకొచ్చాడు.

మరుక్షణం వాళ్ళిద్దరూ ప్రొఫెసర్ కీర్తిని వెడరెక్కలు విరిచి కట్టి లోపలున్న బండరాయికి బంధించారు.

"వాటీజ్ దిస్....? యెందుకు నన్ను బంధిస్తు

న్నారు?....” అడిగాడు ప్రొఫెసర్ కీర్తి అయోమయంగా.

“మై డియర్ సి.ఐ.డీ! నీ ధోరణి నాకు మొదట్నుంచీ అనుమానంగానే వుంది. అందుకే నా అనుమానం కన్ఫర్మ్ చేసుకోవటంకోసం నిన్ను బంధించకుండా ఫ్రీగా వదిలేశాను. నీ చర్యల్ని పక్కగదిలోనుంచి పరీక్షగా చూస్తూన్నాను, నీకు తెలియకుండా. ఈ పక్కగదిలో నే నేనుంటున్నానన్న విషయం నీకు తెలియదు బహుశా. అందుకే తగిన జాగ్రత్తలు తీసుకోకుండా అశ్రద్ధగా ప్రవర్తించావు.

నువ్వు గోడ నుంచి రంధ్రం చేయటం, ప్రొఫెసర్ జాదవ్ కి సందేశం పంపించటం, అతను నీకు జవాబు పంపించటం అన్నీ స్పష్టంగా చూశాను. అంతేకాదు. నువ్వు నీ షూ సోల్లో అమర్చివున్న వైర్లెస్ ద్వారా పోలీసులకి మెసేజ్ పంపటం కూడా చూశాను.

ప్రొఫెసర్ జాదవ్ ని విడిపించటానికి, ప్రొఫెసర్ కీర్తి వేషంతో హైద్రాబాద్ వెళ్తున్నట్టు నటించి మా వాళ్ళు నిన్ను ట్రాప్ చేసినప్పుడు యేమాత్రం ప్రతిఘటించకుండా లొంగిపోయి బుద్ధిగా యిక్కడికొచ్చేశావు.

“రాగానే విల్సన్ నాకు నీ సంగతి చెప్పాడు. అందుకే నీ గురించి చాలా జాగ్రత్తగా అబ్జర్వ్ చేస్తూ వచ్చాం—నేను, విల్సన్ కూడా. నే ననుమానించిందే నిజమైంది. నువ్వు పోలీసుల తరఫున వచ్చిన సి.ఐ.డీ. వని అర్థమైపోయింది” అన్నాడు జయకర్ కీర్తి వంక తీవ్రంగా చూస్తూ.

"నీ పేరేమిటి, పోలీసుల తరఫున రావటమేమిటి? నేను సి.ఐ.డి. నని ఎందు కనుకొంటున్నావు? అయామ్ ప్రొఫెసర్ కీర్తి ..."

"స్టాపిట్!" అంటూ వేగంగా దూసుకొచ్చి, కీర్తి మీసాలు గడ్డం లాగేశాడు జయకర్. అవి ఊడి అతని చేతిలోకి వచ్చాయి.

"డిటెక్టివ్ కిరణ్!...." అన్నాడు జయకర్ కొద్దిపాటి సంభ్రమంతో.

"అరె, ఎంత జాగ్రత్తగా కీర్తిని అనుకరిస్తూ మేకప్ చేసుకున్నావు మై డియర్ డిటెక్టివ్! హేట్సాఫ్ టు యూ! నువ్వెవరో సి.ఐ.డి.వి అయివుంటావనుకున్నాను గాని, డిటెక్టివ్ కిరణ్ వని ఈ క్షణమే తెల్సుకోగలిగాను. రియల్లీ వండ్రఫుల్!

రేపు తెల్లారేసరికి నిన్ను పోలీసులకి కానుకగా పంపా లనుకున్నాను. కాని ఇంతలోనే నువ్వే పోలీసులకి కబురు పంపావు. ఇంకొద్ది నిమిషాల్లో వాళ్ళొచ్చేస్తారని మాకు తెలుసు. ఈ లోపల నీ ప్రాణాలని శరీరం నుంచి వేరు చెయ్యటం చాలా అవసరం. దేవుణ్ణి తల్చుకో!" అంటూ పకపక నవ్వాడు జయకర్.

అతని చేతిలో నిగనిగ మెరుస్తున్న రివాల్వర్ సూటిగా డిటెక్టివ్ కిరణ్ గుండెలకు గురి చేయబడి ఉంది.

జయకర్ రివాల్వర్ సేఫ్టీ కాచ్ తప్పించాడు.

డిటెక్టివ్ కిరణ్ నిశ్చలంగా నిల్చుండిపోయాడు.

## 17

జయకర్ అనుచరుడు సూటిగా శరత్ వంక చూశాడు. పక్కనే వున్న శశిరేఖ కూడా అతని దృష్టిలో పడింది.

పక్క అనుచరుడికి సైగ చేశాడు.

మరుక్షణం ఇద్దరు రైఫిల్స్ శరత్ కి గురి చేసి, "వెంట నే కిందికి దిగిరా. లేకుంటే నిర్దాక్షిణ్యంగా ఇద్దర్నీ కాల్చేస్తాం..." అన్నాడు మొదటివాడు.

శరత్ మనస్సు తీవ్రంగా ఆలోచిస్తోంది. ఈ ప్రమాదం నుంచి తప్పించుకోవట మెలాగా అని ఆలోచిస్తూనే శశిరేఖను దిగమని సైగ చేసి, తను ఊడలను పట్టుకుని కిందకి జారాడు శరత్. తర్వాత చేతులు చాచి జాగ్రత్తగా శశిరేఖను దించాడు.

అనుచరు లిద్దరూ వాళ్ళిద్దరి వంకా రైఫిల్స్ గురిచూసి పట్టుకున్నారు. "ఏరా, మమ్మల్ని తప్పించుకుని యెంత దూరం పారిపోగల ననుకున్నావు? పద, నీ సంగతి యీ క్షణమే తేలిపోతుంది" అన్నాడొకడు.

రెండోవాడు రైఫిల్ మొదటివాడి కిచ్చి కళ్ళతోనే సంకేతా లిచ్చి చటుక్కున శశిరేఖను పట్టుకుని పొదల చాటుకు లాక్కుపోసాగడు. శశిరేఖ గింజుకున్నది. కేకలు పెట్టింది. శరత్ వంక జాలిగా, నిస్సహాయంగా చూసింది.

శరత్ రక్తం ఉడికిపోయింది. తను చూడబోతే నిరాయుధుడు. ఎదురుగా రైఫిల్ తనకి గురిచేసి యే క్షణంలోనైనా కాల్చెయ్యటానికి సిద్ధంగా వున్నాడు మొదటివాడు. అలా అని చూస్తూ చూస్తూ ఆ దురాత్ముడు శశిరేఖను నాశనం చేస్తుంటే యెలా సహించగలడు?

బతికితే యిద్దరూ బతకాలి, లేకుంటే యిద్దరూ చావాలి! ఆదేదో ఆమె మానం మంటగలవక ముందే జరగాలి!

అప్పటికే రెండవవాడు శశిరేఖను పొదల చాటుకు లాక్కుపోయి నేలమీద పడేశాడు. శశిరేఖ హృదయ విదారకంగా అరుస్తోంది.

మరి కొద్ది క్షణాల్లో ఆమె శీలం నాశనమైపోతుం దనగా శరత్ ఎగిరి మొదటివాడి గుండెల మీద తన్నాడు. ఊహించని దాడి ఎదుర్కోవటానికి సిద్ధంగా లేని మొదటివాడు,శశిరేఖ ఊహాల్లో మునిగిపోతుండగా శరత్ తన్నిన తాపుకు వెల్లకిలా పడిపోయాడు. రెండవ వాడిచ్చిన రైఫిల్ ఎగిరి దూరంగా పడింది.

ఆ క్షణాన్ని చాలా బాగా సద్వినియోగం చేసు కున్నాడు శరత్. ఒక్క అంగలో అటు దూకి కిందపడ్డ రైఫిల్ అందుకుని మొదటివాడికి గురిచూసి కాల్చేశాడు. కిందనుంచి లేచి శరత్ ని కాల్చబోయిన మొదటివాడు పూర్తిగా లేవకుండా మధ్యలోనే చావుకేక పెట్టి విరుచుకు పడిపోయాడు.... మరోసారి వాడ్ని కాల్చాడు శరత్.

వాడు మళ్ళీ లేవలేదు. శరత్ ఒక్క పరుగున వాడిని సమీపించి వాడి చేతిలోని రైఫిల్ అందుకున్నాడు. అది లోడ్ అయివుందో లేదో చూసుకున్నాడు. అంత క్రితం ఉపయోగించిన రైఫిల్ కింద పడేశాడు.

తన సహచరుడు పెట్టిన చావుకేకకు అదిరిపడ్డ రెండవ వాడు శశిరేఖను అలాగే వదిలేసి ఒక్క పరుగున పొదల చాటునుంచి బయటికొచ్చాడు.

శరత్ శరవేగంతో రెండుసార్లు వాడిని కాల్చాడు. మొదలు విరిగిన చెట్టులా నేలమీద కూలిపోయాడు రెండవవాడు.

శశిరేఖ దగ్గరకు పరుగెత్తాడు శరత్. జరగబోయిన

ఘాతుకానికి, తుపాకీగుళ్ళ శబ్దానికి బాగా బెదిరి పోయి. గజ గజ వణికిపోతోంది శశిరేఖ. ఆమెను దగ్గరకు తీసుకుని వెన్ను నిమిరి, జారిపోయిన ఆమె చీరను కట్టబెట్టి "ఏడవకు శశీ! నీకేం కాలేదు. వాళ్ళిద్దరు చచ్చారు" అన్నాడు శరత్.

శశిరేఖ స్వాంతన పడింది. చీరను సమంగా కట్టుకుని ఒక్కసారిగా అతన్ని లతలా అల్లుకుపోయి భోరుమని ఏడ్చింది.

శరత్ ఆమెను ఊరడించి, "ధైర్యం తెచ్చుకో! మనం వెంటనే సారంగబిలం చేరుకోవాలి. ఈ పాటికే తుపాకీ మోతలు ఆటవికుల చెవిన పడివుంటాయి. వాళ్ళు శబ్దం వినిపించిన దిక్కుగా పరుగెత్తుకొస్తారు. మనం దొరికిపోతాం. వాళ్ళ దగ్గర వాడి బాణాలు, శూలాలు వున్నాయి క్షణాలమీద నుగ్గునూచగా చేసెయ్యగలరు. కమాన్, ఈ తుపాకీ నువ్వుంచుకో. షూటింగ్ రాక పోయినా ఫర్వాలేదు. చేత్తో పట్టుకుని శత్రువులను బెదిరించవచ్చు. బుల్లెట్స్ వీళ్ళిద్దరి దగ్గర వుండివుంటాయి. రెండూ లోడ్ చేసి వుంచుతాను. నా దగ్గర తుపాకీలో రెండు గుళ్ళు ఖర్చయిపోగానే నీ దగ్గరున్న తుపాకీ అందించాలి, తెలిసిందా?"

అంటూ సమాధానం కోసం యెదురుచూడకుండా చకచక అనుచరు లిద్దరి దుస్తుల్లోను భద్రపరచిన తూటాలు తీసి జేబుల్లో పోసుకున్నాడు.

సరిగ్గా అదే సమయానికి దూరం నుంచి అటే పరుగెత్తుకొస్తున్న ఆటవికుల్ని వారి కాగడాల జాడనిబట్టి గుర్తించాడు శరత్.

"కమాన్, హరియప్! వాళ్ళొచ్చేస్తున్నారు. మనం

వెంటనే సారంగ బిలం చేరుకోవాలి. నాతో సమంగా పరుగెత్తు" అంటూ ఆమెను తొందర పెడుతూ సారంగ బిలంవైపు పరుగుతీశాడు శరత్. అతనితో సమంగా పరుగెత్తలేక అవస్థ పడుతూ అతన్ని అనుసరిస్తోంది శశిరేఖ.

అప్పటికి తెల్లవారటానికి యెంతో సమయంలేదు— తూర్పున తొలి రేఖలు విచ్చుకోవటానికి సిద్ధంగా వున్నాయి.

శశి పరుగెడుతూనే వాచీ చూసుకొంది.

అయిదు గంటల పదినిమిషా లయ్యింది.

## 18

"ఆగు!" అరిచాడు డిటెక్టివ్ కిరణ్.

జయకర్ ట్రిగ్గర్ మీది నుంచి వేలిని పక్కకు జరిపి యేమిటన్నట్టు చూశాడు కిరణ్ వంక.

"నన్ను చంపటంవల్ల నీ కేమిటి ప్రయోజనం?" అన్నాడు కిరణ్ తాపీగా. ఎలాగయినా జయకర్‌ను మాటల్లో పెట్టాలని చూశాడు. మరోపక్క తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. తను జేబులో దాచుకున్న రివాల్వర్ అంతక్రితమే విల్సన్ తీసి పడేశాడు. ఎలాంటి ఆయుధమూ లేకుండా చూసుకుని సంతృప్తి పడ్డాకనే సెల్‌లో స్వేచ్ఛగా వదిలేశారు. కావాలనే తనని కీర్తిగా నమ్మినట్టు నాటకమాడారు. అందుకే తను కూడా తన పేరు బయటకు ఉచ్చరించకుండా ప్రొఫెసర్ కీర్తి పేరుమీదే మెసేజ్ పంపాడు.

అయినా దొరికిపోక తప్పలేదు. ఇప్పుడు ప్రొఫెసర్ జాదవ్ ప్రాణాలు తన చేతిలో వున్నాయి. తను లేక పోయాక అతని ప్రాణాలను రక్షించేదెవరు? ప్రభుత్వం

తనమీద పెట్టిన గురుతరమైన బాధ్యతని నెరవేర్చకుండా నిరర్థకంగా చావటమా? అందునా ఓ దేశద్రోహి చేతిలో.... నెవ్వర్. ప్రొఫెసర్ని రక్షించి తీరతాడు. అతని ఫార్ములా యీ స్వార్థపరుడి చేతికి చిక్కకుండా చేస్తాడు

కిరణ్ మనసులో చెలరేగుతున్న సంక్షోభాన్ని గుర్తించినట్టే జయకర్ ఫెళ్ళున నవ్వి, "డియర్ కిరణ్, ఎందుకిలా చీప్ ట్రిక్స్ ప్రయోగించాలని చూస్తావు నామీద? నన్ను మభ్యపెట్టి నామీద దెబ్బతియ్యాలనో లేక తప్పించుకోవాలనో నీ అభిప్రాయం. నాకు తెలియదనుకోకు!" అన్నాడు.

అతని చెయ్యి రివాల్వర్ మీద బిగుసుకుంది. ట్రిగ్గర్ నొక్కబోయాడు మళ్ళీ.

కిరణ్ పెద్దగా నవ్వి, "మిస్టర్, నువ్వు రివాల్వర్ పేల్చిన మరుక్షణం యీ సొరంగం అమాంతం కూలి నేలమట్టమై పోతుంది. నేను లోపలికొచ్చే సమయంలోనే సల్ఫర్ సంబంధమైన గ్యాస్ సిలిండర్ని బిల ద్వారం దగ్గర ఎవరూ చూడకుండా వదిలిపెట్టి వచ్చాను. సరిగ్గా గంట తర్వాత అది లీక్ అయ్యేలా దాని నాబ్ తిప్పి పెట్టి వుంచాను. కేవలం అరడుగు పొడవు అంతే వెడల్పు వున్న ఆ పెట్టెలో ఆ సిలిండర్ని అమర్చి నా వెంట తెచ్చుకున్నాను.

కావాలంటే వెళ్ళి చూసుకో, అది లీక్ అవటం మొదలెట్టి అరగంటయింది. స్పార్క్ వచ్చిన వెంటనే లిక్విడ్ పెట్రోలియం గాస్ కన్న వేగంగా మండుతుంది. మరుక్షణం ఫెళ ఫెళారావాలతో నీ సొరంగం పేలి పోతుంది" అన్నాడు.

జయకర్‌తో బాటు అక్కడున్న వారందరూ అదిరి పడ్డారు. అప్పుడు గుర్తించారు వాళ్ళు గాల్లో తేలి వస్తూన్న గంధకం వాసనని. కిరణ్ అబద్ధం చెప్పటం లేదని వాళ్ళకర్థమైపోయింది.

విల్సన్ బిలద్వారం దగ్గరకు పరుగెత్తుకొని వెళ్ళాడు. అక్కడ అతనికెలాంటి చెక్క పెట్టెగాని, సిలిండర్ గాని కనిపించలేదు. ఆ గంధకం వాసన కిరణ్ తన షూస్ అడుగున దాచిన గంధకం గ్యాస్ ట్యూబ్స్‌ని నొక్కి సృష్టించిన విషయం యెవరూ గుర్తించలేరు.

సరిగ్గా అలాంటి క్షణంలోనే కిరణ్ అయోమయంగా నిల్చున్న జయకర్ వైపు అతని తలమీదుగా చూసి, "వెల్ డన్ మిస్టర్ విల్సన్!" అన్నాడు.

జయకర్ అప్రయత్నంగా వెనుతిరిగి చూశాడు. అప్పటివరకు కిరణ్ ఖాళీగా నించోలేదు. తన చేతిలో వున్న రెండంగుళాల నైఫ్‌తోను జాగ్రత్తగా చేతి బంధనాలని కోసేసుకున్నాడు. కాళ్ళ బంధనాలు మాత్రం మిగిలిపోయాయి. బండకు కట్టిన కట్లను చేతుల్తో వెనుక నుంచే విప్పేసుకున్నాడు.

జయకర్ వెనక్కి చూసిన క్షణంలోనే యెగిరి అతని గుండెలమీద తన్నాడు కిరణ్. జయకర్‌తో బాటు కిరణ్ కూడా నేలమీద చాపచుట్టలా పడిపోయాడు. నేలమీద పడిన రివాల్వర్‌ని కిరణ్ అందుకొని ముందుగా కాళ్ళకు గురిచేసి కాల్చుకున్నాడు. బంధనాలు తెగిపోయాయి.

సరిగ్గా అదే క్షణంలో బిలద్వారం దగ్గరకు వెళ్ళి సిలిండర్ లేకపోవటం గుర్తించిన విల్సన్ వెనుతిరిగి వస్తూ జేబునించి రివాల్వర్ పైకితీయబోయాడు. అయితే అతని ప్రయత్నం సగంలో వుండగానే కిరణ్ రివా

ల్వార్ రెండుసార్లు గర్జించింది.

విల్సన్ అమాంతం పడిపోయాడు. విల్సన్‌తో తాగి తందానాలాడుతున్న అతని సహచరులు బయటకి రాకుండా వాళ్ళున్న సెల్ తలుపు బయటనుంచి గడియ పెట్టేశాడు కిరణ్.

కిందపడ్డ జయకర్ లేచేలోపల అంతా క్షణాలమీద జరిగిపోయింది.

కిరణ్ సూటిగా జయకర్ గుండెలకు రివాల్వర్ గురి పెట్టి, "మిస్టర్ ....నువ్వు వెంటనే లొంగిపో! లేకుంటే నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాను" అన్నాడు.

సరిగ్గా అదే సమయంలో వెనకనుంచి ఓ సన్నటి స్వరం గంభీరంగా గర్జించింది. "మిస్టర్ కిరణ్, రివాల్వర్ కిందపడేసి చేతులు పైకెత్తు" అని.

కిరణ్ చురుగ్గా తలతిప్పి చూశాడు.

తన ఎడమపక్క రివాల్వర్ సూటిగా తన గుండెలకు గురిచేసి నిల్చుంది షమీమా, జయకర్ ప్రియురాలు.

కుడిపక్కకు తలతిప్పి చూశాడు.

జాఫ్రీ, జాన్ తుపాకులు తనవైపు గురిచేసి నవ్వుతున్నారు వ్యంగ్యంగా. గాయపడి, నిద్రపోతున్నారని వాళ్ళని అలక్ష్యం చేసినందుకు ఒక్కక్షణం పశ్చాత్తాపపడ్డాడు కిరణ్.

తను చేయి కదిపితే ఒకేసారి మూడు తూటాలు తన గుండెల్లో దూరి రక్తాన్ని చవిచూస్తాయని అతనికి తెలుసు.

కిరణ్ మౌనంగా నిల్చుండిపోయాడు పరిస్థితి నెదుర్కొటానికి పథకం వేస్తూ.

# 19

"వాళ్లు బాగా దగ్గరయ్యారు. ఇంకా ఎంత దూరం?" అన్నది శశిరేఖ పరుగెడుతూనే గుసగుసగా!

"వచ్చేశాం. రాత్రి సమయంలో చూశాను దారి. మరచిపోయినట్టున్నాను. అయినా కొన్ని బండ గుర్తులు పెట్టుకున్నాను. వాటి ఆధారంగానే వెళ్తున్నా మిప్పుడు" అన్నాడు శరత్.

సరిగ్గా అదే సమయంలో అతని చెవిపక్కనుంచి ఓ బాణం దూసుకొని అంత దూరాన చెట్టుకి గుచ్చుకొంది. ఇద్దరు అదిరిపడ్డారు.

"ఈ ఆటవికులు బాణాలు సంధించటంలో అఖండులా వున్నారు. బాణాలు వెయ్యటం మొదలెట్టారు. చూశావుగా అంత బలమైన వేగంగా పరుగెత్తగల చిరుతపులిని తూట్లు పొడిచి చంపేశారు వీళ్ళు. వీళ్ళ గురికి తిరుగులేదు. మరికాస్త వేగంగా పరుగెత్తు" అన్నాడు శరత్.

సరిగ్గా అప్పుడే మరో బాణం శశిరేఖకు అతి సమీపం నుంచి దూసుకుపోయి పొదల్లో పడింది.

ఇద్దరికి ఆయాసంతో అడుగు ముందుకు పడటంలేదు. అయినా మొండి ధైర్యంతో ముందుకు పరుగెడుతూనే వున్నారు. ఓ పక్క ముళ్ళకంచెలు, రాళ్ళు రప్పలు గీచుకొని బాగా గాయాలయినాయి. రక్తం ధారలు కడుతోంది.

పరుగు.... పరుగు.... ఒకటే పరుగు.

"అదిగో బిలద్వారం కనిపిస్తోంది ఆ బండరాయి బయటకి మామూలు రాయిలా కనిపిస్తూన్నా, అదే సొరంగ ద్వారానికి అడ్డుగా మూయబడిన ద్వారం!"

అన్నాడు శరత్ ఆనందంగా. శశిరేఖ పరకించి చూసింది.

బండరాయి కనిపించింది. చాలా పకడ్బందీగా అమర్చారు రాయిని.

ఈలోపల మరో రెండు బాణాలు దూసుకొచ్చాయి కాని వాళ్ళిద్దరిలో ఎవరినీ గాయపరచలేదు.

శరత్ ఒక్క గెంతున బండరాయి దగ్గరకు ఉరికి పక్కకు తొలగించాడు. అదే సమయానికి శశిరేఖకూడా అతనితో బిలంలోనికి ప్రవేశించింది. బండరాయిని మామూలుగా సర్దేశారు.

అయితే లోపలి దృశ్యాన్ని చూసి శరత్, శశిరేఖ నిర్ఘాంతపోయి నిల్చుండిపోయారు కొద్ది క్షణాలవరకు. తరువాత కర్తవ్యం గుర్తువచ్చి శరత్ తన చేతిలోని గన్ రెండుసార్లు కాల్చాడు.

## 20

కిరణ్ క్షణాల్లో నిర్ణయం తీసుకున్నాడు.

"మిస్. నీ ప్రియుడు నీకు దక్కాలంటే నామీద గురిచేసిన ఆ యిద్దరు మనుషుల్ని గన్స్ కిందపడెయ్యమని చెప్పు. బుద్ధిగా వాళ్ళిద్దర్నీ ఇతని పక్కకొచ్చి నిల్చోమను. నువ్వుకూడా రివాల్వర్ నేలమీద పడేసి యిక్కడకొచ్చి నిలబడు" అన్నాడు కిరణ్ షమీమా వంక చూస్తూ.

షమీమా విరగబడి నవ్వింది. "అతన్ని చంపేయాలనుకుంటే నిరభ్యంతరంగా చంపెయ్యి. నాకేం బాధ లేదు" అన్నది.

జయకర్ దిగ్భ్రమతో చూశాడామెవంక "షమీ!" అంటూ అరిచాడు.

కిరణ్ నవ్వి, "ఎందుకలా అరుస్తావ్ మిస్టర్ అఖ్తర్. ఆమె నిన్ను నమ్మినట్టు నాటకమాడి తనే ఇంటర్నేషనల్

బిజినెస్ నడుపుతోంది. ఆ విషయం నీకన్నా మాకే బాగా తెలుసు.

నువ్వు గతంలో అనేక పేర్లతో అనేకమంది సైంటిస్టుల్ని మోసగించి ఈ దేశం సాధించిన విజయాల్ని పరాయి దేశాలకు అమ్మి బాగా సొమ్ము చేసుకొని, ఆ సైంటిస్టుల్ని చంపేశావు. నీ అసలు పేరు అఖ్తర్ అనీ, మొన్నటి బస్ ప్రమాదం వెనక నీ చెయ్యి వుందనీ పోలీసులకి రూఢిగా తెలిసింది. ఆ బస్‌లో ప్రొఫెసర్ జాదవ్ వున్న విషయం తెలిశాక ఖచ్చితంగా నువ్వే జాదవ్‌ని అపహరించి వుంటావని అనుమానించింది ప్రభుత్వం.

అది కనిపెట్టడానికే ప్రొఫెసర్ కీర్తి వేషంలో నేను బయల్దేరాను.

ప్రొఫెసర్ కీర్తి ఇంటి దగ్గర్నుంచి అతని వేషంలో నేను హైదరాబాద్ బయల్దేరాను. నిజానికి కీర్తి పరిశోధన యింకా ముగియలేదు. ముగిసినట్టు పత్రికల్లో నేనే ప్రకటనలు యిచ్చాను. ఫలాని రోజున గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో కీర్తి బయల్దేరుతున్నట్టు కూడా ప్రకటన యిచ్చాను.

అది చూసి నువ్వు రంగంలోకి దిగుతావని నాకు తెలుసు. నీ బదులు నీ ఏజెంట్ విల్సన్ దిగాడు. కావాలనే నేను వాళ్ళు నన్ను చుట్టుముట్టగానే ప్రతిఘటించకుండా లొంగిపోయాను. నీ వాళ్ళు మహదానందంగా వేన్‌లో జాగ్రత్తగా నన్ను నీ స్థావరానికి తీసుకొచ్చారు. నేను వేసిన పథకం అక్షరాలా అమలు జరిగింది.

నీ ఫోటో గతంలో నేను చూసి వుండటంతో నువ్వే

ఆ ఖుర్ అని మొదటి చూపులోనే గ్రహించాను. నీతో బాటు షమీమా అనే స్త్రీ కూడా వుందనే విషయం కూడా ముందుగానే మాకు తెలుసు. నీవు మారు పేర్లు పెట్టుకున్నా ఎందుకో ఆమెది మాత్రం సొంత పేరునే వుంచేశావు—బహుశా యెవరికీ బయట కనిపించదని నీ నమ్మకం కాని, ఆ నమ్మకం మట్టిపాలు చేస్తూ ఆమె నీమీద తిరగబడింది. నీ అనుచరులందరు ఆమెకు దాసాను దాసులు...."

కిరణ్ యింకా ఏదో చెప్పబోతుండగా షమీమా మీదికి మెరుపు వేగంతో దూకాడు జయకర్ ఉరఫ్ ఆ ఖుర్.

షమీమా ఊహించని విధంగా అతన్ని గురిచూసి కాల్చింది. మరుక్షణం జాఫ్రీ, జాన్ కూడా జయకర్ని కాల్చారు.

తనవాళ్ళనుకున్న వాళ్ళే వెన్నుపోటు పొడిచినందుకు నమ్మశక్యం కానట్టు పిచ్చిగా వాళ్ళ ముగ్గుర్నీ చూస్తూ నెత్తుటి మడుగులో గిలగిల తన్నుకొని ఆఖరి శ్వాస విడిచాడు ఆ ఖుర్.

షమీమా విరగబడి నవ్వింది.

"శభాష్ జాన్ అండ్ జాఫ్రీ! మీ ఇద్దరికీ స్పెషల్ అవార్డిస్తాను త్వరలో" అంటూ ప్రశంసించింది షమీమా.

జాన్, జాఫ్రీ. ఆనందంగా చూశారామె వంక. "థాంక్యూ మేడమ్!" అన్నారు.

"ఓ.కే. దెన్ మిష్టర్ కిరణ్ నీ ఆఖరి క్షణాలు దగ్గరపడ్డాయి. ఆ ఖుర్ కి బదులు నా చేతుల్లో నీ చరిత్ర ముగియబోతోంది. తీరికూచుని సింహం బోనులో తల దూర్చావు. నువ్వు అడ్డుతొలగిపోతే ఆ ప్రొఫెసర్

ఫార్ములాని క్షణాలమీద మా వశం చేసుకోగలమనే నమ్మకం నాకుంది" అంటూ ట్రిగ్గర్ నొక్కబోయింది షమీమా.

సరిగ్గా అదే క్షణంలో షమీమా చేతిలోని రివాల్వర్ ఎగిరి అవతల పడింది. మరో గుండుదెబ్బ సూటిగా ఆమె కపాలంలోనించి దూసుకుపోయింది.

కిరణ్ తో బాటు అందరు అదిరిపడి బిలద్వారం వైపు చూశారు.

అక్కడ శరత్, శశిరేఖ నిల్చుని వున్నారు.

శరత్ చేతిలోని గన్ అప్పుడే శశిరేఖ చేతుల్లోకి మారింది. ఆమె చేతిలోని లోడ్ అయిన గన్ మళ్ళీ శరత్ చేతుల్లోకి వచ్చింది.

జాన్, జాఫ్రీ గురి ఒక్కసారిగా శరత్ మీదికి తిరిగింది. అయితే ప్రమాదాన్ని ముందే ఊహించిన కిరణ్ వాళ్ళ గురి తనమీదిమంచి తిరగ్గానే ఎగిరి వాళ్ళిద్దరి మీదకు దుమికాడు.

టపటపమంటూ గుళ్ళు పక్కకు పేలిపోయి జాన్, జాఫ్రీ నేలమీద దొర్లిపడ్డారు. అదే సమయానికి శరత్ చేతిలోని గన్ మరో రెండుసార్లు గర్జించింది. ఈలోపల షమీమా రివాల్వర్ ని కిరణ్ అంది పుచ్చుకున్నాడు. శశిరేఖ తన చేతిలోని గన్ ని చకచక లోడ్ చేసింది.

నేలమీదపడ్డ జాఫ్రీ. జాన్ మరి లేవలేదు. అయితే ఊహించని రీతిలో కిరణ్ వెన్నున చల్లగా తుపాకీ బారెల్ గుచ్చుకుంది. ఉలిక్కిపడి వెనక్కు తిరగబోయాడు కిరణ్.

వెనకనుంచి కర్కశంగా వినిపించింది. "కదలకు మిస్టర్, నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాం" అని.

శరత్ తుపాకీ ఎత్తబోయాడు. కాని అతని చేతిలోని గన్ ఎగిరి అంత దూరంలో పడింది. విల్సన్ సహచరులిద్దరు యెప్పుడు తలుపు తెరచుకొని బయటకొచ్చారో తెలీదు. ఇద్దరి చేతుల్లోను రెండు గన్స్ వున్నాయి. ఒకటి కిరణ్ వెన్నుకి గురిపెట్టబడి, రెండోది శరత్, శశిరేఖలకు గురిపెట్టబడి వున్నాయి.

కిరణ్ శత్రుశేషాన్ని మిగిల్చినందుకు ఒక్క క్షణం పరితపించాడు. విల్సన్‌తో పాటు తనని ట్రాప్ చేసిన యిద్దరు సహచరులు వాళ్ళు. వాళ్ళిద్దరు తప్ప ఆ ఖాన్ బృందమంతా నెత్తుటి మడుగులో స్నానం చేస్తోంది. వాళ్ళిద్దరు తమ ముగ్గుర్ని కవర్ చేస్తున్నారు గన్స్‌తో.

కిరణ్ యేమాత్రం ఆలస్యం చెయ్యలేదు. ఒక్కసారిగా బోర్లా నేలమీదపడి మెరుపులా వెల్లకిలా తిరిగాడు. తనకి గన్ గురిచేసిన వ్యక్తిని పూని కాళ్ళ మధ్య తన్నాడు.

అతను కయ్యోమంటూ అరుస్తూ నేలమీద పడి రెండు చేతుల్లోను కడుపు కింది భాగాన్ని ఒత్తుకుంటూ గిలగిల్లాడాడు. గన్ ఎగిరి అంత దూరంలో పడింది.

మరో అనుచరుణ్ని శరత్ పొట్టేలు కుమ్మినట్టు తలతో పొట్టలో బలంగా కుమ్మాడు. వాడు అల్లంత దూరం పోయిపడి అంతలోనే లేచి గన్‌తో శరత్‌ని కాల్చబోయాడు. అయితే కిరణ్ చేతిలోని రివాల్వర్ అతని గన్‌ని ఎగరగొట్టి కుడిచేతిని తీవ్రంగా గాయపరచింది.

వాళ్ళిద్దరు చేతులెత్తి లొంగిపోయారు.

సరిగ్గా అదే సమయానికి బిలద్వారం నుంచి బిలబిలమంటూ ఆటవికులు లోపలికొచ్చేశారు. ఈ ఉపద్రవం

తట్టుకోవట మెలాగని శరత్ నిర్ఘాంతపోయాడు. కాని వాళ్ళ వెనకనే బిలబిలమంటూ ప్రవేశిస్తున్న పోలీసుల్ని మాడగానే అతని ప్రాణం కుదుటపడింది.

ఒక్క అంగలో తండ్రిని బంధించిన సెల్ వద్దకు వెతుక్కుంటూ పరుగెత్తాడు శరత్.

ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్, అతని బృందం ఆటవికులతోబాటు చాలా మిగిలిన అఖర్ అనుచరులిద్దర్ని స్వాధీనం చేసుకున్నారు. అరో గదిలో అఖర్ అంతదాకా నడిపిన అక్రమ వ్యాపారం తాలూకు వివరాలు, విదేశీ కరెన్సీ, బంగారం పెద్ద ఎత్తున దొరికాయి. అంతేకాదు. దేశంలోని వివిధ ప్రాంతాలలో విస్తరించివున్న అఖర్ ఏజెంట్ల పేర్లు. చిరునామాలు కూడా దొరికాయి.

ఆ తర్వాత ప్రొఫెసర్ జాదవ్‌ని అడిగాడు కిరణ్.

"ఆ ఖర్ వంటి అఖండుడికి దొరక్కుండా ఎక్కడ దాచారు ఆ ఫార్ములా?" అని.

ప్రొఫెసర్ జాదవ్ నవ్వుతూ తన షర్టు కాలర్ చించి దానిలోనించి సన్నగా మడతలు పెట్టి దాచిన ఫార్ములాని బయటికి తీశాడు.

డిటెక్టివ్ కిరణ్ ప్రశంసగా అతని భుజం తట్టాడు.

—: అయిపోయింది:—

సీరియల్



• బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

నాయుడు రాఘవేంద్రరావు కళ్ళలోకి చూసి, "ఏరా ఆఫీసరూ, నామీద రివాల్వర్ గురిపెడతావా? చూడు నీ కుడిచేతికి పట్టిన దుర్గతి!?" అంటూ పట్టాకత్తితో రాఘవేంద్రరావు కుడిచేతిని మోచేతివరకూ నరికేశాడు.

కెవ్వున కేక వేయబోయి గొంతులోనే ఆపుకున్నది జ్వలిత. ఆమెకు కళ్ళముందు అంతా చీకటిగా, భయంకరంగా కనిపించింది.

రాఘవేంద్రరావు పళ్ళ బిగువున బాధను అణచుకుని యెగిరి కాళ్ళతో నాయుడి గుండెలమీద తన్నాడు. ఊహించని ఆ తాపుకు వెనక్కు విరుచుకుపడిపోయాడు నాయుడు. అయితే మరుక్షణం రెట్టించిన కోపంతో, అహంకారంతో లేచి నిలుచున్నాడు.

పట్టాకత్తితో రాఘవేంద్రరావు కాళ్ళు రెండూ నరికి వేశాడు నాయుడు.

"ఇప్పుడు తన్నరా, ఎలా తంతావో! నాయుడంటే తక్కువగా అంచనా వేశావు గదూ, అనుభవించు" అంటూ వికటంగా నవ్వాడు.

మరుక్షణం కోయ సింగడి చేతిలోని పట్టాకత్తి రాఘవేంద్రరావు మరో చెయ్యిని నరికేసింది. తక్కిన ముగ్గురు కోయవాళ్ళు రాఘవేంద్రరావు శరీరాన్ని నాలుగు ముక్కలుగా నరికేశారు!

ఈ ఘోర దృశ్యాన్ని కళ్ళారా చూసిన జ్వలితకు కోపంతోను, ఉక్రోషంతోను, విపరీతమైన దుఃఖంతోను శరీరం వణికిపోయింది. నాయుడ్ని చంపేసి, తనూ చచ్చిపోవాలని ముందుకి ఉరకబోయింది. సరిగ్గా అదే సమయంలో ఆమె పాదంమీద చురుక్కుమని కుట్టింది ఏదో! ఒకసారి కాదు మూడు, నాలుగుసార్లు!

కుప్పలా కూలిపోయింది జ్వలిత. వెంటనే ఆమెకు స్పృహ తప్పిపోయింది. స్పృహ తప్పిపోయే ముందు ఆమె కళ్ళకు ఎండుటాకులమీద జరజర పాకుతూ పోతున్న గోధుమవన్నె త్రాచు కనిపించింది. ఎనిమిది అడుగుల పొడవుంటుంది!

ఆ తర్వాతేం జరిగిందో ఆమెకు తెలియదు....

• • •

విషకన్య చెప్తున్న కథనం ఆసక్తిగా వింటున్న నవీన్ ఆమె చెప్పటం ఆపగానే ఆమె ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు.

విషకన్యగా పరిచయమైన జ్వలిత కొద్ది క్షణాలు ఏదో గుర్తుకు తెచ్చుకుంటున్నట్టు అర్ధనిమీలిత నేత్రి

అయింది. జరిగిన ఘోర సంఘటనలను అప్పుడే చూస్తు న్నట్టుగా ఆమె శరీరం రోమాంచిత మయింది.

విషకన్య చెప్పసాగింది:

“నాకు మెలకువ వచ్చేసరికి బాగా రాత్రయి పోయింది. ఒళ్ళంతా భారంగా వున్నట్టనిపించింది. పాము కాటుకి నా ప్రాణం యెందుకు పోలేదో నాకర్థం కాలేదు.

మెల్లగా లేచి కూచున్నాను. కన్ను పొడుచుకున్నా ముందున్న దృశ్యం కనిపించటంలేదు. తడుముకుంటూ అలాగే అలవాటుపడ్డ దారిలో క్వార్టర్సువైపు నడిచాను. అడవంతా నిశ్శబ్దంగా వుంది. అప్పటివరకు జరిగిన సంఘటనలు నాకు గుర్తుకు రాగానే దుఃఖం వెల్లుబికి వచ్చింది.

మా తండ్రిగారిని నామరూపాల్లేకుండా నాశనం చేసిన ఆ దుర్మార్గుల్ని నాశనం చేయాలని ఆ క్షణంలోనే దృఢంగా శపథం చేశాను. మా అమ్మని ఆ దుర్మార్గులేం చేశారోనన్న భయం ఓ పక్క, నా తండ్రి యిక లేరన్న ఘోరమైన నగ్న సత్యం ఓ పక్క మనసునుపట్టి నొక్కేస్తూంటే యెలాగో యిల్లు చేరాను.

నేననుమానించినట్టే అయింది. మా అమ్మ క్వార్టర్సులో కనిపించలేదు. ఎంత వెతికినా యే గదిలోను లేదు. ఇల్లంతా చిందరవందరగా వున్నది. నేను డెవలప్ చేసిన ఫిల్ముగాని, కెమెరాగాని కనిపించలేదు. అలాగే మా నాన్నగారి ఆఫీసు రికార్డంతా చింపి పోగులు పెట్టారు, ఎవరో!

అమ్మనికూడా వాళ్ళు చంపేసి వుంటారని గ్రహించగానే నాలో నిస్సత్తువ ఆవరించింది. అలాగే నేలమీద

కుప్పకూలిపోయి చాలాసేపు రోదించాను.

తరవాత ఎప్పటికో లేచి ముఖం కడుక్కొని యధాలాపంగా అద్దంలో చూసుకొని కెవ్వున కేకవేశాను. అద్దంలో చూస్తూన్నది నా ప్రతిరూపమేనా అన్న అనుమానం వచ్చింది. ముఖమే కాదు. నా శరీరమంతా నల్లగా మాడిపోయింది. తెల్లగా నవనవలాడుతూ ఆరోగ్యంగా కళకళలాడే నా శరీర సౌందర్యమంతా బొగ్గులా మారి పోయింది. నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను.

కారణం అప్పుడు స్ఫురించింది. నన్ను కాటేసిన పాము విషం నా శరీరంలో తెచ్చిన మార్పు అది! ప్రాణం పోవలసింది పోకపోగా, యిలా చర్మాన్ని మాత్రం నల్లబరిచి నన్ను వికృతం చేసి వదిలివందుకు నాలో నేను ఎంతగా కుమిలిపోయానో చెప్పలేను!

కాని ఒకందుకు సంతోషించాను, నా పగ ప్రతీకారం చెల్లించుకోవటానికా అన్నట్టు నా ప్రాణం మాత్రం పోలేదు!

నాయుడుమీద నా పగ తీర్చుకొని తీరతాను. నా తల్లిదండ్రుల్ని పొట్టన పెట్టుకున్న వాళ్ళందర్నీ నేనే స్వయంగా చంపి రోగులు పెడతాను. వాళ్ళ ఆత్మలకు శాంతి చేకూరుస్తాను! అని ఆ క్షణంలో నే నిర్ణయించు కున్నాను. కాని ఆడదాన్ని, నిస్సహాయురాల్ని, ఎలా యిదంతా నెరవేర్చుకోగలను?

ఆలోచిస్తున్న నేను వెనక యేదో అలికిడి కావటం గుర్తించలేదు. 'ఎవర్నువ్వు?' అంటూ వినిపించినవైపు ఛట్రున తిరిగిచూశాను. ఎదురుగా జగ్గయ్య! విశ్వాస ఘాతకుడు! మా తండ్రిని చంపటంకోసం నల్లత్రాచును ప్రయోగించిన తుచ్ఛుడు. వాడు అడిగిన ప్రశ్నను బట్టి

వాడు నన్ను గుర్తించలేదని అర్థం చేసుకున్నాను.

వాడు దగ్గరగా వచ్చి చూసి, 'నువ్వు నువ్వేనా?' అంటూ నిర్ఘాంతపోయి చూశాడు నా వైపు. నా రంగు మారినా రూపం మారలేదు. అందుకే నన్ను గుర్తుపట్టి నల్లగా వుండటం చూసి ఆశ్చర్యపోయాడు. 'నీకోసం అడివంతా గాలించాం. నిన్ను బతకనివ్వను' అంటూ బొడ్లోంచి పొడవాటి కత్తి తీశాడు. విసురుగా నామీదికి రాబోయాడు.

నేను వాడ్ని చెయ్యిపట్టి మెలితిప్పి కత్తి లాక్కో బోయాను. వాడు వదల్లేదు. మణికట్టుమీద కొరికాను.

అంతే! వాడు విలవిల్లాడుతూ నేలమీద పడి పోయాడు. అప్పటికప్పుడే వాడి శరీరం నీలిరంగుకి తిరిగి పోయింది. వాడు రెండు చేతులు జోడించి "అమ్మా, నువ్వు మనిషివి కాదు. నా పాపాల్ని శిక్షించటాని కొచ్చిన నాగదేవతవి!" అంటూ ప్రాణాలు వదిలేశాడు.

వాడి నోటిచివర్లనుండి నురుగులు! పాము కాటువేస్తే కనిపించే లక్షణాలన్నీ జక్రయ్యలో కనిపించాయి.

మొదటిసారిగా నా గురించిన నిజం తెలిసి నిర్ఘాంత పోయి నిల్చుండిపోయాను. నా శరీరం విషపూరితమై పోయింది.... నా పళ్ళలో కూడా విషం చేరిపోయింది. నా పళ్ళ కాటు పాము కాటులాగే విషపూరితం! అయితే ఆ విషం నాకు యెందుకు ప్రమాదకారి కాలేదో నాకర్థం కాలేదు. ఇది వరమా? శాపమా?

నాకు నేనే మృత్యుదేవతలా కనిపించాను ఆ క్షణంలో!

తర్వాత నాకు సంతోషమే కలిగింది. దుష్ట సంహారం చెయ్యమని దేవతలు నాకిచ్చిన వరం యీ విషం! ఈ

వికృతరూపం! సృష్టిలో ఇలాంటి విచిత్రం వుంటుందా? నమ్మశక్యం కాలేదు.

టేబిల్ మీదున్న ఆపిల్ పళ్ళను కొరికాను. వెంటనే నల్లటి గాట్లు పడ్డాయి. ఆపిల్ రంగే మారిపోయింది. ఏదైనా సందేహముంటే అది కాస్తా దాంతో తీరి పోయింది.

నా శరీరంలోని అణువణువునా విషమే నిండిపోయింది. అయినా ఫరవాలేదు. నేను బతికి సాధించేదేం లేదు — ప్రతీకారం తప్ప! అందుకే ఆ క్షణంనించీ ప్రతీకారం తీర్చుకోవటంకోసం పగ సాధించటంకోసం తీవ్రంగా కృషి చేశాను.

నాగుల కొండ అనబడే యీ లోయను నా నివాసంగా మార్చుకున్నాను. ఇంత క్రితం నువ్వు చూసిన సర్పాలన్నీ ఇక్కడ నివాసముంటున్నవే? నన్ను మొదటి సారిగా చూసి యివన్నీ నా చుట్టూ తిరిగాయే గాని నష్టం చెయ్యలేదు. నేను వీటిని మాలిమి చేసుకున్నాను. చాలా చిత్రంగా యివి నా పెంపుడు జంతువుల్లాగా నా స్నేహితులైపోయాయి.

బహుశ వాటికి నేనుకూడా ఓ సర్పంలాగా కనిపిస్తుండొచ్చు. నాలోను విషమేకదా ప్రవహిస్తున్నది!? ఉగ్రనాగు అని చెప్పబడే పెద్ద సర్పం వీటన్నిటికీ రాజులాంటిది! ఉగ్రనాగు అతి స్వల్ప వ్యవధిలోనే నాకు బాగా మచ్చికయిపోయింది. నేను చెప్పినది వెంటనే అర్థంచేసుకొని ఆచరిస్తుంది!

చింపాంజీని కూడా అలాగే మచ్చిక చేసుకొని శిక్షణ యిచ్చాను. ఇదంతా నా ప్రతీకారం తీర్చుకోవటానికే!

నువ్వు నమ్మవుగాని ఈ విషప్రాణులు మనుషులకన్న

నమ్మక మైనవి, కల్తీలేనివి. ఉగ్రనాగు చింపాంజీల సాయంతో యిప్పటివరకు నా శత్రువుల్ని చాలవరకు మట్టుపెట్టాను. నా తండ్రికి వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చిన వాళ్ళలో చాలామందిని చంపేశాను. అయితే యింకా ఆరుగురు మాత్రం మిగిలారు" అంటూ రెండు క్షణాలు ఆగింది విషకన్య.

"ఎవరు వాళ్ళు?" ఉత్కంఠ ఆపుకోలేక అడిగాడు నవీన్.

"నాయుడు, అతని డ్రైవరు, అతని అనుచరులు ముగ్గురు. సింగడి ముగ్గురు స్నేహితుల్లో ఒకడు నా కాటుకి దొరక్కుండా బ్రతికున్నారు. వీరేంద్రని తప్ప అందర్నీ నేనో, నా అనుచరులో చంపాము. సింగడ్ని కాటొడు కున్న నా అనుచరుడు యిక్కడే వున్నాడు కూడా!"

నవీన్‌కి అప్పుడు గుర్తుకొచ్చింది. సింగడు తమని చంపేలోగా పాము కాటేసింది. లేకపోతే తనని సౌమ్యని చంపేసేవాడే! అయితే ఆ సర్పం, విషకన్య అనుచర వర్గంలోనిదన్న నిజం అప్పుడే తెలిసింది!

విషకన్య చెప్పింది. "వీరేంద్రను నేనే ఒళ్ళంతా తూట్లు పొడిచి చంపాలనుకున్నాను. అయితే నిన్ను, సౌమ్యను అడవిలో చూశాక నా ఆలోచన మారింది. చిన్న మార్పు చేశాను. ఏ స్త్రీని పశుప్రవృత్తితో కామించాడో అలాంటి స్త్రీ చేతిలోనే వాడు ఛస్తే చూసి ఆనందించాలనుకున్నాను. అయితే సౌమ్యకి బదులు నీ చేతిలో చచ్చాడు. సౌమ్య కారణంగానే చచ్చాడు గాబట్టి నా కోరిక నెరవేరినట్టే!"

నవీన్ ఆమె వంక సంభ్రమంగా చూస్తున్నాడు. ఎప్పుడో చిన్నప్పుడు చదువుకొన్న కథల్లోని నాగ

కన్యలా కనిపిస్తోందామె. కాని అది కథ, యిది నిజం! నగ్న సత్యం. తను ఎవరికి చెప్పినా తనని పిచ్చివాడిలా చూస్తారు నాగరిక జనం. కాని యిది తిరుగులేని నిజం!

"మరి నాయుడు, అతని మనుషులు సింగడి స్నేహితుడు దొరకలేదా?" అడిగాడు నవీన్.

"లేదు. చిత్రమేమిటంటే నాయుడు మళ్ళీ అడవిలోకి రాలేదు. నా తల్లిదండ్రులు, నేను పులివాతపడి చనిపోయామని తీవ్రంగా ప్రచారం చేశారు పై అధికారులు, పోలీసులు వచ్చారు, వెళ్ళారు. మళ్ళీ కొత్త స్టాఫ్ వచ్చారు.

అందరూ సాక్ష్యం చెప్పిన స్టాఫ్‌నందర్నీ జక్రయ్యతో మొదలుపెట్టి నేను, నా అనుచరులు చంపేసాం కదా! అటెండర్స్ మొదలు ఆఫీసర్ దాకా అందరూ కొత్తవాళ్ళే! వాళ్ళని మంచిచేసుకున్నాక వద్దామని నాయుడు తాత్సారం చేశాడేమో ననుకున్నాను. రెండు నెలలు కావస్తున్నా నాయుడు మళ్ళీ అడవిలోకి రాలేదు. వాడి కోసమే నేను, నా వాళ్ళు వెయ్యి కళ్ళతో యెదురు చూస్తున్నాం. సింగడి స్నేహితుడు కోయగూడెంలో లేడు. ఏమయ్యాడో తెలీదు" చెప్పింది విషకన్య.

"అయితే నేను నీకేవిధంగా ఉపయోగపడగలను?" అడిగాడు నవీన్.

విషకన్య మందహాసం చేసింది. "నాయుడు గురించిన సమాచారం నువ్వు సేకరించాలి. అతనెక్కడున్నాడో, యెందుకు అడవికి రావటంలేదో కనుక్కోవాలి. అతను అడవికి వచ్చేలాగున నువ్వు సాయం చెయ్యాలి. ఏ స్పాట్‌లోనైతే వాడు, వాడి అనుచరులు నా తండ్రిని నరికి చంపారో అదే స్పాట్‌లో వాడిని, వాడి అను

చరుల్ని నేను చంపాలి! అప్పటికిగాని నా పగ చల్లారదు. నా తల్లిదండ్రుల ఆత్మలు శాంతించవు!" విష కన్య ముఖం జ్వాజ్వల్యమైన జ్యోతిలా ఎర్రగా వెలిగింది ప్రతీకార వాంఛతో.

నవీన్‌కి యిదంతా చాలా అద్భుతంగా వుంది.

"నీ కథ నన్ను కదిలించి వేసింది. నిజాయితీపరుడైన నీ తండ్రికి చాలా అన్యాయం జరిగింది. నీ కుటుంబ నాశనానికి కారకుడు నాయకుడు! అతనిపై నువ్వు నీ పగ తీర్చుకోవటం న్యాయమే! న్యాయం చెయ్యాల్సిన అధికారులు లంచగొండులై తీరని అన్యాయం చేసినపుడు చట్టాన్ని, న్యాయాన్ని నీ చేతుల్లోకి తీసుకోవటం హర్షదాయకమే!

నేను నీకు పూర్తి సహకారమిస్తాను. నీవు భయపడి, నువ్వు, నా సౌమ్యకేం చేస్తావోనని జడిసి, కాదు! మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాను. నీకెలాంటి సహాయం కావాలన్నా చెయ్యటానికి సిద్ధంగా వున్నాను" అన్నాడు.

విషకన్యకు అతని మాటలు చాలా ఆనందం కలిగించాయి. ఆ క్షణంలోనే తన పగ చల్లారినట్లు, ప్రతీకార వాంఛ నెరవేరినట్లు అపరిమితంగా సంతోషించింది.

"నా నిర్ణయం సరైనదనే ధైర్యం నీ మాటలవల్ల కలిగింది. నిన్ను, సౌమ్యను నా దారికి తెచ్చుకోవటానికి సాయపడిన చింపాంజీని అభినందించాలి! పద, నీ స్నేహితురాలు సౌమ్య నువ్వు కనిపించక తల్లడిల్లి పోతూ వుంటుంది. ఆమెను యిక్కడికి తీసుకువద్దాం! ఆ తరవాత ఏం చెయ్యాలో నేను చెప్తాను" అన్నది విషకన్య.

ఆమె తన చేతిలోని పాములను వదిలేసింది. అవి జరజర పాకుతూ ఎటో వెళ్ళిపోయాయి. అంతవరకు అక్కడక్కడే మెసిలిన సర్పాలన్నీ ఎటుపోయాయో కనిపించలేదు.

నవీన్‌కి అద్భుతంగా వుంది. ఓ మానవ స్త్రీకి విష సర్పాలు స్నేహితులుగా మెసలటం చాలా విడ్డూరమైన విషయం! పాము విషం శరీరంలోకి ప్రవేశించిన మనిషి ఆ విషంవల్ల తను నశపోకుండా ఇతరుల్ని ఆ విషంతోనే చంపగలగటం ఊహాకందని నమ్మలేని విషయం! కాని తన కళ్ళముందున్న నిజాన్ని కాదనటమెలా?

విషకన్య, నవీన్ నాగులకొండ లోయలో నుంచి ఉపరితలంమీదికి వచ్చారు. తను లోయలో పడిపోవ టానికి ముందు సౌమ్య, చింపాంజీ వుండాల్సిన స్థలానికి ఆమెతో వెళ్ళాడు.

ఎదురుగా కనిపించిన దృశ్యం చూసి నవీన్, విష కన్య నిశ్చేష్టులై నిల్చుండిపోయారు.

అక్కడ నేలమీది మొక్కలు, పచ్చిక యేదో ఘర్షణ జరిగినందుకు చిహ్నంగా బాగా నలిగిపోయి చిందరవందరగా వున్నాయి.

ఓ మూలగా చింపాంజీ వెల్లకిలా పడివున్నది. చింపాంజీ ఒళ్ళంతా రక్తసిక్తమై వున్నది. ఈ బెలతో పొడిచిన గుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. చుట్టూ రక్తం!

కాని, సౌమ్య జాడలేదు!

నవీన్ వేదనగా విషకన్య వంక చూశాడు. ఆమె చనిపోయిన తన అనుచరుడికద్ద మోగాళ్ళమీద వంగుని విచారంగా చూస్తోంది. అదీ ఒక్కక్షణమే!

ఆ తర్వాత లేచి నిల్చుని, "సౌమ్య నెవరో అపహరించుకొని పోయుంటారు. చింపాంజీ చివరి క్షణం వరకు ఆమెని రక్షించటానికి పోరాడి మరణించింది. నమ్మకస్తురైన నా స్నేహితుడ్ని క్రూరంగా చంపినవాళ్ళను వదిలిపెట్టను. వెంటాడి, వేటాడి చంపుతాను. నీ సౌమ్యని నీకు అప్పగించే పూచీ నాది! రా, నాతో!" అంటూ చకచక లోయ దగ్గరకు నడిచి, "ఉగ్రనాగూ?" అంటూ పిలిచింది విషకన్య.

ఒక్కసారిగా ఉగ్రనాగు, దాంతోబాటు చిన్నా పెద్దా సర్పాలన్నీ బిలబిల్లాడుతూ వచ్చి ఆమె చుట్టూ చేరాయి. "ఏమి ఆజ్ఞ మహారాణీ!". అంటున్నట్టుగా. జనమేజయుడు చేసిన సర్పయాగానికికూడా యింత హెచ్చు సంఖ్యలో సర్పాలు వచ్చాయో లేదో తెలీదు గాని, నాగులకొండంతా సర్పాలతో నిండిపోయి చాలా భయంకరమైన దృశ్యం కనిపించింది నవీన్ కి.

"మన స్నేహితుడు చింపాంజీని చంపి, సౌమ్యను యెత్తుకుపోయినదెవరో నాకు చూపించండి!" అన్నది విషకన్య.

ముందు ఉగ్రనాగు, వెనక సర్పాలు, ఆ వెంటనంటి విషకన్య, నవీన్ సౌమ్యను వెతుక్కుంటూ బయల్దేరారు.

* * *

ఆ రౌతు వెళ్ళిపోగానే సౌమ్య నవీన్ పడిపోయిన లోయవైపు మళ్ళీ అడుగులు వేసింది. ఒకవేళ అతను లోయలో సాంతం పడిపోకుండా ఏ రాయినో, రప్పనో పట్టుకొని వేల్లాడుతూ ప్రాణరక్షణకోసం అల్లాడుతున్నాడేమోనని ఆశ! అందుకే అటు నడవబోయింది.

కాని చింపాంజీ ఆలోచన వేరు, ఆమె లోయలో

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 78/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించనవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

దూకెయ్యటానికే వెళ్తున్నదని! అందుకే ఆమెను వెళ్ళనీయకుండా వారించటానికి ఆమెకు అడ్డంగా నించున్నాడు.

సరిగ్గా అదే సమయానికి యెక్కడ్నుంచో నలుగురు ఆటవికులు అటుగా వచ్చారు. సౌమ్యని చింపాంజీని చూడగానే టక్కున ఆగిపోయారు. వాళ్ళలో వాళ్ళే యేదో అర్థంకాని భాషలో కిచకిచలాడారు.

సౌమ్యకి వాళ్ళని చూడగానే పరిస్థితి అర్థమయిపోయింది. వాళ్ళు సింగడి గూడెం తాలూకు వాళ్ళేమో ననుకొన్నది మొదట. కాని వీళ్ళు వాళ్ళకంటె అనాగరికులు!

ఒంటిన గోచీ తప్ప మరే ఆచ్ఛాదనాలేదు. చేతుల్లో వాడి కొనగల ఈటెలున్నాయి. నల్లగా తుమ్మమొద్దుల్లాగా వున్నారు. వాళ్ళ కనుబొమలు దట్టంగా వుండి చిన్న కళ్ళు గుంటల్లా కనిపిస్తున్నాయి. మొరటుగా రాక్షసంగా వున్నాయి చూపులు!

వాళ్ళు నలుగురు సౌమ్యని సమీపించారు. సౌమ్య దాక్కునే ప్రయత్నం చెయ్యలేదు. నవీన్ లేకపోయాక తను బతికి లాభమేమిటి? అతనింకా బతికి వున్నాడనుకోవటం తన భ్రమ! అడుగు భాగంకూడా కనిపించినంత లోతైన లోయలో పడ్డ మనిషి ప్రాణాలతో వుండటం అసంభవం!

అయితే ఈ అనాగరిక ఆటవికులు తనకేదైనా ద్రోహం తలపెడితే? అంతకన్న ముందు ప్రాణత్యాగం చేయటమే మేలు!

ఆటవికులు నవ్వుతూ తుళ్ళుతూ సౌమ్యని సమీపించారు. ఇద్దరు ఆటవికులు ఆమె చెరో చెయ్యి పట్టుకున్నారు.

సరిగ్గా అప్పుడే చింపాంజీ ఎగిరి వాళ్ళిద్దర్నీ తన్నింది. ఒక ఆటవికుడి చేతిలోని ఈటె ఎగిరి అవతల పడింది. తక్కిన ముగ్గురు ఈటెల్తో చింపాంజీమీదికి చేరారు. చింపాంజీ కిందపడ్డ ఈటెను అందుకొన్నది. తనమీది కొస్తున్న ముగ్గుర్నీ గాయపరిచింది చేతిలో ఈటెతో.

ఈలోపల నాలుగోవాడి నుంచి విడిపించుకొని లోయ లోకి దూకెయ్యటానికి పరుగెత్తింది సౌమ్య. ఆమె ఉద్దేశం గ్రహించినవాడిలా నాలుగోవాడు ఆమెను వెనుకనుంచి గట్టిగా పట్టుకొని లాగేశాడు. వాడి పశు బలం ముందు సౌమ్య నిలవలేక తూలి నేలమీద పడి పోయింది. వాడు ఆమెను కదలకుండా పట్టుకొన్నాడు.

ఈలోపల చింపాంజీని తూట్లుతూట్లుగా ఈటెలతో పొడిచేశారు ఆటవికులు. చింపాంజీ నేలకూలిపోయే వరకు వాళ్ళతో వీరోచితంగా పోరాడుతునే వున్నది. కాని ఆటవికులు దాన్ని వదల్లేదు.

చనిపోతూ సౌమ్య వంక జాలిగా, దీనంగా చూసి ప్రాణాలు వదిలేసింది చింపాంజీ.

నలుగుర్లోను ముగ్గురు ఆటవికులు బాగా గాయపడ్డారు. చింపాంజీ వాళ్ళ శరీరాలని తూట్లుచేసింది. అయినా వాళ్ళు నేలవాలిపోలేదు. సౌమ్యని ఎత్తుకొని నాలుగో ఆటవికుడు ముందు పరుగెడుతున్నాడు. గాయపడ్డ ఆట వికులు కూడా గాయాలని లెక్క చేయకుండా అతడివెనుక పరుగెడుతున్నారు.

దాదాపు ఓ అరగంట అడవిలో అడ్డదిడ్డంగా పరు గెత్తారు వాళ్లు. అప్పటికే అడవిలో చీకట్లు ముసు రుతున్నాయి. బహుశా బయటి ప్రపంచానికి సూర్యుడింకా అస్తమించి వుండడు! (సశేషం)

